# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



డిసెంబరు 1971



సంపుటము : 48 : సంచిక . 12 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1971

# అమృతధాని

శ్రీ వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

పాడినపాటనే గళ ర
వంబును మార్చి నవత్వమంచు నే
బాడుదునా ! మనోరుహ వి
పంచిని వంచి రసించి పాడనా ! !
బీడులలోన పైరు మొలి
పించగ కన్నులనీరు వెట్టి—ఏ
గోడును లేని జీవు లొడ
గూడి చరింపగ గోలవెట్టి—నే ! !

బ్రదుకుట కోసమే బ్రదుకు
పాటను—బాటను—మాటగా, గుదుల్
గుదులగు నంతరాయ తిమి
రోగ్ర మహాగ్రహ దుష్టశక్తులన్
ఎదలెదురొడ్డ బాధితుల
కే—పతితాధ్వులకే—పడాళ్ళకే—
రుదితులకే—అనాథులకె—
లోగిన కాల మిదంచు నేరరా ! !

ఇక తలవంచజాలను సు
మీా అధికార మద ప్రహేళికున్ !
ఇకపయి దీనులే—అధము
లే—మరి నీకొర కుండరోయి ! ముం
దుకు మునుముందుకున్ అడుగు
తో నడుగున్ గలుపంగవచ్చు వా

రికి తరుణమ్మిదే ! ఉదయ
రేఖల తమ్ములు తోరణాలవే ! !

భావము త్రోవకే వదలి
పాటకు మాటలు మీటి క్రొత్త యం
చే విధ మేమిలేని గమ
నేచ్ఛయె యౌనొ స్వతంత్రతంత్ర మో
యీ ! విలపింపువోలె పల
పింపును ప్రశ్నము–– నూత్నమౌను ! త
ద్భావన భావమే అమృత
ధని యగున్ అదె నేను బాడెదన్ ! !––

---



# తెలుగు లిపి

## శ్రీ నిడుదవోలు వేంకటరావు

తెలుగుభాష భారతీయదేశభాషలలో అత్యంత మధురమైనదని భాషాసాహిత్యచరిత్రలలో ప్రత్యేక ప్రశంసల నందినది. తెలుగు నిసర్గ మాధుర్యముచే కమనీయ మైనదేగాక, లిపిసౌందర్యముచే రమణీయ మైనది. అనగా, తెలుగున పాటగాని పద్యముగాని వినుచున్నప్పుడు శ్రవణానందము, అవి వ్రాతలో మనోహరమైన గుండ్రని లిపితో నుండుటచే నయనానందము నొక్కమారే మనకు లభించుచున్నవి.

ఆలంకారికముగా

తెలుగుభాష—కర్ణపర్వము.
తెలుగు లిపి – నేత్రపర్వము.

సంస్కృత భారతమున, తెలుగుభారతమున, కర్ణపర్వమున్నను, తెలుగుభారతమంతయు, కర్ణ పర్వమే గాక నేత్రపర్వమై యున్నది.

అచ్చతెలుగులో ముచ్చటించిన—

'తెలుగుపలుకు తీయదనమున వీనులవిందు'
'తెలుగువ్రాలు [1] చక్కదనమున కనులపండుగ'

ఏకకాలములో అటు శ్రోత్రేంద్రియమునకు ఇటు నేత్రేంద్రియమునకు అనిర్వచనీయమైన—ఆనందానుభూతిని గలిగించి, బ్రహ్మానందసిద్ధిని చేకూర్చు లోకోత్తర విశిష్టత — యావద్భారత వర్షమున— ఒక్క తెలుగుభాషలోతప్ప మఱియే యితర దేశభాషలలో లేదు. ప్రపంచ భాషలలో నేభాషయందున్నదో పరిశీలించుట కర్తవ్యము.

నేటి మన తెలుగులిపి కేవలము తెలుగుభాషకే సంబంధించినది కాదు. అందు తెలుగు, సంస్కృత వర్ణములు రెండును గలవు—

తెలుగు వర్ణములు—ఎ, ఒ, ౘ, ౙ, ఱ, ఁ—(6)

సంస్కృత వర్ణములు—అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః; క ఖ గ ఘ ఙ; చ ఛ జ ఝ ఞ; ట ఠ డ ఢ ణ; త థ ద ధ న; ప ఫ బ భ మ; య ర ల వ శ ష స హ ళ—(50)

స్వతస్సిద్ధముగా. ఆఱు వర్ణములుగల తెలుగుభాష ఏభయివర్ణములుగలిగి సమగ్రమైన సంస్కృత వర్ణ సమామ్నాయ మంతటిని, సంపూర్ణముగా తనలో సమ్మేళనము చేసికొన్నది. తెలుగు వర్ణములు, సంస్కృతవర్ణములు రెండును క్షీర నీర న్యాయమున కలసిపోయి, ఏకైకమైన తెలుగుభాషగా రూపొందినవి.

ఇట్లు తత్సమములు—అనగా సంస్కృత పదములు పూర్తిగా కలిసిన మనభాషను 'తెలుగుభాష' అని యెటు వ్యవహరించు చున్నామో, అట్లే సంస్కృతవర్ణములు కలిసిన లిపిని మనము 'తెలుగు లిపి' అని వ్యవహరించుచున్నాము.

తెలుగుభాష—తత్సమ, (సంస్కృత), తద్భవ, దేశ్య పద యుక్తము—

తెలుగులిపి—తత్సమ (సంస్కృత), తద్భవ, దేశ్య వర్ణ యుక్తము—

ఆద్యమై, ఆర్ష విజ్ఞానమునకు, ఆధ్యాత్మిక విద్యకూ ఆలంబనమై, జగన్మాన్యమైన సంస్కృత భాష నామూలాగ్రముగా నాకళించుకొన్నది గావుననే—

1, 'లిపి' అను సంస్కృత పదమునకు, వ్రాయి, వ్రాలు తెలుగు పదములు.

యావద్భారతవర్షమున, తెలుగుభాష సంస్కృతమును, జీవద్భాషగా నిత్యవ్యవహారములో ప్రవర్తిల్లనట్లు నిల్పినది. సంస్కృతము 'మృతభాష' గాదు 'అమృతభాష' అని నిరూపించినది దేశభాషలలో తెలుగే—

## లి పి త త్త్వ ము

భాష ధ్వని ప్రధానమైనది. ఉచ్చారణ వలన ధ్వనులనుండి వర్ణము లేర్పడును. అప్పుడవి శ్రవణ గోచరములు. అనగా చెవితో వినదగినవి. అట్టి వర్ణ స్వరూపమును రేఖావిన్యాసముచే ప్రదర్శించునది లిపి. అప్పుడది నయనగోచరము. అనగా కంటికి కనబడునది. వర్ణములకు స్థిరత్వము గల్గించునది లిపి. అదియే గ్రంథములకు మూలమై సారస్వత రూపమున శాశ్వతత్వము గడించినది. వర్ణసమామ్నాయమే భాషగావున - భాష—లిపి—సారస్వతము — అవినాభావ సంబంధము గలవి.

ఇది శాస్త్ర విషయము — చారిత్రకము — ఆధునికము.

ఇక సనాతన సంప్రదాయ దృష్టితో బరిశీలించిన తెలుగులిపి తత్త్వము మహాగంభీరమైనది. తెలుగులిపి సంస్కృతభాషతో నైకృత చెందినది గావున—ఆధ్యాత్మికమని యీ వఱకే తెలిపితిని.

వర్ణములకు మాతృకలని పేరు గలదు. మాతృకాస్వరూపమే వాగ్దేవి. మాతృకలైన వర్ణములే లిపి కాబట్టి — వాగ్దేవి లిపి స్వరూపిణి. అఖిలవర్ణమయియగు నామె మూర్తిని అప్పకవి యిట్లు వర్ణించియున్నాడు—

సీ. అస్వర మవుదల యా ఫాల మిద్వయి
శ్రవణ యుగ్మం బుకారములు రెండు
కన్నులు బుత్వయుగంబు చెక్కులు ఌ వ
ర్ణద్వంద్వ ముభయ దంతచ్ఛదములు
వక్రముల్ భుజములు వక్రతమాక్షరం
బులు కక్షములు సున్న లలితగళము
పటువిసర్గము లురోభవసూచకంబులు
కచవర్గములు పాణి కరరుహములు

గీ. టాదులైదును గూడఁ బృష్ఠము చతుర్థ
వర్గ ముదరంబు పంచమ వర్గజములు
జఘన మంతస్థలిపులు నూష్మములు నంఘ్రు
లే వధూమణి కట్టి వాగ్దేవిఁ గొలుతు

(అప్పకవీయము—2—393)

## సరస్వతి లిపి స్వరూపిణి

సంస్కృత వర్ణ సమామ్నాయము 50 అక్షరములు

| | | |
|---|---|---|
| అ | తలకట్టు | |
| ఆ | నుదురు | |
| ఇ ఈ | చెవులు | |
| ఉ ఊ | కన్నులు | |
| ఋ ౠ | చెక్కులు | |
| ఌ ౡ | దంతములు | |
| ఏ ఐ | భుజములు | |
| ఓ ఔ | కక్షములు | |
| అం (ం) | కంఠము | |
| అః (ః) | స్తనములు | 16 |
| క వర్గము క, ఖ, గ ఘ, ఙ<br>చ వర్గము చ, ఛ, జ, ఝ, ఞ | చేతులువ్రేళ్లు | 10 |
| టవర్గము ట, ఠ, డ, ఢ, ణ<br>తవర్గము, త, థ, ద, ధ, న | పృష్ఠము | 10 |
| పవర్గము ప, ఫ, బ, భ, మ | ఉదరము | 5 |
| అంతస్థలు ఊష్మములు<br>యరలవ, శ, ష, స, హ, క్ష | పాదములు | 9 |
| | | 50 |

సరస్వతి లిపిస్వరూప. ఒకచేత నామెకు పుస్తకము[2] గలదు. 'పుస్తం కష్యాది కర్మణి'అని అమరము. లిపిస్వరూపము పుస్తకము— అదియే సరస్వతీ స్వరూపము. ఇందువలన విజయదశమినాడు మనము

2. పుస్తశబ్దమున క(ప్రత్యయము చేర్చుటచే—పుస్తకమైనది. పుస్తశబ్దము ఒకప్పుడు తెలుగున వాడుకలో నుండెనేమో. పుస్తశబ్దభవము— పొత్తము.

సరస్వతీప్రతీకమగు పుస్తకము నర్చించుచున్నామనగా లిపి నర్చించుచున్నాము—లిపిపూజ చేయుచున్నాము—అని తాత్పర్యము.

దీనివలన—సంస్కృతమునగల పంచాశద్వర్ణములు సమ్మేళనము చేసికొన్న తెలుగులిపి ఆధ్యాత్మికత్వము మన కవగాహనము కాగలదు.

## లి పి సౌ ం ద ర్య ము

తెనుగు సాహిత్యములో తొలుత లిపి . ప్రసక్తి తెచ్చినవాడు మంచెన. ఆతడు తన కేయూర బాహుచరిత్రలో కృతిపతి గుండమంత్రి ప్రతిభను యిట్లు వర్ణించినాడు.

'సీ. వాచకత్వము, లేఖనోచితత్వము 'నంధ్ర
లిపి' రీతిగా సర్వలిపులయందు
ఫణితి జాతియుఁ దీవ్రభంగియును దెనుంగు
బాస పోలిక సర్వభాషలందు
వదన వికాసంబు.' (1-46.)

క్రీ. శ. 1260 ప్రాంతమునకు—'ఆంధ్ర లిపి' కొక ప్రత్యేకత దక్షిణదేశభాషలలో నేర్పడినది.

గుండమంత్రి తెలుగులిపిరీతిగా, తక్కిన భాషా లిపులను విశదముగా, 'తీవ్రభంగి' అనగా వేగముగాను వ్రాయగల సామర్థ్యముగల వ్రాయసకాడని మనకు తెలియుచున్నది.

క్రీ. శ. 1400 ప్రాంతముల జక్కన విక్రమార్క చరిత్రమున - కృతిపతియగు వెన్నలకంటి సిద్ధనమంత్రి 'వ్రాతనైపుణ్యమును ఇట్లు ప్రశంసించినాడు.

సీ. పా. ఆణిముత్తెముల సోయగము మించిన వ్రాలు
వరుసతో నిరుగేల వ్రాయనేర్చె'[3]

తెలుగు లిపిని — ఆణిముత్తెములతో పోల్చిన మొదటి కవి జక్కనయే. ఆణిముత్తెములతో నక్షరములను పోల్చుటయనగా, తెలుగులిపి చక్కదనమును గుర్తించుటయని యర్థము.

'చక్కనైన వాగ్వైఖరిగల జక్కన
చొక్కమైన తెలుగువ్రాతలోని
చక్కదనము నొక్కి వక్కాణించినాడు.'

నాటినుండియు, ఆతని వ్రాలు—ముత్యాలకోవ వలె నున్నవి అను నానుడి యేర్పడినది.

తెలుగులిపిలో నక్షరముల గుండ్రదనదమునకు తోడు గుణిత[4] క్రమమున హల్లులకు చేర్చబడు స్వరసమాపక చిహ్నములు—(అచ్చులు) శరీరమునందలి యవయవములవలె, నొకదానికొకటి యవినాభావముగ నతుకుకొని యుండుటచేతనే, నీ లిపి కిట్టి యపూర్వ సౌందర్య మితర భాషలలో లేనిది—కలుగుట తటస్థించినది.

గుణిత క్రమము సరిగా పాటించి వ్రాసిన వ్రాత లెట్లుండునో, తెనాలి రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యమున కృతిపతి వేదాద్రి మంత్రి—వ్రాయసమును వర్ణించుచు తెలుగులిపి స్వరూపము నిట్లు విశద పఱచినాడు.

సీ. పల్లె, వ్రటువయును, బరిపుష్టి, తలకట్టు,
గుడి, సున్న, కియ్యయు, సుడియు, ముడియు
నైత్వంబు నేత్వంబు నందంబు మందఁబు
గిలకయు బంతులు నిలుపు పొలుపు
నయము నిస్పందేహతయు నొప్పు మురువును
దచ్చిప్రేసినయటు తనరుటయును

---

3. ఇచ్చట 'నిరుగేల వ్రాయనేర్చె' అన్నది గమనింపదగినది. సిద్ధమంత్రి- కుడిచేతితోనేగాక, ఎడమ చేతితోను నంతచక్కగా శీఘ్రముగా వ్రాసెడువాడట.

4. దీనినే వాడుకలో గుణింతము అందురు. అందువలన నేనీ పదమునే వాడినాను.

5. వ్రాయసము ఈపదము 'రాయసము' గా మార్చరాదు. 'వ్రాయు' తమిళమున వరై ధాతువు నుండి యేర్పడినది· కన్నడమున 'బరదె —తెలుగున గూడ బరి, బరులు—అనుపదములు గలవు.

వాడుకలో—'నీకైదు బర్లువచ్చునా'.

వ్రాయు క్రియ 'రాయు' అన్నచోనెట్టి యర్థ వ్యత్యాసము గలుగునో— 'వ్రాయసము రాయసముగా మార్చినయట్టి యర్థ వ్యత్యా మే గలుగును. వ్రాయు—జన్య పదము లన్నియు వకార రకార సంయుక్తములు.

షడ్వర్గ శుద్ధియు, జాతియోగ్యతయును
వృద్ధిఁ బ్రియత్వంబు విశదగతియుఁ

గీ. గీలుకొన వ్రాయసంబులు వ్రాలువ్రాయు
గొంకు కొసరును చేతప్పు గొనకయుండ
లలిత ముక్తాఫలాకారవిలసనమున
మతి మరున్మంత్రి వేద్రాది మంత్రివరుఁడు
(1—71)

ఈలిపి సాంకేతికములను మన మీనాడు మఱచినాము. పత్తె అనగా గీత; వట్రువ—గుండ్రన; పరిపుష్టి—నిండుదనము; కియ్య—యావత్తు; సుడి వట్రువసుడి; ముడి—మాముడి, తాముడి (మావత్తు తావత్తు);గిలక - వలపలగిలక (ఁ); షడ్వర్గములనగా స్పర్శము లైదువర్గములు; య ర ల వ మొదలగునవి ఆఱవవర్గము.

తెలుగువ్రాలు ముత్యములవలె నుండుటయేగాక ద్రచ్చివేసినట్లు—అనగా ముద్రకై చెక్కినట్లుండెడివి. వేద్రాదిమంత్రి అంత చక్కగా వ్రాసెడివాడు.

పూర్వము బడులలో—గుణింతమును నేర్పునపుడు, పిల్లలకు నోటితో గుణింతమును పలికించి, గుంటలలోనున్న ఆ అక్షరములను దిద్దించేవారు. కా—కాగుడిస్తే కి' —గుడిదీర్ఘమిస్తే 'కీ' — కాకు కొమ్మిస్తే'కు'- కొమ్ముదీర్ఘమిస్తే'కూ —కాకేత్వమిస్తే 'కే'—కాకైత్వమిస్తే'కై'—కాకోత్వమిస్తే 'కో'—కాకు తాముడిస్తే కత 'క్త' —కాకు మాముడిస్తే కమ 'క్మ' — ఇత్యాదిగా అభ్యాసము చేయించే విధాన ముండుటవలన — వారు పెద్దవారైన తరువాత—వ్రాతలలో నేవిధమైన దోషములు—చేతప్పులు--నుండెడివి కావు. వ్రాతయు నచ్చుగుద్దినట్లుండెడిది.—

గుణింతము —స్త్రీవర్ణన

గుణింతముతో స్త్రీవర్ణనచేసిన మహాకవి ప్రౌఢిమ చూడుఁడు.

సీ. తలకట్టువలెమించుఁ దళుకొత్తు నెన్నొసల్
దీర్ఘమైవాల్గనుల్ తేజరిల్ల
గుడుసౌను నతనాభి గుడిదీర్ఘమగు నారు
కొమ్ము నా గేల్దోయి కొమరు మిగులు
వట్రువసుడివోలె వళులు మే ల్జఘనంబు
నేత్వమై బదపొంక మెసగు నైత్వ
మట్లూరులొ నొత్వమట్లగు కనుబొమ్మ
లౌత్వంబువలె వీను లమరుచుండు
గీ. సున్న నడుము విసర్గలు చన్నుదోయి
వలపలగిలకయే భుజములు వనంగ
నలరు 'గుణితంబు' వైఖరిఁ జెలఁగు నంగ
సౌష్ఠవముతోడనున్న దీ సకియ యనుచు.

అకారాది గుణింతముతో స్త్రీవర్ణన పై పద్యమున చేయబడినది.

తలకట్టు (✓) నొసలు
దీర్ఘము (ా) కనుదోయి
గుడుసు—గుండ్రము (ు) నాభి
గుడిదీర్ఘము (ీ) నూగారు
కొమ్ము (ు) రెండు చేతులు
వట్రువసుడి (ృ) నితంబము
ఏత్వము (ే) జడ
ఐత్వము (ై) తొడలు
ఒత్వము (ొ) కనుబొమలు
ఔత్వము (ౌ) చెవులు
సున్న (ం) నడుము—(శూన్యము)
విసర్గ (ః) స్తనములు.

వలపలగిలక (ఁ) భుజములు. ఇట్లు గుణింతమువలె నీమె యవయవము లమరియున్నవి.

స్త్రీవర్ణన—యిట్లు గుణింతముతో చేయుటలో నెంతో చమత్కారమున్నది.

గుణింతము లిపి స్వరూపమును తెలుపునుగదా: అది స్త్రీ యవయవములతో నన్వయింపబడినది. ఇది సహేతుకమే. సంస్కృతభాషలో 'లిపి' శబ్దము స్త్రీలింగము—'లిప్యతే ఽనయా పత్త్రం లిపిః, లిభిశ్చ. ఇ. సీ. లిపి ఉపదేహా'. దీనిచేత పత్రము వ్రాయ

బడును గనుక లిపి. ఇ. సీ—ఇ. సీ. అనగా ఇకారాంత స్త్రీలింగము — (అమరకోశము ద్వితీయకాండ క్షత్ర వర్గము. పుట. 477).

ప్రబంధములలో స్త్రీవర్ణనలన్న నేవగించుకొను నీనాటివారికి, ఆ వర్ణనలలో నెట్టి విశేషములున్నవో వారికి పాఠకలోకమునకు వెల్లడిచేయుటకై పై పద్యము నుదాహరించినాను. ఇది మన విమర్శకులు శృంగార గ్రంథముగా నిషేధించిన హంసవింశతిలో (5—174) నున్నది. హంసవింశతిలో నిరవై అయిదు కథలున్నవి. ఈ 25 కథలు నాయికలకు సంబంధించి నవే. అనగా ఒకే గ్రంథమున నిరువదియైదు పర్యాయములు స్త్రీవర్ణన చేయవలెను. చేసిన వర్ణన చేయకుండ - హంసవింశతిలో, తత్కర్త 25 స్త్రీవర్ణనలు చేసినాడు. ముచ్చటగా, మూడాశ్వాసములలో మూడు మారులు స్త్రీవర్ణన చేసిన—చేమకూర విజయవిలాసము నకు మనము మురిసిపోవుదుము. కాని వింశతి పర్యాయములు వైవిధ్యముతో, స్త్రీవర్ణన గావించిన అయ్యలరాజు నారాయణామాత్యుని విశిష్టప్రతిభను మనము విస్మరించినాము. హంసవింశతి—16, 17 శతాబ్దులనాటి ఆంధ్రుల సాంఘికచరిత్ర తెలుసు కొనుట కొక గని వంటిది. ఇట్టిదే శుకసప్తతి— దానికి హంసవంశతివలె నిషేధముద్ర యున్నది. స్వాతంత్ర్య మనుభవించుచున్న ఈనాడైనను, వాని పర్యాప్తమైన పరిశీలన జరుగలేదు. మనమేమి చేయగలము?6.

తెలుగు ప్రబంధములలో స్త్రీ వర్ణనలను గూర్చి ప్రత్యేక పరిశోధనచేసిన – ఎన్నోఅపూర్వ— అద్భుత విషయములు బయలుపడగలవు.

### చాటువులు

ప్రబంధాలలోనేగాక—చాటువులలోను మన లిపిని గూర్చి—గుణింతాన్నిగూర్చి హృద్యములైన పద్యాలున్నవి. కొన్ని ఉదాహరిస్తాను.

'వ్రాలివిగో గనుంగొనుము
వన్నియ మీఱఁగ వ్రాలకేమి నా
వ్రాలు సుధారసాలు కవిరాజుల
కెల్ల మనోహరాలు వ
జ్రాలు సరస్వతీవిమలచారు
కుచాగ్రసరాలుఁ జూడఁ జి
త్రాలు మిటారి మోహనకరాలు
నుతింప దరంబె యేరికిన్

'చేకొని రాయని బాచఁడు
కాకాలు గుణించు పిదపకాలమునాఁడే
లాకేత్వ మియ్యనేరడు
దాకును కొమ్మియ్య డిట్టి ధన్యుఁడు గలఁడే

లాకేత్వము, దాకు కొమ్ముఅనగా 'లేదు'.

'ఏవ్రాలైనను వ్రాయును
దా వ్రాయడు వ్రాసెనేని నవ్వుచునైనన్
సి వ్రాసి తావడియ్యఁడు
భావజ్ఞుడు రాయనార్యభాస్కరుఁ డెలమిన్.

'నా' వ్రాసి 'సి' కి తావడి (తావత్తు)యిచ్చిన నాస్తి' అగును. ఈరెండును దానమునకు మహా ప్రసిద్ధికెక్కిన రాయని భాస్కరుని గూర్చునవి— అతడెన్నడును లేదు, 'నాస్తి' అని పలికేవాడు— కాదు—వ్రాసేవాడు కాదు.

కవుల వాదప్రతివాదాల్లోను గుణింతము ప్రయుక్తమవుతుంది.

### నకార గుడి

పూర్వము నియోగిఅయిన అడిదము సూర కవికి, వైదికుడయిన—రేకపల్లి సోమప్పశాస్త్రికి వాగ్వి

---

6. కీర్తిశేషులు సురవరము ప్రతాపరెడ్డి గారు — తమ ఆంధ్రులసాంఘికచరిత్రలో వీని రెండింటి ప్రాశస్త్యమును తెలిపియే యున్నారు. వారా చరిత్ర రచించునాటికి పై రెండింటికి సుపరిష్కృత ముద్రణలులేవు. నేడు ప్రకటితములైనవి. కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి హంస వింశతి (వావిళ్ల ముద్రణము) నే నుపయోగించినాను. వారికి నా కృతజ్ఞత.

వాదము జరిగింది. వైదికుడయిన సోమప్పశాస్త్రి ఓడిపోయి వ్యంగ్యంగా సూరకవినిట్లా ఎత్తి పొడిచినాడు.

'జిలిబిలి పలుకులవెలదీ!
పలుగాకి 'నకారగుళ్ల' పాలయితిగదే
ఇలలో వైదికవిద్య
త్తిలకంబుల కేది దారితెల్పితి వమ్మా.

నకారగుడి అనగానియోగి-'న'కు గుడిస్తే-'ని'.

సూరకవి ఊరుకుంటాడా? వెంటనే-'ఆత్మ స్తుతి పరనిందా ఎఱుగని నాకూ పావలాయిచ్చి ఆ పలుగుముండకొడుక్కి పావలా యివ్వడం ఏం న్యాయంగా ఉందయ్యా' అన్నట్లుగా ఉంది అని వ్యాఖ్యానం చేశాడు.

చ కా ర గు డి

సీ. గీ. ఇతరులకు మేలుకీడుల నెంచబోక
కాని పనిచేయువేళ చకారగుళ్లు
తగులకుండగ బోవునే ధరణిజేశ!
భండనారాతిభీమ కోదండరామ!

అని చాటూతి లక్ష్మీనరసకవి తన భండనారాతి భీమాశతకములో 'చకారగుడి' అని 'చివాట్లకు' నుపయోగించినాడు. చ' కు గుడిస్తే 'చి'[7].

గుణింతము నిత్యవ్యవహారములోకూడా వాడుకలో నున్నది అని చూపుటకు పై యుదాహరణలుచూపినాను.

ఇంతచక్కని చిక్కనైన తెలుగులిపిని మన పూర్వులు 'శరవేగము' తో వ్రాసేవారు - అదీరాయని భాస్కరుని కాలమునుండి వచ్చినది.

ఒకనాడు నారదుడు తండ్రియైన బ్రహ్మ వద్దకు వెళ్లినాడు. వారిద్దఱకు నీక్రింది విధముగా సంభాషణ జరిగినది—అది పద్యరూపముతో నున్నది.

నారదుఁడు—మ., సరి బేసై రిపుడేల భాస్కరులు భాషానాథ!

పన్నెండు సరిసంఖ్యగల సూర్యులు-బేసిసంఖ్యయై వారెందువలన (11) అని ప్రశ్న.

బ్రహ్మ: పుత్రా! వసుంధరయం దొక్కఁడు మంత్రియయ్యె

పుత్రా భూమిలో ఒక సూర్యుడు (బాస్కరుడు) మంత్రియై యున్నాడు.

నారదుఁడు: వినుకొండన్ రాయనామాత్య భాస్కరుడో

అతడు వినుకొండయందు — రాయనామాత్య భాస్కరుఁడా?

బ్రహ్మ—ఔ—

అవును.

నారదుఁడు—అయినన్ సహస్రకరశాఖల్లేవే—

అయితే—ఈ భాస్కరునికి సహస్ర(కర) శాఖలు —వేయి కిరణములు లేవే —

బ్రహ్మ—అవే యున్నవే—తిరమై దానము చేయుచో
రిపుల హేతిస్వేయుచో వ్రాయచోన్—
ఈ భాస్కరునికిసహస్రకరములు—వేయి చేతులు గలవు—శత్రువులను ఖండించునపుడు, వ్రాత వ్రాసేటప్పుడు వేయిచేతు లాతనికున్నవి — అనగా ఒక్క చేతితోనే, వేయి చేతులతో చేసినంత కార్యమును వేగముగా నెరవేర్చగలడు—అని భావము. బాణమును చేతులతో గదా ప్రయోగింతురు— ఒక్కచేతితో వేయి బాణములను (శరములను) ప్రయోగించునట్లుగా—నంత వేగముతో వ్రాయగలడు అని యర్థము— పద్యమిది.

మ. సరి బేసై రిపుడేల భాస్కరులు భాషానాథ! !
పుత్రా! వసుం
ధర యందొక్కఁడు మంత్రియయ్యె
వినుకొండన్ రాయనామాత్య భా
స్కరుఁడో; ఔ; అయినన్
సహస్రకర శాఖల్లేవె—అవేయున్నవే—

---

7. ఇవి యింకా నిఘంటువుల కెక్కలేదు—శబ్దరత్నాకర సంస్కరణములో నిట్టివానిని చేర్చినాను.

తిరమై దానముసేయుచో రిపుల
హేతిన్ వ్రేయుచో వ్రాయుచోన్! 8

## లి పి ర క్ష ణ — లే ఖ కు లు
## శి ష్ట క ర ణ కు ల జు లు

తెలుగు లిపి సౌందర్యమును తరతరములుగా వంశపారంపర్యముగా, చెక్కుచెదరక నిల్పి, సంరక్షించిన వారు శిష్టకరణకులజులు. వీరాంధ్రదేశమున — ఉత్తరమున నేటి శ్రీకాకుళమండలములో. నున్నారు. వీరు చిత్రగుప్త వంశీయులగుటచేత- తెలుగు లిపిని ఒక కళగా నుపాసించినవారు. వీరి తాళపత్ర లేఖన నైపుణ్య మసమానమైనది. వీరి సామర్థ్యమును గూర్చి యొక చాటువును చూడండి.

ఉ. మేదినినాథు డల్గినను
మించిన కార్యము చక్కసేయ స
మ్మోద మెలర్పఁగా గణక ముఖ్యుని
సఖ్యము లెస్స యెట్లనన్
ఆదట కాలు డల్గియు 'గ'తాయువ
టన్ననుఁ జిత్రగుప్తుఁ డా
'గా' దొలగించి 'శా' మొదట
గ్రక్కున వ్రాసి సజీవుఁ జేయఁడే.

యముడొక జీవిని—గతాయువుగా చేయమని ఆజ్ఞ యిచ్చినా—చిత్రగుప్తుడు—ఆ 'గ'తాయువులోని 'గ'కు బదులు—'శ' వ్రాసి—ఆతనిని 'శ'తాయువు చేయునట.

## లే ఖ కు లు

శిష్టకరణకులజులేగాక, ఆంధ్రదేశమున నాది కాలమునుండియు, లేఖకులే లిపి సౌందర్యమును సంరక్షించినవారు. పూర్వకాలమున—కవి కెంత ప్రాధాన్యముగలదో లేఖకున కంత ప్రాధాన్యము గలదు. మునుపు కవిత్వము చెప్పట—లేఖకుడు వ్రాయుటే గాని—కవి స్వయముగా వ్రాయు నాచారములేదు. తిక్కనకు కుమ్మరి గురునాథుడను లేఖకు డుండినట్లు మనకు తెలియుచున్నది. అల్లసాని పెద్దన—'ఊహ దెలియంగల లేఖకుల' నుట్టంకించిన సంగతి యందఱెఱుగుదురు. తెలుగులిపి సౌందర్యమునకు ముగ్ధులై, తంజావూరి మహారాష్ట్ర రాజులు—వారిలో ముఖ్యముగా శహజీ మహరాజు తెలుగు లేఖకులకు రాజ్యాంగమున నొక ప్రత్యేక నిబంధనము చేసియున్నాడు. వందలకొద్దీ తాళపత్ర ప్రతులను వ్రాయించినాడు.

ఈనాడు తంజావూరిలోనేగాక మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో (నే డిందలి తాళపత్ర గ్రంథములు తిరుపతిలోనున్నవి) మున్న తాళపత్ర గ్రంథములలోనున్న ముద్దులుమూట గట్టెడు తెలుగులిపిని చూచినట్లయితే—వానిని కన్నుల కద్దుకొన వలసినదే.

ఇంతవఱకును ప్రభుత్వమువారుగాని యితర సాహిత్య సంస్థలుగాని— ఆర్కైవ్ఖ వారుగాని—తెలుగు లిపి సౌందర్యమును వెల్లడించు తాళపత్రలేఖనములకు ఛాయా చిత్రములను దీయించి, వానిని ప్రదర్శించు ప్రణాళిక తలపెట్టలేదు.[9] అట్టిది ఫలవంతమైన—తెలుగులిపి సౌందర్యము భారతీయభాషలలోనేగాక ప్రపంచభాషలలో నేభాషకులేదని నిరూపింపవచ్చును.

లేఖకు డింత చక్కగా వ్రాసియు, తన తప్పులను క్షమింపుమని పాఠక లోకము నిట్లు వేడుచున్నాడు.

మ, తలకట్టీత్వము కొమ్ము నేత్వమును
నైత్వం బేత్వమున్ బొట్టులున్
బలుసంయుక్తపుటక్షరంబులు
విరామ ప్రాస శబ్దాదు లిం
దులఁ జేతప్పినదప్పు నజ్ఞుఁడను నన్
దూషింప కా తప్పు లో

8. ఈ పద్య 'మప్పకవీయము' తృతీయాశ్వాసమున అనుస్వార సంబంధ యతులకు లక్ష్యముగా నుదాహరింప బడినది.

9. తెలుగులిపి సౌందర్యమును—తిరుపతి దేవస్థానమున భద్రపఱుపబడిన తాళ్లపాకవారి సంకీర్తనలు లిఖింపబడిన రాగిరేకులపై చూడవచ్చును.

ప్పులుగా దిద్దుదు పెద్దలార మిము
నే ప్రొద్దుం బ్రశంసించెదన్'

లేఖకులు లిపి సౌందర్య రక్షణమున నెంత యభినివేశము గలవారో పై పద్యము దెలుపును.

తెలుగులిపి సౌందర్యము తెనుగుభాషవలె దివ్యత్వము నందినది.

## నన్నయ—అక్షర రమ్యత

తెలుగున నన్నయ కావ్యవ్యాకరణచ్ఛందస్సంప్రదాయములకేగాక, తెలుగులిపిసౌందర్యము నావిష్కరించుటయందు ప్రథమాచార్యుడు. నన్నయకు పూర్వము తెలుగు కన్నడభాషల కొకే లిపి యుండెడిది. 'వేంగీచాళుక్యలిపి' అని దానిపేరు. నన్నయకుముందు శాసనము లన్నియు వేంగీచాళుక్యలిపిలోనే వ్రాయబడుచుండెడివి. ఆ లిపి చతురస్రముగాను, తలకట్లు గీతలవలె నుండుటచేతను, వ్రాతసాధనములు మాఱుటచే సంస్కరణము ఆవశ్యకమయ్యెను.

నన్నయ కాలముననే తాటాకు గంటము వ్రాతకు ప్రధాన సాధనములుగా నేర్పడినవి. తాటాకుపైని గంటముతో వ్రాయునప్పుడు తలకట్లు అడ్డుగీతలుగా వ్రాసిన తాటాకు చిరిగిపోవును. తలకట్టు—అనగా అకారముననేగాక, ఆ దీర్ఘము వ్రాయవలసివచ్చినప్పుడు, ఆ దీర్ఘమును నిప్పటిపలె ా వ్రాయక, ▭ అని నిలువుగీతగా వ్రాసెడివారు. ఒ కార చిహ్నముగు కొమ్ము '▭' '▭' అని గీతగానే యుండెడిది. వర్గపంచమాక్షరములతో సంయుక్తాక్షరములు — ఙ్క, ఞ్చ, ణ్బ, న్త, మ్ప—అను రీతిగా వ్రాసెడివారు. ఇట్టివి తాటియాకుపై వ్రాయుట కష్టసాధ్యము.

నన్నయ—వీనిని పరిశీలించి, తెలుగు లిపిని చతురస్రస్వరూపమునుండి గుండ్రదనము నీ క్రింది మార్పులుచేసి—సుందరస్వరూపము నేర్పఱచినాడు.

1. తలకట్టు — గాక ✓ ఇట్లు వంపుతో వ్రాయుట.
2. కొమ్ములు— ా గాక ▭ ,,
3. ఙ్క—ఞ్చ—ణ్డ—న్త మ్ప—అనునవి పంక—చంచ—ఖండ—నంద—డింబ—అనురీతి పూర్ణబిందువులుగా వ్రాయుట.
4. రకార సంయుక్తాక్షరములను 'ర్క' 'ర్త' 'ర్ప' మొదలగునవి అర్క—అర్క; కర్త—కర్త; తర్ప—తర్ప అనునవి 'ఱ' ఈ చిహ్నముతో వ్రాయుట. ఈ ఱ చిహ్నమునకే 'వలపలగిలక' యనిపేరు.

ఈ 'వలపలగిలక'వలన రకార సంయుక్తాక్షర వర్ణములేవియు సంయుక్తాక్షరములుగానుండక—ఏకాక్షరములుగా నుండును. ఇందువలన లిపికి సమత యేర్పడును.

5. అంతకుపూర్వమున్న—'ఊ' అను నక్షరమును తొలగించి (ఇది బండి 'ఱా' కన్న భిన్నమైనది—'ష జ' అను నుచ్చారణ గలది) 'డ' గా వ్రాయుట.

పై మార్పులవలన—తెలుగు లిపికి గుండ్రదనము, సౌందర్యము చేకూరినవి. తెలుగు లిపియందు పైమార్పులు చేయుటయేగాక నన్నయ, తాను స్వయముగా వ్రాసిన నందంపూడి శాసనమున—తాను ప్రతిపాదించిన సంస్కరణలిపిని ప్రవేశపెట్టి—ఆ వెనుక తాను వ్రాసిన మహాభారతము నా లిపిలోనే వ్రాసియున్నాడు.[10] తెలుగక్షరములకు, నంతకు ముందులేని — రమ్యతను — లేక మనోహరత్వమును తాను ప్రతిపాదించుటచేత—నన్నయ—

'సారమతింగవీంద్రులుః బ్రసన్న
కథా కలితార్థయుక్తి లో

---

10. నన్నయ్య తనకాలమున తాను ప్రవేశపెట్టిన—లిపితో భారతము నెట్లు వ్రాసినాడో—భారతమున మొదటి ఆరు గద్య పద్యముల కీర్తిశేషులు—చిలుకూరి నారాయణరావు, భావరాజు కృష్ణారావుగార్లు వ్రాసి చూపినారు — చూ. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక--పుట 43. (1922)

నారసి మేలువా నితరు 'అక్షర
రమ్యత' నాదరింప'

అని తెలుగులిపిసౌందర్యమును వ్యక్తపఱచి నాడు. అర్థ ముక్తి శబ్ద సంబంధమైనది—అక్షర రమ్యత లిపి సంబంధమైనది—రెండింటి సమ్మేళనము నన్నయ కవితలో గలదు.

## యతులు ప్రాసలు-లిపి

యతిప్రాసలు—కేవలము ఛందస్సునకు సంబంధించినవి కావనియు, అవి వ్యాకరణమునకు—లిపికి సంబంధించినవని తన భారతము మూలముగా నిరూపించిన కవితాస్రష్ట నన్నయయే. ఇంతవఱకు ఛందస్సును గూర్చి వ్రాసిన వారెవ్వరు నీ విషయమై తడవనేలేదు. చిన్నయసూరి బాలవ్యాకరణమున 'పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళి ప్రాసంబులు నాఁబడు' (ప్రకీర్ణపరిచ్ఛేదము—23 సూ) అనుఛందశ్శాస్త్రమునకు సంబంధించిన సూత్రము వ్యాకరణమునందెట్లు ప్రవర్తింపజేసెనో వ్యాఖ్యానకారు లెవ్వరును విశదీకరింపలేదు.

## యతిప్రాసలలో

యతులు—స్వరములు—అచ్చులు
ప్రాసలు—వ్యంజనములు—హల్లులు

అచ్చుల, హల్లుల సమ్మేళనమే శబ్దము. యతి ప్రాస నియతి గలది పద్యము. పద్యములలో, ఏయే స్వరవ్యంజనముల కాయా స్వరవ్యంజనములతో మాత్రమే యా స్థానములలో నియతముగా మైత్రి యుండవలెను. ఇందువలన వ్యాకరణమునకు ఛందస్సునకు నవినాభావసంబంధము గలిగినది.[11]

యతిప్రాసలుపై వర్ణమైత్రి మూలమున—శబ్దస్వరూపమును నిర్ధారణ చేయును. వ్యాకరణమున సంధి, ఆగమము, ఆదేశము, మున్నగు సమస్త కార్యములు—కవి ప్రయోగములలో యతిప్రాసల మూలమున నిర్ధారకములగుటచేత—తన వ్యాకరణమున చిన్నయసూరి పై సూత్రము ననుసంధించినాడు. చిన్నయసూరి పై లక్షణమునకు—లక్ష్యము నన్నయ కవితయే—

పై వివరణమునుబట్టి యతిప్రాసలు వర్ణ సమామ్నాయమునకు సంబంధించినవనుట! స్పష్టమైనది. లిపి వర్ణ సమామ్నాయ ప్రదర్శకమే గావున లిపికి— యతిప్రాసలకు నవినాభావసంబంధము గలిగినది.[12] ఈ విషయము నిరూపించుటకు నన్నయ కవితనుండి యొక్క యుదాహరణము చూపుచున్నాను.

## వలపలగిలక యతి

నన్నయ తనకాలమున—లిపిలో వలపలగిలకను నిర్దేశించెనని యీ వఱకే తెలిపియున్నాను. తానట్లు స్వయముగా శాసనమున వ్రాసిచూపుటయేగాక, తన భారతమున నీ యతిసంప్రదాయమును విధిగా పాటించి యున్నాడు.

ఒక సంయుక్తాక్షరమున—మొదటి హల్లు రేఫగానుండి రెండవ హల్లు మఱియొక హల్లుగా నున్నప్పు డట్టి సంయుక్తాక్షరమునకు, రెండు హల్లులకు యతి వేయవచ్చును.

ఉదా. 'ధర్మ' అని 'ర్మ' యతిలో నున్నది. అందు రకారమునకు, మకారమునకు రెండింటికి యతి చెల్లింపవచ్చును. ఇది సంయుక్తాక్షరయతి.

---

11. సంస్కృత భాషా కవితలో యతి ప్రాసలు నియతములు కావు. అందు ఛందశ్శాస్త్రము వేఱు : వ్యాకరణ శాస్త్రము వేఱు.

12. యతిప్రాసలకు లిపికి గల సంబంధమును గూర్చి యింతవఱకు నెవ్వరును పరిశోధింప లేదు. నేను ప్రథమముగా పరిశీలించి 'భాషాశాస్త్ర పరిశోధన—యతిప్రాసతత్త్వము' అను వ్యాసమున నా సిద్ధాంతము లను వెల్లడించితిని. (Annals of Oriental Institute—Madras University. Vol. XV, Nos. 1&2—1958—1959: 38 పుటలు.

ఇక అట్టి రేఫసంయుక్తాక్షరమునే వలపల గిలక సంప్రదాయమున వ్రాసిన—అది సంయుక్తము గాక—ఏకాక్షరమే యగును.

ధర్మ

వలపలగిలక లిపిలో పై రీతి వ్రాసినయెడల—నిందు ఒక్క 'మ'కారమునకే—యతి వేయవచ్చును గాని—రకారమున కెంతమాత్రము వేయవీలులేదు. 'రేఫ' అర్ధాచ్చు గావున—అది హల్లుతో సమ్మేళనము నొందును. సంయుక్తముగా వ్రాసిన—'ర'కారధ్వనికి ప్రాధాన్యముగాని, వలపలగిలకగా వ్రాసిన—రకారధ్వని లీనమైన హల్లునకే ప్రాధాన్యముగలిగి—భాషాపరిణామ తత్త్వము విశదముచేయును.

రకారసంయుక్తాక్షరమైనప్పుడు, యతిలో రెండువిధములైన ధ్వనులుండి—అవి శ్రవణసౌఖ్యము గలిగింపనేరవు. వలపలగిలకలో నొకేవిధమైన ధ్వని యుండుటచేత, ఆ యతికి శ్రవణసుభగత గలుగును.

నన్నయ, యిట్టి సూక్ష్మము, గంభీరమునగు శబ్దధ్వనితత్త్వముననుసరించి, తన భారతభాగమున నీ వలపలగిలక యతి నియమమును అసిధారావ్రతముగా పాటించియున్నాడు. కొన్ని ఉదాహరణలు చూపుచున్నాను.[13]

| | | | |
|---|---|---|---|
| దుర్భర | ర్భ | పద్య | ఆది 1—21 |
| ర్ణార్జన | ర్జ | శోభి | 1—49 |
| నిర్ఘాత | ర్ఘా | క్షత్రో | 1—78 |
| దుర్మద | ర్మ | మత్తు | సభా 1—53 |
| మార్గము | ర్గ | గావు | 2—181 |
| పర్వత | ర్వ | వంతు | అరణ్య 2—311 |
| నార్దన | ర్ద | దర్ప | 3—167 |
| కర్పూర | ర్పూ | పూర | 4—142 |

దిఙ్మాత్రముగా చూపితినిగాని నన్నయలో నిట్టి వలపలగిలక యతులు రెండువందలకు పైగానున్నవి.[14] ఇందువలన నన్నయ కవిత చెవుల కింపగుటయేగాక—నన్నయ లిపి కన్నుల పండువైనది.

నన్నయ యతిప్రాసతత్త్వమును జీర్ణించు కొన్న శివకవులు—(పండిత మల్లయ, నన్నెచోడ, పాల్కురికి సోమన—యథావాక్కుల అన్నమయ్యలు)పై వలపలగిలక యతిప్రాస[15] సంప్రదాయమును చక్కగా పాటించినారు. ఇప్పటికే వ్యాసము, పెద్దదియైన కారణమున నిందు, వలపలగిలక ప్రాసలనుగూర్చి వివరింపలేదు.

తిక్కనాది కవులీ వలపలగిలక యతి పాటింపనే లేదు—ఉదా.

'ధర్మరతుండైన యజాత శత్రునకు
నింద్రప్రస్థ మిమ్మంచు
ఇచట 'ర్మ'లోని 'ర'కు 'ద్ర'లోని 'ర'కు యతి.
(భీష్మ 3—435)

'ర్మ' 'మ' అని వలపలగిలక సంప్రదాయమున లిఖించిన యతి తప్పును. దీనినిబట్టి—నన్నయ యతిప్రాసలలో ప్రతిఅక్షరమును నెంతజాగరూకతతో, విచారణచేసి పరిశీలింపవలెనో తెలియగలదు.

తెలుగు సాహిత్య ప్రపంచమున—భాష, ధ్వని, లిపి, శాస్త్ర నియమములను సంపూర్ణముగా నాకళించు

13. అన్ని ఛందోగ్రంథములను పరిశీలించి—యతులన్నింటిని యిచ్చినానని చెప్పుకొన్న అప్పకవిగారి అప్పకవీయమున—నీ 'వలపలగిలక' యతిప్రస్తావనయే లేదు. అప్పకవీయమునుగూర్చి వెలువడిన విమర్శలలో నిది అంతకంటె మృగ్యము.

14. నన్నయ యతులను గుఱించి యింత వఱకు కూలంకషమైన వ్యాసంగము జరుగనే లేదు. నేను ప్రథమముగా, నన్నయయతులను ప్రాసలను గూర్చి పరిశ్రమించి— నన్నయ ప్రయోగములను వర్గీకరించి—నన్నయయతులనుగూర్చి పండితుల నవమార్గమున బెట్టిన అప్పకవీయమును—విమర్శించి సప్రమాణికమైన గ్రంథము రచించియున్నాను.

15. వలపలగిలకప్రాస—అప్పకవీయమున లక్ష్య లక్షణములతో ప్రత్యేకముగాలేదు.

కొని, వానిని యతిప్రాసలమూలమున—తెలుగు కవితలో నిబంధించి, తన కవితను శ్రోత్రపర్వముగానే కాక నేత్రపర్వముగాచేసినది నన్నయయే. నన్నయ సృష్టించిన యీ కవితామార్గమును, తరువాతి వారెవ్వరును ననుసరింపలేకపోయిరి. కావున, వ్యాసరచిత భారతమున కాతడు వ్యాసుడుగాక 'వాల్మీకి' యయ్యెను.

యతిప్రాసలలోనేగాక కావ్యములలో కవులు మన లిపిస్వరూపము నెట్లు శాశ్వతముగా వెలయజేసిరో తెలియజేయుట కొక యుదాహరణ చూపి దీనిని ముగించుచున్నాను.

## శ్రీ కా ర ము

నన్నయమొదలు చిన్నయవఱకును కావ్యములన్నియు 'శ్రీ'తో ప్రారంభము[16]—'శ్రీ'తో ప్రారంభించి, మంగళమహాశ్రీవృత్తముతో కావ్యము-సమాప్తమయ్యెడిది. నన్నెచోడ మహాకవి కుమారసంభవములో—పార్వతీసౌందర్యవర్ణనలో ఆమె వీనుల నిట్లువర్ణించి యున్నాడు.

క. సారము లాశ్రిత భాషా
సారము లాసకలవస్తుసంపూర్ణాలం
కారంబులు శ్రీ వర్ణా
కారంబులు చెవులు సుకవికావ్యము వోలెన్
(3—67)

పార్వతీదేవి చెవులను, 'శ్రీ' వర్ణముతో పోల్చి యున్నాడు.

నన్నెచోడ మహాకవి యిట్లు చెవులను శ్రీకారముతో పోల్చుటయం దెంతో అర్థము గర్భీకృతమై యున్నది.

నన్నెచోడని కాలమునాడు 'శ్రీ'కారము ప్రస్తుతమున్న రీతిని అనగా 'శ్రీ' అనునట్లు వ్రాసెడి వారు కారు. దానిని 'శ్రీ' అనురీతిగా లిఖించేవారు. ఇది చెవియొక్క ఆకారమును పోలియుండుటచే — కవులు చెవులను శ్రీకారముతో పోల్చినారు.[17]

దీనినిబట్టి యీవర్ణన లిపిసంబంధమైనదగుట స్పష్టము. శబ్దమును—గ్రహించునది 'చెవి'. సంస్కృతమున — చెవికి పర్యాయ పదములైన — శ్రోత్రము, శ్రవణము, శ్రుతి అను శబ్దముల వ్యుత్పత్తి చూచిన నిది తెలియును.

'శ్రోత్రము' — శ్రుణో త్యనేనశ్రోత్రం—; శ్రుతిః సీ. శ్రవణం శ్రవశ్చ స. న శ్రు, శ్రవణే — దీనిచేత వినదురుగనుక.

శ్రోత్రము
శ్రుతి
శ్రవణము
శ్రవస్సు—

అనునవి — చెవులపేళ్ళు. (అమరము ద్వితీయ కాండ - మనుష్యవర్గ). కావ్యము శ్రవ్యము—అనగా విన దగినది కాబట్టి. అది శ్రీ శబ్దముతో ప్రారంభమగుట ఎంతయు సార్థకమైయున్నది. కావ్యము శ్రీ తో ప్రారంభించి, మంగళమహాశ్రీ వృత్తముతో ముగించు నాచార ముండెడిదని యీ వఱకే తెలిపితిని. ఆది 'శ్రీ' తో అంతమందు 'శ్రీ' యున్నచో, నదియు చెవి యొక్క ఆకారముతోడనే లిఖింపబడుచుండెడిది గావున—

**'తెలుగుకావ్యము ఆదినుండి అంతము వఱకూ వినదగినది—వినవలయును'—**

అన్న కావ్యధర్మము ప్రతిపాదిత మైనది. ఇదియే పురాణశ్రవణము. కావ్యరూపమున నున్న మన

---

16. నవ్యకవిత్వమున ఖండకావ్యములు దీని కపవాదము—అయిన ప్రాచీన సంప్రదాయానుసారము రచింపబడిన నేటి కావ్యము లన్నింటియందు, శ్రీకార మాదియం దున్నది.

17. ఆనాటి శిలా తామ్ర శాసనాదు లన్నింటియందు శ్రీకార మిట్లే యుండెడిది. చూ. గోకర్ణ దేవుని శిలాశాసనము—క్రీ. శ. 1127. ఈ శాసన ప్రతిబింబము—భారతి—సం. 3. సం. 3 (మార్చి 1927 లో) కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు ప్రకటించినారు. అందు 'శ్రీ' చెవి ఆకారముతో నున్నది. దీనిని గూర్చి అందు వివర మున్నది.

పురాణము లన్నియు పురాణపద్ధతిని మనము విను నవియేగాని సాహిత్యముకొఱకు చదువునట్టివిగావు.

సంస్కృతమున నే పురాణముగాని, కావ్యనాటక ములుగాని శ్రీతో ప్రారంభముకావు. అట్టి నియమము లేనేలేదు. తెలుగున నట్లుగాక, ప్రతికావ్యమేగాక సాహిత్యప్రక్రియ లేరూపముననున్నను అవి 'శ్రీ'తో ప్రారంభము కావలిసినదే[18].

అప్పకవీయమున నీ శ్రీ'కారప్రభావము చాలగా వర్ణితమై యున్నది. అది శుభప్రదము.

వేదములకెల్ల నోంకార మాదియైన
కరణి కృతులకునెల్ల శ్రీకార మాది
గాన కవివరులెల్లను దాని దక్క
నితర వర్ణంబు లిడరు సత్కృతుల మొదల
(2—354)

ఇట్లున్నను సంస్కృతమున—'శ్రీ' శబ్దము నకు—శుభము—లక్ష్మీప్రదము అని మాత్రమే అర్థము లున్నవిగాని — శ్రవః పర్యాయముగాలేదు.

'సంపత్తి శ్రీశ్చ లక్ష్మీశ్చ.'

శ్రీః—ఈ— సీ-శ్రయతి హరి మితి శ్రీః— విష్ణువు నాశ్రయంచునది.

శ్రియతె జనై రితిశ్రీః-ఈ —సీ—శ్రిఞ్ — సేవాయాం—జనులచే నాశ్రయింపబడునది.

లక్ష్యతే లక్ష్మీః—ఈ—సీ — లక్ష దర్శనాంక నయో—జనులచేఁ జూడఁబడునది.

అమరము—ప్రథమకాండ—32 పుట.
ద్వితీయ కాండ—513 పుట.

సంస్కృతమున లక్ష్మి పర్యాయపదమగు — శ్రీ శబ్దమును తెలుగులిపిమూలమున 'శ్రీ'—శ్రవణ పర్యాయముగా నర్థసృష్టి చేసినవారు తెలుగు కవులు. ఇది తెలుగువారి లిపి నిర్మాణప్రతిభకు నికషోపలము.

శ్రీ శబ్దమునకు తెలుగులిపిమూలమున నేర్పడిన 'శ్రుతి' అను అంతరార్థమును గ్రహించియే నన్నయ—తెలుగు మహాభారతము, పంచమవేదము కావున—శ్రుతి — వేదముతో — సమానమైనదిఅన్న లోకోత్తరార్థమును—

'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ
దధతోవక్షో ముఖాంగేషు యే'

అని శ్రీకారముతో ప్రారంభించి, ఆంధ్రభాషా కావ్య శ్రీకి—శ్రీకారము చుట్టినాడు. తెలుగు కావ్యము—శ్రుతివలె—ఆచంద్రార్కము శబ్దజ్యోతిని వెలిగించుచున్నది.

ప్రాచీనసాహిత్య కావ్యపఠనమునం దభినివేశము క్రమముగా క్షీణించి, విస్మృతము కాబోవుచున్న యీ సమయమున వానియందెట్టి యమూల్యాంశము లున్నవో తెలిపి, వానివైపు దృష్టి మరల్చుటయే యీ వ్యాసోద్దేశము.

ప్రాచీన సాహిత్యమునుగూర్చి కూలంకషముగా కృషిచేయుట కనువగు ప్రణాళిక నేర్పఱచి—ప్రాచీనాంధ్రభాషా సాహిత్య సంస్కృతులను, పునరుజ్జీవింప జేయుట అత్యంతావశ్యకమని ఆంధ్ర విద్వల్లోకమునకు వినయముతో విన్నవించుచున్నాను.

---

18. ఈ 'శ్రీ'కారమునుగూర్చి — తెలుగు కావ్యములలో వాని ప్రసక్తినిగూర్చి—నా ఉదాహరణ వాఙ్మయమున విపులముగా వివరించినాను. చూ. పుటలు—41—44-నూతన ముద్రణము (1968).

# పనికిరాని పాఠాలు

శ్రీ మంచిరాజు వెంకటరావు

సుబ్బరామయ్యగారి చిన్నతనంలో అనేకమంది దైవజ్ఞులు చెప్పారు: 'వీడుపట్టింది బంగార మౌతుంది. వీడియిల్లు నాలుగిళ్ళౌతుంది. వీడన్న మాట రాజశాసనం.' ఇలా జ్యోతిష్కులు చెప్పినప్పుడల్లా 'సుబ్బరామయ్య' ముక్కుపుటా లెగరేసేవాడు.

'నా మీద అభిమానంకొద్దీ మీ రలా అంటున్నారు గాని, ఈ చవట చదువులో రాణించటం లేదండీ,' అనేవారు వాళ్లనాన్న రంగయ్యగారు.

'మనిషన్న వాడికి తారాబలం, చంద్రబలం వుండాలిగాని, చదువెందుకండి రంగయ్యగారూ. మన సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృతాంధ్రాల్లో మహావిద్వాంసుడు. వేదపురాణాలు ఆమూలాగ్రంగా, వ్యాఖ్యానసహితంగా చదివేశారు. అయితేయేం, చెంబు తెల్లగాతోమి మీ యింటికీ మా యింటికీ యాయవారానికి రానిరోజు డొక్కాడదు. చదువెందుకండీ, దిక్కుమాలిన చదువు!' అని జ్యోతిష్కులు వక్కాణించేవారు. రంగయ్యగారు గర్వంగా మీసాలు వొడేసుకునేవారు.

జ్యోతిశ్శాస్త్రాన్ని తిరస్కరించేవారికి, సుబ్బరామయ్య వృద్ధిలోకివచ్చిన తీరు చెప్పుదెబ్బగా పరిణమించింది. స్కూలుఫైనల్ ఐదవసారి తప్పిన సుబ్బరామయ్య, రంగయ్యగారితో నిష్కర్షగా ఒకమాట చెప్పాడు: 'నాన్నా, ఏటి కెదురీదటం నాకిష్టమేగాని, ఆ పని ఈ చదువనే ఏటిలోకాక మరి దేంట్లోనైనా చేస్తాను. నా బుర్ర పోనిదాంట్లో న న్నిరికించి చంపకు.'

'అయితే లక్షణంగా పెళ్లిచేసుకుని యింటిపట్టున పడుండు' అన్నారు రంగయ్యగారు. సరే నన్నాడు సుబ్బరామయ్య.

భార్య కాపరానికివచ్చిన కొద్దిఏళ్లకే సుబ్బరామయ్య రాజకీయాల్లో ప్రవేశించాడు. కాని అప్పట్లో చాలామంది తెలివితక్కువవాళ్లలాగ కళ్లుమూసుకుని దూకలేదు. అయాచితంగా అతని వొళ్లో—నిజానికి తండ్రి వొడిలో—వాలిన సదవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నాడు. మద్రాసురాష్ట్రపు ఎసెంబ్లీకి ఆ యేడాది ఎన్నికలయ్యాయి. ఆ యెన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థిగా ఒక యువనాయకుడు నిలబడ్డాడు. వయస్సులో తక్కువయినా ఆ నాయకుడు అప్పటికే దేశవ్యాప్తంగా పెద్దపేరు సంపాదించుకున్నాడు. అతనికి ప్రత్యర్థిగా, జస్టిస్‌పార్టీవారు, ఒక యువతరం పెద్దమనిషిని నిలబెట్టాలని వెతకటం ప్రారంభించారు. జస్టిస్‌పార్టీ అభ్యర్థికి కావలసినవి మూడే అర్హతలు ప్రకటించారు.

ఒకటి : అభ్యర్థి స్వంతఖర్చుతో ఎన్నికల ప్రచారం చేసుకోవాలి.

రెండు : యువకుడు—ముప్పైఏళ్లలోపు వాడుగా వుండాలి.

మూడు : ఆ ప్రాంతాల్లో ప్రాబల్యం కలిగిన కులానికి చెంది వుండాలి.

ఈ అర్హతలన్నీ సుబ్బరామయ్యలో కనిపించాయి. రాష్ట్రవ్యాప్తంగా జస్టిస్‌పార్టీ ఎన్నికల తతంగం నడుపుతున్న రావుబహద్దర్ సూర్యారావు నాయుడుగారు స్వయంగా వచ్చి రంగయ్యగారిని అడిగారు. ఆయన చప్పరించేసి, 'అవతల నిలబడేవాడు వయస్సులో చిన్నవాడైనా మేధావి. మావాడికీ ఆయనకీ వయస్సులో తప్పిస్తే పోలికలేదు. నెగ్గని పెట్టని ఎన్నికకిఏగిరి డబ్బుతగలెయ్యటం నా మతం కాదు.' అన్నారు.

అంత సులువుగా పోనిచ్చే వార్తైతే నాయుడు గారు రావుబహద్దర్ అయ్యేవారే కాదు.

'రంగయ్యగారూ, మీ పిల్లవానికి యేది వుండినా లేకపోయినా సుబ్బరమైన కులం వున్నది' అన్నారాయన తెచ్చిపెట్టుకున్న యాసతో.

'అదేమిటండీ, కాంగ్రెస్ అభ్యర్థికి కులం తక్కువేమిటి ? బ్రాహ్మడు !' అన్నారు రంగయ్య గారు.

'అదే కులంతక్కువంటే !' అని అర్థ యుతంగా దళసరి అద్దాల కళ్లజోడు మెరిపించారు నాయుడుగారు. ఆయన మేధావిఅని భయపడకండి. మేధస్సు వోటర్లకు అర్థంకాదు. కులం అర్థమవు తుంది. కొద్దిపాటి డబ్బుఖర్చుకు వెనుకాడబోకండి. పిల్లవాడి జాతకం మంచిదికనుకనే నేను స్వయంగా మీ యింటికి వచ్చానని భావించండి. నామాట కాదన బోకండి.'

ఆ యెన్నికల్లో ఎక్కడచూసినా కాంగ్రెస్ అభ్యర్థులు వోట్లన్నీ వూడ్చేసుకున్నారు. జస్టిస్ పార్టీ అభ్యర్థులు కలికంలోకి లేకుండాపోయారు. కాని సుబ్బరామయ్యమాత్రం, నాయుడుగారి వాగ్బలం మూలానో, తన జాతకబలంమూలానో కులం బలం మూలానో కాంగ్రెస్ అభ్యర్థిని కొద్దివోట్ల తేడాతో వోడించాడు.

అప్పటినుంచీ సుబ్బరామయ్యజాతకం చక్కటి దాఖలా యిచ్చింది. ఎసెంబ్లీ రద్దుకావటంతో, సభ్యత్వం ఎక్కువకాలం నిలవలేదుకాని, సుబ్బరామయ్య త్వరలో జిల్లాబోర్డు సభ్యుడు అయ్యాడు. రాష్ట్రం మొత్తంలోనే అతను జిల్లాబోర్డు సభ్యులందరిలోనూ చిన్నవయస్సువాడుగా పేర్కొనబడ్డాడు. గవర్నరుగా వృద్ధిలోకి వచ్చేవాడుగా అతన్ని వొకకంట కనిపెట్టి వుంచేవారు. త్వరలో జిల్లాబోర్డు ప్రెసిడెంట్‌కూడా అయ్యాడు. అప్పటినుంచీ 'సుబ్బరామయ్యగారు'గా వ్యవహరింపబడ్డాడు.

పదిహేను సంవత్సరాలు జిల్లాబోర్డు ఛైర్మన్ గిరీ చలాయించి సకాలంలో సుబ్బరామయ్యగారు జస్టిస్ పార్టీ వదలిపెట్టి కాంగ్రెస్‌లో జేరిపోయారు. స్వతంత్రం వచ్చేనాటికి ఆయన వొక కాంగ్రెస్ నాయకుడుగా, గొప్ప జాతీయవాదిగా పరిగణించ బడ్డారు. ఒకటి రెండు సవత్సరాలు మంత్రిపదవి కూడా అలంకరించారు గాని, ఆయన జిల్లా రాజ కీయాల్లోనే ఎప్పుడూ శ్రద్ధ వహించేవారు. 'జిల్లా వదలి రాష్ట్ర స్థాయికి వెళ్లే రాజకీయవాది నేలవిడిచి సాము చేసినట్లే. రాష్ట్రం వదలి కేంద్రానికి వెళ్ళటం తనచేతి గొడ్డలితో తన కాళ్లు నరుక్కు న్నట్లే', అని ఆయన సిద్ధాంతం.

రాజకీయాలు అధికారానికీ, తద్వారా వ్యక్తిగత సౌకర్యానికీ మార్గంగా మాత్రమే పరిగణించిన రాజ కీయ వాదుల్లో మనదేశంలో మొదటి వర్గానికి చెందినవారు సుబ్బరామయ్యగారు. ఇందులో ఏవిధ మైన ఆదర్శవాదిదృక్పథమూ కలగలుపు చేయలే దాయన.

అందుకే, తన ఏకైకపుత్రుడు రంగారావు కమ్యూనిస్టుపార్టీలో పదిహేనవయేటనే జేరాడని విని ఆయన ఎక్కువగా మనశ్శాంతి పోగొట్టుకోలేదు. పైపెచ్చు అదొక హాస్యకర విషయంగా తీసుకుని, 'హహ్హహ్హా, నేను జస్టిస్‌పార్టీ పవర్లో వున్నప్పుడు జస్టిస్‌లోనూ, కాంగ్రెస్ పవర్లో కొచ్చాక కాంగ్రెస్ లోనూ వొవెలుగు వెలిగాను. నా జిల్లాలో ఎప్పుడూ నేనెన్ని అక్రమాలు చేసినా, అధికారం నాది గానే వుంది. రాబోయేది కమ్యూనిస్టు తారేమో యెవరికి తెలుసు ! నా వారసుడు నా కొడుకేమో ! సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేత వాడి జాతకం రాయిం చాలి. ఇన్నాళ్ళూ అశ్రద్ధచేశాను' అన్నారు భార్యతో.

కమ్యూనిస్టులతో తిరుగుతున్నందుకు రంగా రావుని ఆయనెప్పుడూ మందలించలేదు. పైగా అనేకసార్లు తన సహజ హాస్య ధోరణితో రాజకీయ చతురత మేళవించి చిన్న చిన్న పిడివాదాలుకూడా వేసుకునేవారు.

ఒకరోజు రంగారావు చాలా కోపంగా మాట్లా

డాడు తండ్రితో: 'నాన్నా, మొన్న నువ్వుచేసిన ఘోరం క్షమించరానిది' అని ప్రారంభించాడు.

'ఒరేయ్, పొడుపుకథల్లా మాట్లాడ్డం మానెయ్యరా, తండ్రీ. మొన్నటిరోజు నేను ఒక్కగానొక్క ఘోరంచేసుంటే, అదేమిటో నాకు వెంటనే తెలిసేది. మా వృత్తిలో తెల్లారితే అనేక ఘోరాలు చేస్తూవుంటాం. ఏ ఘోరమో విడమర్చి చెప్పక పోతే యెలా తెలుస్తుంది? ఒకవేళ మొన్న వొక్క ఘోరమేచేసినా, అది నిన్నచేసిన ఘోరాలకింద మణిగి మాయమైపోతుంది.' అని పళ్లికిలించారు సుబ్బరామయ్యగారు.

'నువ్వు చెబుతోన్న మాటలు నిజమని తెలియకపోతే నాకూ నవ్వొచ్చేది' అన్నాడు రంగారావు ముక్కుపుటా లెగరేసి. 'నేను మాట్లాడుతున్నది పెద్దచెరువుఘోరం గురించి.'

పెద్దచెరువుకింద ఇరవైముప్పైమంది చిన్న రైతులు వంద యెకరాలు వ్యవసాయం చేసుకుంటూ వుండేవారు. కాని వెంకటేశ్వర్లు అనే పెద్దరైతు ఆ వందయెకరాల ప్రక్కగా 70 ఎకరాలు కొన్నాడు. బుల్‌డోజర్లు తెప్పించి ఆ భూమి పల్లంచేయించాడు. చెరువునీరు తన కియ్యవలసిందని అధికారుల్ని కోరాడు. ఇదివరకు చెరువుకింద నీ రుపయోగించు కుంటున్న వాళ్లకి లేకుండా చెయ్యటానికి కలెక్టరు వొప్పుకో లేదు. కలెక్టరు బదిలీ చెయ్యబడ్డాడు. రెవెన్యూ బోర్డు మెంబరు అడ్డువేస్తే ఆయనకూడా బదిలీ అయ్యాడు. వెంకటేశ్వర్లుగారి పొలానికి నీరివ్వాలని గవర్నమెంటు ఆర్డర్లుకూడా జారీ అయ్యాయి. ఇదంతా సుబ్బరామయ్యగారి మద్దతు వెంకటేశ్వర్లుకి లభించటంవల్లే జరిగిందని అందరికీ తెలిసింది.

సుబ్బరామయ్యగారు మళ్లీ లేలిగ్గా నవ్వేశారు: 'నీకీ దేశవాళీ కమ్యూనిజం బాగా వంటబట్టినట్లుందిరా అబ్బాయ్! ఏదో 'ఘోరం' అంటే, నిజంగానే యేదో కంట్రాక్టుసంగతో, పాలపొడి సంగతో, ఎరువుల పంపిణీసంగతో, బియ్యం రవాణా సంగతో అనుకున్నాను. ఈ చిన్న విషయాన్నికూడా 'ఘోరం' అని వర్ణించావంటే, నువ్వు శబ్దరత్నాకరం తిరగరాసేలాగున్నావురా రంగా!'

'కాకుల్నికొట్టి గ్రద్దలకి వెయ్యటంకన్నా ఘోరం ఏం కావాలి?' అన్నాడు రంగారావు ఉద్రేక పడి.

'వెంకటేశ్వర్లుగాత్త ఆశపాతకుడురా. వాడి ఆశ వాణ్ణే కొడుతుంది. నాకేం మధ్యలో?'

'మీ ప్రమేయం లేకుండానే ఆర్డరేయించు కున్నాడా వెంకటేశ్వర్లు?'

'నా ప్రమేయం లేకుండా ఈ జిల్లాకి సంబంధించినంత వరకూ గవర్నమెంటు కాంపౌండ్లో గడ్డి పోచకూడా కదల్దురా బాబిగా!'

'మరి?'.

'మరీలేదు, గిరీలేదు. వెంకటేశ్వర్లు కోర్టులో ఎల్లాగా వోడిపోతాడు. ఈ లోపల పార్టీ ఫండుకి వా డెంతిచ్చాడో నీకు తెలియదు.'

'పార్టీఫండు, పార్టీఫండు! దానికోసం మీ పార్టీవాళ్లు చెయ్యని అత్యాచారాలు ప్రపంచకంలోనే లేవు.'

'మమ్మల్ని మరీ అంతగా మెచ్చేసుకోకురా రంగా! ప్రపంచకంలోనే లేవనటం కేవలం అతిశయోక్తి.' అన్నారాయన బిడియంగా. 'రష్యన్లు హంగరీని ఆక్రమించుకోటం పార్టీకోసం కాదంటావేమిటి—కొంపతీసి? స్టాలిన్ చేసిన హత్యలూ అక్రమాలూ పార్టీకోసమేగాని, ఆయనకేం అవసరం?'

'కావచ్చు కాకపోవచ్చు. పార్టీ ఫండ్‌కోసం మాత్రంకాదు. కొద్దిడబ్బు కాశించి బీదసాదల్ని పొట్టలు కొట్టడం మీ పార్టీకేం లాభం? రేపు వాళ్ల వోట్లు మీకు వేస్తారా పోనీ?

'ఓరి వెర్రివాడా, మోతుబర్లని ఆకట్టుకోకుండా బీదవాళ్లవోట్లు పడతాయనుకుంటున్నావేమిటి? ఇల్లాగయితే రాజకీయాల్లో నువ్వుప్పరాతికి మారవురా వెర్రినాయనా. మీ పార్టీ పెద్దల్నే చూడ రాదూ, ఈ వూళ్లో పార్టీలో ముందు నిన్ను జేర్చు

కున్నారుగాని, మన సత్తెయ్యగారి సూరీణ్ణి జేర్చుకున్నారా ?'

'వాడు జేరితే వొద్దంటారేమిటి ?'

'వొద్దనెందు కంటారు ? పోస్టర్లంటించటానికి, తడికలు మొయ్యటానికీ, అరవటానికీ పోట్లాటేదేనా వొస్తే బుర్రలు పగలగొట్టించుకోటనికీ కొంతమంది వాజమ్మల్ని జేర్చుకోనూ వచ్చు కాని నాయకత్వానికి నీబోటిగాడే వుండాలి.'

'ఏమిటో నా ప్రత్యేకత ! మీ అబ్బాయినని కాబోలు !'

'సరిగ్గా చెప్పుకున్నావు! పంతులమ్మల్ని కోరిన చోటికి బదిలీలు చేయించీ, కంట్రాక్టర్లకి లాభసాటిగా కంట్రాక్టిప్పించీ, బియ్యం యెగుమతి పర్మిట్లు సరిసమానంగా సరఫరా చేయించీ, అన్ని విధాలా పార్టీ ఫండు సవ్యంగా వసూలయ్యేందుకు తగిన పరిస్థితులు కల్పించీ, ఒక జీవితకాలం ప్రజాసేవచేసి నేను కొంత డబ్బూ పలుకుబడీ మూటకట్టాను. రేపు ఈ డబ్బూ పలుకుబడీ నీకుపయోగిస్తాయని మీ పార్టీ పెద్దల అంచనా. మీ తాత మోతుబరి గనకనే నన్ను జస్టిస్‌పార్టీ వాళ్లు ఎన్నికల్లో నిలబెట్టారు. నేను మోతుబరిని కనకనే కాంగ్రెస్‌వాళ్లు, నా తప్పులన్నీ క్షమించి నన్ను జేర్చుకున్నారు. మీ పార్టీవాళ్లు వొచ్చే ఎన్నికల్లో నామీద పోటీకి నిన్నే నిలబెట్టినా నేను ఆశ్చర్యపోను.'

'నువ్వు చిత్తుగా వోడిపోయినా ఆశ్చర్యపోవనుకుంటాను' అన్నాడు రంగారావు కసిగా.

సుబ్బరామయ్యగారు గట్టిగా నవ్వారు.

*　　*　　*

ప్రపంచ రాజకీయాల్లో కమ్యూనిజానిదే పైచెయ్యవుతుందని రంగారావు ఒకరోజు జోస్యం చెప్పాడు.

'అయితే మంచిదేలేరా రంగా ! అప్పుడేనాసరే, నువ్వుమాత్రం జిల్లా రాజకీయాలు వొదలకు. కాంగ్రెస్ రాజ్యంలో అయితే పైకెళ్లినవాళ్లు పలుకుబడే పోగొట్టుకుంటున్నారు గాని, కమ్యూనిస్టు హయాంలో తలకాయే పోగొట్టుకుంటారు — బెరియా లాగ !'

ఆయన బెరియా విషయం ఎత్తడం రంగారావుకి కొంచెం కోపకారణం అయింది : 'బెరియా దేశద్రోహిట. మీరందరూ చేస్తోన్న ఘోరాలకి, కమ్యూనిజం వొస్తే మీకూ మీ అనుచరులకీ అదేగతి పడుతుందేమో చూసుకోండి' అన్నాడు.

ఆయన కొడుకుకోపానికి చాలా ఆనందపడ్డారు :

'అబ్బాయ్, ఎవడు దేశద్రోహి, ఎవడు దేశోద్ధారకుడూ అన్న ప్రశ్న ఎవడిమెడ ఎవడు ముందు దొరికించుకున్నాడూ అన్న దానిమీద ఆధారపడుతుంది. ఖ్రుష్చెవ్‌మెడ బెరియాకి దొరికిపోతే, మీ రందరూ బెరియా భజనలుచేసి, ఖ్రుష్చెవ్‌ని దేశద్రోహి అని ప్రచారం చేసేవారు. ఇంక నా మెడంటావా, నువ్వు పార్టీలో వున్నావుగాబట్టి దానికేమీ ప్రమాదం రాదు. నా అనుచరులంటావా, ఒకటే జ్ఞాపకం వుంచుకో ! మనదేశం చేరేసరికి మతాలన్నింటికి వడదెబ్బ తగిలిపోతుంది.'

కొడుకు : హిందూమతం తప్ప.

తండ్రి : పొరపాటు. హిందూమతం మతంకాదు.

కొడుకు : అబద్దం.

తండ్రి : ఒకప్పుడు మతమేమోకాని ఇప్పుడుమాత్రం కాదు. మతం అన్నదానికి మూడు లక్షణాలున్నాయి : ఒకటి: దాని అనుయాయులు దాని వ్యాప్తికిగాని రక్షణకుగాని ప్రాణాలు ఇయ్యటానికిగాని తియ్యటానికిగాని తయారుగా వుండాలి. రెండు : వాళ్లందరూ రోజూగాని, వారం వారంగాని, ఒకచోటజేరి మత విషయాలు చర్చించాలి. మూడు : గురువులు ఎప్పుడేది చెపితే అదే నిజమని ఒక దృఢమైన నమ్మకం కలిగివుండాలి.

కొడుకు : నాలుగోది చెప్పలేదు. దేవుడుగాని, అనేకమంది దేవుళ్లుగాని ఉన్నారని నమ్మకం వుండాలి.

తండ్రి : అబ్బే అక్కర్లేదు. బౌద్ధమతం అసల్లో నాస్తికమతంట తెలుసా. దేవుడున్నాడా లేడా అన్న దానిమీద నిశ్చితాభిప్రాయంకూడా అవసరంలేదు. మతగురువులమీదమాత్రం నమ్మకం ముఖ్యం. మూఢనమ్మకమైతే మరీ మంచిది.

కొడుకు : మతం గురించి నీ సిద్ధాంతాలు వింటూ కూర్చోడానికి నాకు ఓపికలేదునాన్నా ! ఇంకా అన్నంకూడా తినలేదు. కమ్యూనిజం గురించి మాట్లాడుతూ మధ్యలో మతం గోలలోకి దిగుతా వెందుకు ?

తండ్రి : కమ్యూనిజం ఒకమతం గనక ! నేనిప్పుడు చెప్పిన మూడు లక్షణాలూ దాని కున్నాయి గనక !

కొడుకు : కమ్యూనిజం మతమేమీకాదు. మాకు మతమంటే పూర్తిగా చుక్కెదురు తెలుసా ?

తండ్రి : చుక్కెదురు నిజమే. అది మీకు పరమత సహనం లేదన్న నిజాన్ని నిరూపిస్తుంది.

కొడుకు : అయితే మా మతానికింకా వడదెబ్బ తగల్లే దన్నమాట, ఇండియా చేరినప్పటికీ !

తండ్రి : చేరిందిగాని వేరూనలేదుగా. కొద్దిరోజులు వోపికపట్టు. హీనయానం, మహాయానం, శైవం, వైష్ణవం, ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం, ⌣ గుర్తు విశిష్టాద్వైతం, Y గుర్తు విశిష్టాద్వైతం, ఇల్లా చీలి పోతుంది.

కొడుకు : మీక్కావల్సిందదే. కాని మీ కోరిక తీరదు లెండి.

ఈ వాదనల్లో తుది మాట కొడుకుదే అవటం సుబ్బరామయ్యగారికి చాలా యిష్టం. ఆయన నవ్వేసి మాట్లాడ కూరుకున్నారు.

* * *

సుబ్బరామయ్యగారి 'కోరిక' అనుకోనంత త్వరలో తీరింది. కమ్యూనిస్టుపార్టీ మొదట్లో రెండుగా చీలింది. తరవాత మూడయ్యింది. త్వరలో ఐదయింది. ఈ చీలికల్లో తన కొడుకు క్రమేణా అతివాద వర్గాలవైపుకే మొగ్గుతూవుండటం ఆయనకు మొదట్లో చాలా ఆందోళన కలిగించింది. ఖ్రుష్చెవ్ స్టాలిన్ని దుయ్యబట్టిన క్రొత్తలో తన గదిలో గోడకి వ్రేలాడుతున్న స్టాలిన్ఫోటో తీసివేశాడు రంగారావు. అంతేకాక ఖ్రుష్చెవ్పటం అదే మేకుకు తగిలించలేదు. ఈ మార్పులుచూసి ఆయన కొడుకు పార్టీనుంచి విముఖు డవుతున్నాడేమో ననుకున్నాడు. కాని లెనిన్ గోర్కీలపటాలు కదల్చక పోవటంతో ఆయన మనస్సులో కొంత అనుమానం మిగిలి పోయింది.

ఒకరోజు రంగారావు ఒక పెద్దపటం వంటి వస్తువు చంకలో పెట్టుకుని ఇంటికి రావటంతో, 'ఎవరిదిరా అది, ఖ్రుష్చెవ్దా ?' అన్నా రాయన ఆత్రంగా. 'ఇవాళ పేపరు చదవలేదేమిటి? ఖ్రుష్చెవ్ని కోసిగిన్ తోసిరాజన్నాడు.

'ఖ్రుష్చెవ్ పాటోకూడా పెట్టారి! దౌర్భాగ్యుడు !' అన్నాడు రంగారావు పొగలుకక్కుతూ.

'ఛా ఛా, యాభైయేళ్ల కమ్యూనిస్టు హయాంలో హాస్యసరళివున్న నాయకు డొకడు బయల్దేరితే, తిట్టిపోస్తావు, ఏంపాపం చేశాడురా !'

'ఏం చేశాడా, పార్టీకి పుట్టగతులు లేకుండా చేశాడు ! ముప్ఫైయేళ్ళు ప్రపంచ కమ్యూనిస్టు నాయకుడుగా వున్నవాణ్ణి రక్తపిపాసి, రాక్షసుడు, అని ప్రచారంచేస్తే పార్టీకి ఎంతదెబ్బ !'

'ఖ్రుష్చెవ్ నిజం చెప్పాడేమోనని ఎందు కనుకోవురా ?'

'పార్టీకి దెబ్బతగిలేనిజం ఏ కమ్యూనిస్టూ చెప్పడు !'

'గోర్కీ నవలలూ, కథలూ, నాటికలూ చదివావు కదురా !'

'ఆ, చదివాను.'

'నిజం అన్నింటికంటె ముఖ్యం అని రాశా డేమో ?'

'రాసుండొచ్చు. ఇప్పుడు గోర్కీ గొడవెందుకు?'

'అబ్బే. నువ్వు నిజంకంటె కమ్యూనిజం ముఖ్యం అంటుంటేను !'

'నీకీ గోర్కీ భక్తి ఎన్నాళ్లనుంచి కలిగిం దేమిటి ?'

'అబ్బే. మాకు గోర్కీ ఎందుకురా, మేం గాంధీగారి శిష్యులం.'

'ఆ, తెల్లారితే మీ పార్టీవాళ్లు ఆడే అన్ని నిజాలు గాంధీగారు కూడా ఆడుండరు.'

'అవేరా, మీరు హింసాయుతంగా గోర్కీని హత్య చేస్తోంటే, ఇంచక్కా మేం అహింసాయుతంగా గాంధీని హత్య చేసుకుంటున్నాం.' అని తన హాస్యానికి తనే పెద్దగా నవ్వారు సుబ్బరామయ్యగారు.

'మీ గోర్కీల్నీ గాంధీల్నీ నెహ్రూల్నీ మీ బూర్జువా విలువల్నీ నిలువులోతులో ఊరదొక్కే రోజులు దగ్గర పడుతున్నాయి లెండి.'

'ఊరదొక్కితే మంచిదేలేరా. నువ్వు నాయకుడి వైపోతే నేను పింఛను పుచ్చుకుంటాను. నువ్వు మాత్రం జిల్లాస్థాయి వొదలకు !'

'నీలా పదవికోసం పాకులాడటం నా కలవాటు లేదు. నేను నమ్మిందానికి ప్రాణం ఇస్తాను.'

'ఇప్పుడే నిజం ఒక బూర్జువా విలువకింద జమ కట్టేశావు. ఇంతలోనే నమ్మిందానికి ప్రాణం ఇస్తానంటావు. ఇది కూడా బూర్జువా తత్వమేనేమో ఆలోచించు. ఒరే రంగా, నా అంత అయ్యేదాకా భగవం తుడు నీకు ఆయుర్దాయమే యిస్తే, నమ్మినదానికంటె ప్రాణం అనేకరెట్లు విలువైందని తెలుసుకుంటావు. ఇతరుల ప్రాణంకంటెకూడా స్వంతప్రాణం విలువైం దనికూడా తెలుసుకుంటావు. మీ నాయకులందరూ ఈ సత్యం గ్రహించినవాళ్లే. ప్రస్తుతం నువ్వేదో దురభిప్రాయంలో పడివున్నా, ఇ త విలువైన ప్రాణం యిచ్చేముందు, ఆ నమ్మిందేమిటో ముందు తేల్చుకో. మొన్నటిదాకా కోటలా దుర్భేద్యంగావున్న ప్రపంచ కమ్యూనిజం, నిన్న చిల్లపెంకులా పగిలింది. అందులో ఏ ముక్కకోసం నీ ప్రాణం ఇచ్చేస్తావో కొంచెం నిదా నించి మరీ చూసుకో. అటుమొన్న లెనిన్ భజనా, మొన్న స్టాలిన్ భజనా, నిన్న ఖ్రుశ్చెవ్‌భజనా, ఇవాళ కోసిగిన్ భజనా చేసుకుంటూ పోయారు. రేపింకోడు బయల్దేరి, 'వీళ్లందరి భజనా శుద్ధ తప్పు, నాభజన చెయ్యండం'టాడేమో ఆలోచించు. మావో అప్పుడే అనేశాడు కూడాను.'

'నువ్వు చేసినంతమంది భజనలు నేను చెయ్య లేదు. కర్జన్‌నుంచి లిన్‌లిత్‌గోనుంచి వేవెల్‌నుంచి మౌంట్‌బాటెన్‌నుంచి నెహ్రూవరకూ అడ్డమైన వాళ్ల భజనలూ మీరు చెయ్యగాలేంది, మేం నమ్మిన నాయకుల భజన మేం చేసుకుంటే తప్పేమిటి?'

'తప్పులేదు, చెయ్యండి. కాని క్షణికమూ బుద్ధ్యనభిప్రాయమూ అయిన ఈ నమ్మకాలకోసమూ ఈ నాయకుల కోసమూ నశ్వరమైన ఆత్మని త్యాగం చేసుకోకు అర్జునా !' అన్నారు సుబ్బరామయ్యగారు గీతోపదేశం చేస్తున్న కృష్ణభగవానుడి భంగిమను అనుకరిస్తూ. 'రాజకీయవాది ఎప్పుడు ఎవరి భజన చేసినా అది పదవిఅనే కైవల్యపదానికి తాత్కాలిక మైన మార్గమని నమ్ముతాడు. ఆ నమ్మకం ఒకటే రాజకీయవాదికి మోక్షదాయకమని నా జీవితచరిత్రే నిరూపిస్తోంది, ఓ కౌంతేయా !' అని ముగించారాయన భంగిమం కొంచెం మార్చి.

ఆయన భంగిమలు చూసి నవ్వకుండా వుండలేక పోయాడు రంగారావు. 'నీకు ఏదంటేనూ నమ్మకం లేదు, నాన్నా. చివరికి నీ నల్లమందు భగవద్గీతని కూడా వెక్కిరించకుండా వుండలేక పోయావు. మానవ స్వభావంలోనే మీకు నమ్మకంలేదు. నీతో వాదన అనవసరం.' అంటూ తనగదిలోకి వెళ్లిపోయాడు రంగారావు.

హు ! మానవ స్వభావం ! నేను చూసినంత మానవ స్వభావం వీడు చూసుంటే ఇలా మాట్లాడ్డు.

ఐశ్వర్యంలో దొర్లుతూ .కొద్దిపాటి డబ్బుకోసం కూతుళ్లని ముసలాళ్లకి అమ్ముకునేవాళ్లూ, ఎలక్షన్లలో కొద్దిపాటి వోట్లకోసం బుర్రలు బద్దలుకొట్టేవాళ్లూ, ఎన్నిరకాల మానవ స్వభావాలు కళ్లారా చూశాను! అని తనలో తాను వితర్కించుకుంటూనే రంగారావు వెనకాల వెళ్లారు. ఎందుకంటే అది ఎవరిపటమో తెలుసుకోటం చాలా ముఖ్యమని తోచిందాయనకి. గోడకి కొత్తగా తగిలించిన పటం చూసి నిర్ఘాంత పోయారాయన! అది మావ్‌ట్సేటంగ్‌ది!

గోర్కీ ఫోటో గోడనుంచి తీసెయ్యటంలో నిమగ్నుడైవున్న రంగారావు తండ్రి రాకని గమనించ లేదు. 'నీ సిద్ధాంతాలు ఇక్కడికి చేరుకున్నాయన్న మాట చివరికి!' అని ఆయన ప్రారంభించేసరికి రంగారావు త్రుళ్లిపడ్డాడు. గిర్రున వెనక్కితిరిగి ఆయనకేసి నేరస్తుడిలాగ చూశాడు ఒక్కనిమిషం.

'కొంచెం దేశభక్తి అలవాటు చేసుకోండిరా! నిన్నగాక మొన్న మన జవాన్లని అంతమందిని పొట్ట నెట్టుకున్నవాడి భజన చెయ్యటానికి చేతులెలా వొచ్చాయిరా!' అన్నారాయన చాలాకోపంగా. 'సామ్రాజ్య వాదుల్ని తిడుతూనే టిబెట్‌ని కలుపుకున్న మహాత్ముడు ఇప్పుడు నీ దేవుడు!' ఇదివరకు ఆయన రంగారావుతో వాదన వేసుకున్నప్పుడల్లా హాస్యధోరణి వ్యంగ్యమూ ప్రయోగించేవారేకాని కోపం చూపించలేదు. ఈసారి వ్యంగ్యం రంగారావు దయింది:

'చేతకాని యుద్ధాలకిపోయి తన్నులుతిన్న మీ నెహ్రూగార్ని మీనన్‌గార్ని తిట్టుకోండి' అన్నాడు.

'నెహ్రూ మావాడూ మావో మీ వాడూను! ఏం మాట్లాడుతున్నావో వొళ్లూపై తెలుసుకుని మాట్లాడు.' అన్నారాయన చాలా కోపంగా.

'' 'డెమోక్రటిక్ సోషలిజం' అని అరిచినంత మాత్రాన నెహ్రూ సోషలిస్టయిపోడు. హిట్లరూ అన్నాడు 'నేషనల్ సోషలిజం' అని!''

ఆయన కోపం అవధులు దాటింది. 'ఇంకా సిగ్గు లేకపోతే సరి! నెహ్రూని హిట్లరుతో పోలు స్తున్నావు. నిన్నటిదాకా మాస్కో, ఇప్పుడు పీకింగూను నీ స్వర్గధామాలు! ఇల్లా నీ కమ్యూనిస్టు స్వర్గంలో జాతీయనాయకుణ్ణి గురించి మాట్లాడితే, బయటికి తీసికెళ్లి, పిచ్చికుక్కని చంపేసినట్లు చంపే ద్దురు. ఆ ఫోటో తెల్లారగానే పట్టుకు పోకపోతే, కిరసనాయిలుపోసి తగలేస్తాను' అని వెనుదిరిగా రాయన.

'మీ యింట్లో తెల్లారేదాకా వుంచుకోనక్క ర్లేదు. ఇప్పుడే పట్టుకుపోతాను. మావో ఫోటో వుండకూడనిచోట నేనూ వుండను.' అని గోడనున్న పటం తీసుకుని సుడిగాలిలాగ ఇంట్లోనించి వెళ్లి పోయాడు రంగారావు. తల్లి వెనకనుంచి, 'వారే రంగా, వారేరంగా, వొక్కమాట వినరా,' అంటూనే వుంది. కాని రంగారావు చీకట్లోకి నిష్క్రమించాడు.

'ఒక్కగా నొక్క కొడుకుని అర్థరాత్రి ఇంట్లోంచి వెళ్లగొట్టడానికి మీ ప్రాణం ఎలా వొప్పిం దండీ.'అంది ఎప్పుడూ ఆయన కెదురాడి ఎరగని భార్య.

'నేను వెళ్లగొట్టలేదు. ఆ ఫోటో ఇంట్లో పెట్టుక్కూర్చుని వాడితోపాటు నేను కూడా జెయిలుకు వెడితే నీ కళ్లు చల్లగావుంటాయా?' అన్నారాయన.

'మీదంతా చిత్రం, ఫోటోకోసమే జెయిలుకి పంపిస్తారా!'అని గొణుక్కుంది ఆవిడ.

ఆ తరవాత మూడురోజులు ఆమె నోరువిప్పి మాట్లాడలేదు. అన్నం తినలేదు. ఆయన కింట్లో అర్ధరాత్రి వెక్కివెక్కి యేడ్పు వినిపించింది. ఇంక ఈ పరిస్థితి భరించలేక నాలుగోరోజు పొద్దుట కొడుక్కు కబురంపించారాయన: తల్లి పరిస్థితి ఇలా వుందనీ, మావోపటంతోసహా ఇంటికి రావలసిందనీ. ఆ రోజు చీకటిపడేవేళకి మావోతోసహా రంగారావు ఇంటికి జేరుకున్నాడు. 'నేను చచ్చిపోయాననుకునే అర్ధరాత్రి అల్లా వెళ్లిపోయావ్రా రంగా!' అని పెద్దగా తల్లిఏడుపు వినిపించి, కొడుకు ఇంటికి జేరు

కున్నాడని ప్రక్కగదిలోవున్న సుబ్బరామయ్యగారు తెలుసుకున్నారు.

* * *

ఈ ఉదంతం జరిగినతరువాత ఆయన కొడుకును గురించి ఆందోళనపడటం క్రమేణా తగ్గించివేశారు. అతని రాజకీయా లేవయినప్పటికీ రంగారావు చదువులో ఎప్పుడూ వెనకబడేవాడుకాదు. బియ్యే ఆఖరి ఏడాదిదాకా మంచిమార్కులతోనే రాగలిగాడు. పెద్ద పరీక్షకూడా యిచ్చేశాడు. కుటుంబంలో ఎవరికీ అబ్బనంత చదువు రంగారావుకి అబ్బటం ఆయనకి చాలా గర్వకారణం అయింది. అతని భవిష్యత్తు విషయంలో ఆయన మానసోద్యానంలో అంతులేని ఆశలు చిగిర్చాయి. ఇండియాకి మొదటి కమ్యూనిస్టు ప్రధానమంత్రి తన కొడుకే అవుతాడని ఆయన కలలు కనేవారు. రాజకీయాలు తమ వంశరక్తంలోవుందని ఆయన నమ్మకం. రాజకీయాలంటే చాకచక్యమూ సమర్థతా వున్నవాళ్ళ చేబట్టేవృత్తి అని ఆయన దృఢనమ్మకం. అందుచేత తన కొడుకు తప్పకుండా చాకచక్యమూ సమర్థతా వున్నవాడే అవుతాడుకదా! తను చిన్న వయస్సులో, అనుభవంలేకపోయినా, వేసవి వెనకబట్టగానే అప్పుడే రెక్కలుమొల్చిన కోకిల ఉత్తరాదిని వెతుక్కుంటూ పోయినట్లు, నెగ్గేపార్టీలోకే దారితీస్తూ పోలేదా? నిన్న మొన్న కాంగ్రెస్ చీలినప్పుడుకూడా, తను కొత్తకాంగ్రెస్‌లోనే జేరాడుకాని కొంతమంది తన స్నేహితుల్లాగ పాతకాంగ్రెస్‌లోజేరి పతనం కొని తెచ్చుకోలేదు. పైగా కాంగ్రెస్ 'N' అంటే 'నెగ్గే కాంగ్రెస్'అనీ 'O' అంటే 'ఓడిపోయే కాంగ్రెస్'అనీ చమత్కరించేవాడుకూడా. ఒక జీవితకాలం ఏ సహజ చాతుర్యం తనను నెగ్గేవైపుకే ఉంచగలిగిందో అదే సహజచాతుర్యం తన కొడుకునుకూడా అతివాదకమ్యూనిస్టుల్లోకి మళ్ళించివుంటుందని ఆయన సరిపెట్టుకున్నారు.

అందుకే, రంగారావు చేతులో 'రెడ్‌బుక్'అనే మావో సూక్తిముక్తావళి చూసినప్పుడుకూడా ఆయన ఎక్కువ ఆందోళన వ్యక్తంచెయ్యలేదు. మావో పటం విషయంలో తన సహజహాస్యధోరణి వదలి కోపం చూపించటం పెద్దపొరపాటయిపోయిందని ఆయన అనుకున్నాడు.

'ఒరే రంగా, వినటమేగాని ఈ రెడ్‌బుక్ ఎప్పుడూ చూసేభాగ్యం కలగలేదురా. ఓసారి చూణ్ణియ్యి.'అని తీసుకుని కొన్ని మావో సూక్తులు పఠించారాయన: 'అధికారం తుపాకిగొట్టంలో పుట్టి పెరుగుతుంది.'అని చదివి 'ఓహోహో, ఏమి సూక్తిరా! తుపాకి గొట్టంలోంచి అధికారమే అన్న మాటేమిటి? పొగ పుట్టదూ? గంధకం కంపు పుట్టదూ? హత్య, దోపిడీ, గృహదహనం, మానభంగం, ఇత్యాదయః అన్నీ అందులోనే పుడతాయి, పెరుగుతాయి. అధికారం అన్నావా, అప్పుడప్పుడది వోట్లపెట్టెలోంచి కూడా పుడుతుంది. కావాలంటే మీ నంబూద్రిపాద్‌ని అడుగు. అచ్యుతమీనన్‌నేనాసరే! చివరికి నన్నేనాసరే! తుపాకీ మొహం చూడకుండా, దాని అవసరంలేకుండా, నలభైయేళ్ళ అధికారం చవిచూశాను. మరో సూక్తి: 'పల్లెలు పట్టణాల్ని చుట్టుముట్టడిస్తాయి' ఈ మాట నిజమే. ఈ సత్యం నేను మావో రచనలు చదవకుండానే గ్రహించాను. అందుకే నేను జిల్లా స్థాయి వొదలకూడదన్నాను. బస్తీల్లో యేముందిరా! నేలవిడిచి సాము తప్పిస్తేను!'

'నాన్నా, మావోని వెక్కిరించే తాహతు నీకు లేదు. ఏసూక్తులూ సిద్ధాంతాలూ మీ పార్టీవాళ్ళని కట్టెయ్యలేవు. 'సోషలిజం' మీ సూక్తి. బీదా బిక్కీని దోచుకోటం మీ సిద్ధాంతం. మీ రోజులు దగ్గరపడ్డాయని మీకు తెలుసు' అన్నాడు రంగారావు పళ్ళుకొరికి.

ఆయన నవ్వారు. 'రంగా, పళ్ళుకొరకటం మంచిలక్షణం కాదురా. పొట్టలో నులిపురుగు లున్నాయేమో చూసుకో. మేం బీదాబిక్కీని దోచుకుని వొదిలేస్తామేమోగాని, మీరు స్వప్రయోజనాలకోసం వాళ్ళని అంతూ దరీలేని యుద్ధాల్లోకి దింపి మాటల్తో అరిచేతుల్లోనూ చేతల్తో బొందితోనూ స్వర్గం చూపిస్తారు. పోనీ పునర్జన్మ స్వర్గమూ దేవుడూ

అంటేనమ్మకంవున్నవాళ్ళయితే,వీరస్వర్గంఅలంకరిస్తారని అనుకునేవాళ్ళు వెనక. మీకా నమ్మకాల్లేవుకదా, మీ విప్లవాల్లో, మీరు నెత్తిమీద చెయ్యిపెట్టిన దేశాల్లో సగం జనాభా చచ్చాక, చచ్చినవాళ్లకి ఏం నష్టపరిహారం ఇస్తారో చెప్పరా!'

'ముందుతరాలవాళ్ళు బాగుపడతారు.'

'ముందుతరాలవాళ్ల మాటొదిలెయ్. చచ్చిన వాళ్ల కేం లాభమో చెప్పవోయ్!'

'మీలాంటి నాయకుల ధర్మపాలనలో పెద్ద చెరువు రైతుల్లా సగంచచ్చిబతక్కుండా ఒక్కసారి చావటమే మంచిది.'

'అబ్బాయ్, మీ మతపిచ్చి వంటబట్టనివాళ్ల నెవళ్లనేనా అడుగు. అంతలోఅంత బతకటమే మంచి దనుకుంటారుగాని, మన స్మరణలోవున్న వాళ్లెవరూ చావటం మంచిదనుకోరు. లేకపోతే, యావజ్జీవ ఖైదీలూ బానిసలూ, మీ కమ్యూనిస్టు స్వర్గంనుంచి సైబీరియాకి ఎగుమతైపోయిన మందభాగ్యులూ ఆత్మ హత్యలు చేసుకుందురు. పెద్దచెరువు సంగతెత్తావు గనక చెబుతున్నాను : ప్రజాస్వామ్యంలోవున్న అందం అదే. హైకోర్ట్లో చిన్నరైతులు నెగ్గలేదా? నే నానాడే చెప్పాను వెంకటేశ్వర్లు ఆశ వాణ్ణే కొడుతుందని.'

'ఈలోపల కొన్నేళ్లు బీదవాళ్లకి నీళ్ళులేకుండా చేసి వాళ్లని సగం చంపలేదూ?'

'అదే నే చెప్పేది. మీరైతే పూర్తిగా చంపేద్దా మంటారు. మాకూ మీకూ తేడాయే అది.'

రంగారావు మొహం మళ్లీ ఎర్రబడింది: 'మోతుబర్ల మద్దతుతో వోట్లులాగి, పెద్దవాళ్ల ఎగవేసిన పన్నులభారం చిన్నవాళ్లమీద రుద్దీ, బియ్యం రవాణా పెర్మిట్లమీద ఎన్నికల చందాలు వసూలుచేసీ, మీరు ప్రజల్ని దోచుకోకపోతే విప్లవాలూ అక్కర్లేదు, చావులూ అక్కర్లేదు. దోపిడిమానేస్తే మీ పదవులు అప్పుడే ఊడిపోతాయి. మీ సమాజాన్ని పాతెయ్యాలి. మీకు ముందుచూపులేదుకనకనే రేపు రాదన్నట్లు మేడలమీదమేడలు కట్టేస్తున్నారు. ఇదే మా కుప యోగపడుతోంది. మీ రోజులు దగ్గరపడుతున్నాయి!' అంటూ రంగారావు వెళ్లిపోయాడు.

'ఏంమాటలురాఅవీ, పెద్దాపిన్నా లేకుండాను, అంటూ నొచ్చుకుంది తల్లి.

'అన్నియ్యవే, పెద్దాపిన్నా అన్నవి బూర్జువా విలవలు. నీకు తెలియవులే. కొంత ఆవిరి వొదిలి పెట్టేస్తే వాడికి మనశ్శాంతి!'అని పెద్దగా నవ్వారు సుబ్బరామయ్యగారు.

*          *          *

ఆవిరి వదలిపెట్టెయ్యటంవల్ల రంగారావుకి ఎంతమాత్రమూ మనశ్శాంతి లభించలేదని తెలుసుకో టానికి సుబ్బరామయ్యగారికి ఎక్కువరోజులు పట్ట లేదు.

ఒకరోజు పోలీస్ సూపరింటెండెంటు కబు రేనా లేకుండా జీపులోవచ్చి యింటిముందు దిగేసరికి సుబ్బరామయ్యగారు ఆశ్చర్యపోయారు. 'రండి రండి సూపరింటుగారూ' అంటూ ఆహ్వానించారు.

సూపరింటెండెంట్ ఆహ్వానాన్ని ఎక్కువ లెక్క చెయ్యకుండానే, 'మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి' అన్నాడు అక్కడ ఉన్నవారివైపు అర్థ యుతంగా చూస్తూ.

'రండిరండి లోపలికిరండి'అంటూ లోపలిగది లోకి తీసుకెళ్లారాయన.

బయట ఎవరికీ వినిపించదని ధైర్యంతోచిన తరువాత సూపరింటెండెంట్ 'హోం మినిస్టర్గారు మీకోమాట రహస్యంగా చెప్పమన్నారు. మీవాడు నక్స లైట్లతో లాలూచీ అవుతున్నాట్ట. పరిస్థితి చాలా ప్రమాదకరంగాఉంది.'

'ఎవరు మావాడు?'

'మీ అబ్బాయి రంగారావు.'

సుబ్బరామయ్యగారి ముఖం మొదట పాలిపోయి తరువాత ఎర్రబడింది. 'ఏమిటి సూపరెంటుగారూ మీరనేదీ? మినిస్టరుగారికీ తప్పుడుసమాచారం ఎవ

రందించారు? ఈ జిల్లాలో నక్సలైట్ బెడద లేదని మీకు తెలియదా?' అన్నారు సూపరింటెండెంట్‌కేసి నిందాపూర్వకంగా చూస్తూ.

'ఈ జిల్లా కేసయితే మీవాణ్ణి కాళ్ళూ చేతులూ కట్టితీసుకొచ్చి మీముందు పడేసేవాణ్ణి. మినిస్టర్ దాకా పోనిస్తానా! మీవాడిప్పుడీ జిల్లాలో లేడు.'

'అవును, విజయవాడ వెళ్తానని వెళ్ళాడు స్నేహితుడి దగ్గరకి. ఇవాళ్టికి వారం అయింది.'

'అదే, ఆ వెళ్ళటం, శ్రీకాకుళం జిల్లాలో నక్సలైట్ ప్రాంతాలకి జేరుకున్నాట్ట. వాళ్ళూ పోలీసులూ ఎదరపడితే వాళ్ళో వీళ్ళో అన్న పరిస్థితి ఇప్పుడు. అందుకే మినిష్టరుగారు నన్ను స్వయంగా మీకు చెప్పమన్నారు.'

జీవితంలో మొట్టమొదటి సారిగా ఆయన ధైర్యాన్ని కోల్పోయారు. పైగా ఆధైర్యాన్ని రెండో వాళ్ళముందు చూపించారు. 'ఏంచెయ్యాలి సూపరింటుగారూ, నేనేం చెయ్యాలి? వాడికేదేనా అయితే వాళ్ళమ్మ బతకదు. నే బతకను. ఏం చెయ్యాలో చెప్పండీ, మీకు పుణ్యం వుంటుంది.' అన్నా రాయన కంఠస్వరం హెచ్చించి.

'గట్టిగా మాట్లాడకండి. మీరు కంగారుపడకండి. ఇంట్లో హైదరాబాద్ వెళ్తున్నట్లు చెప్పి నాతో బయల్దేరిరండి. దార్లో మాట్లాడుకుందాం.' అన్నాడు సూపరింటెండెంట్.

'మినిస్టరుగారి దగ్గర్నుంచి కబురొచ్చింది. నే నర్జంటుగా హైదరాబాద్ వెళ్ళిపోవాలి.', అని భార్యతోనూ బయటిగదిలో ఆయనకోసం వచ్చి కూర్చున్నవాళ్ళతోనూ చెప్పి ఆయన బయల్దేరారు.

సూపరింటెండెంట్ మఫ్టీలోవున్న ఒక పోలీసు జవాన్ని తోడిచ్చి శ్రీకాకుళం పంపించాడు. అక్కడ 'నక్సలైట్' డ్యూటీలోవున్న ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరు, సుబ్బారెడ్డి, సుబ్బరామయ్యగారికి బాగా తెలిసివుండటం ఆయనకి చాలా ఉపకరించింది.

రంగారావును ముఖాముఖీ కలుసుకో గలిగితే తను ఎల్లాగో ఒకలాగ అతన్ని తిరిగి తీసుకురాగలనని ఆయన ధైర్యం. అతన్ని కలుసుకోటం ఎలాగా అన్నదే పెద్ద సమస్య అయింది.

'మేం గనక మీతోవస్తే, మా ప్రాణానికీ మీ ప్రాణానికీ కూడా ముప్పే,' అన్నాడు సుబ్బారెడ్డి. 'వాళ్ళు చిన్నచిన్నదళాలుగా ఏర్పడి—ఐదుగురు, ఆరుగురు — ఒకచోట్నుం చొకచోటికి తిరుగుతున్నారు. ఎవళ్ళేదళంలో వున్నారో తెలుసుకోటం చాలా కష్టం. పోలీసులు కనిపిస్తే ముందోబాంబు పారేసి మరీ మాట్లాడతారు—మాట్లాడతారంటే, మాట్లాడరనుకోండి—పరిగెడతారు. మేం 'షూట్' చెయ్యాలి సొస్తుంది. మీరు మాతోవుంటే మీక్కూడా ప్రమాదం. ఈ ఖద్దరుపంచా, లాల్చీ, ఈ డ్రస్సులో మీరు కనిపించారంటే, మమ్మల్నొదిలేసి బాంబులన్నీ మీమీదే పారేస్తారు' అన్నాడు సుబ్బారెడ్డి పెద్దహాస్యం వెలిగించినట్లుగా నవ్వుతూ.

మరొక పరిస్థితుల్లోఅయితే, ఆయన కూడా సుబ్బారెడ్డి వీపుచరిచి నవ్వేవారు. కాని ఇది హాస్యానికి సమయం కాదన్నట్లు కనుబొమలు ముడిచి: 'చూడు సుబ్బారెడ్డి, నేను మావాణ్ణి కలుసుకోటం ముఖ్యం. మీతో వెడితే పనిజరగదని తెలుస్తోనేవుంది. నేనొక్కణ్ణే వెళ్తాను. నాకు దారిచెప్పండి' అన్నారు.

'ఏదారని చెప్పం సార్, గోదారి?' (సుబ్బారెడ్డి గోదావరిజిల్లావాడు) 'పార్వతీపురం, కురుపాం, భద్రగిరి, నీలకంఠాపురం, యివన్నీ వాళ్ల సెంటర్లేనండీ. కొండలు, గుట్టలు, చెట్లు,పుట్టలూను. ఏ చాట్నుంచో వో బాంబేశారంటే—ఠా. నామాటినండి. వెళ్ళకండి. ముందు పెద్దప్రాణానికే మోసం. మీ అబ్బాయి సంగతా, షూటింగులో దొరికిపోతే చెప్పలేంగాని, అరెస్టయితేమాత్రం, పువ్వుల్లోపెట్టితెచ్చి మీ అబ్బాయిని మీ కప్పచెప్తే బాధ్యత నాది' అని బతిమాలాడు సుబ్బారెడ్డి.

'షూటింగులో దొరికిపోవటం' సంగతి సుబ్బారెడ్డి నోట తేలిగ్గానే వచ్చేసిందిగాని, ఆ మాట వింటూనే సుబ్బరామయ్యగారు గతుక్కుమన్నారు: 'నేను వెళ్ళక తప్పదు సుబ్బారెడ్డీ!' అన్నారాయన.

'తప్పకపోతే వెళ్లండి. నా పూచీమాత్రం లేదు. మీరు వెళ్తోన్నట్లే నాకు చెప్పకండి, మీ కేదేనా అయితే ముందు నామెడ తెగిపోతుంది.'

ఇంత విషమావస్థలోనూ సుబ్బారెడ్డి మాటల తీరుకి ఆయన చిన్న వ్యంగ్యం ప్రయోగించకుండా ఉండలేకపోయారు: 'మరేం పరవాలేదులే సుబ్బారెడ్డీ, నాకేదేనా అయితే, నువ్వు దారిచెప్పి నా చావుకి బాధ్యుడి వయ్యావని ఎవరితోనూ చెప్పనులే, సరేనా!'

ఆయన వ్యంగ్యం సుబ్బారెడ్డిమీద వృథా అయింది: 'ఆ మాటమీదే వుండండి సార్. పోలీసోళ్లం. మాకు ముందుకువెడితే నుయ్యా వెనక్కివెడితే గొయ్యాని' అన్నాడు.

'నాకు తెలియవుటయ్యా సుబ్బారెడ్డీ, మీ బాధలు! ఇంతకీ నీకీ దారితెన్నులేమన్నా తెలిస్తే చెప్పు, లేకపోతే ఇంకెవర్నేనా అడుగుతాను' అని బుజ్జగించారు.

సుబ్బారెడ్డికి పౌరుషం కలిగింది: 'నాకు తెలియక పోటమేమిటి సార్! నక్సలైట్ ఏరియా అంగుళం అంగుళం ఎరుగుదును. మీరు ముందు పార్వతీపుర మెళ్లండి. ఎవర్నేనా బడిపంతుల్ని పట్టుకోండి-వాళ్లందరూ నక్సలైట్లేలెండి! మీ అదృష్టం బాగుండి వాడు హృదయమున్న నక్సలైట్ అయితే—నక్సలైట్లలోకూడా హృదయమున్నవాళ్లున్నారులెండి–మీ కేదేనా దారి చూపిస్తాడేమో. అదేనా మీ రెవరో తెలియకపోతేను! తెలిసిందో, తా! తరవాత నన్నడిగి లాభంలేదు. ముందే చెపుతున్నాను.'

'విన్నడగన్లే. ఒకవేళ పార్వతీపురంలో నాకు హృదయమున్నవాడు దొరక్కపోతే?'

'హృదయం లేనోడు దొరికితే కథ కంచికే! తా! అన్నమాట.'

'ఉన్నవాడూ లేనివాడూ ఆ వూళ్లో ఎవడూ దొరక్కపోతే ఏవూరువెళ్లాలయ్యా!'

'కురుపామెళ్లండి. భద్రగిరి, పాలకొండ, నీలకంఠాపురం, కాకిలికొండలు, చిలకాంకొండలు—అంతా వాళ్ల యిలాకాయేనండి. దేనికేనా, బడిపంతుళ్లు ముఖ్యమండీ!'

ఆయన యీవూళ్ల పేర్లన్నీ వల్లించుకుని సాధ్యమైనంతగా గ్రామస్తులవేషం వేసుకుని, ముఖ్యంగా కాళ్లకి ఆకుజోళ్లూ తలకి తలపాగా వేసుకుని పంచె పైకెగకట్టి, తనతోకూడావచ్చిన పోలీసు జవాన్ని ఖర్చులిచ్చి వెనక్కి పంపించి బయల్దేరారు.

పార్వతీపురం జేరుకునేసరికి కనుచీకటి పడింది. బడిగా వాడబడుతున్న పెద్ద పూరిగుడిసెని ఆయన సుళువుగానే పోల్చుకో గలిగారు. పక్కనే చిన్న పెంకుటింట్లో చిన్నదీపం కనిపిస్తే వెళ్లి తలుపుతట్టారు. లోపలనుంచి 'ఎవరు?' అన్నదొక మగగొంతు.

'తలుపుతీస్తారా, మీతో మాట్లాడాలి' అన్నారు సుబ్బరామయ్యగారు.

తలుపు తియ్యకుండానే లోపల్నుంచి, 'మీపేరు?' అని ప్రశ్న.

ఆయన కొంత తటపటాయించి తనపేరు సర్వసామాన్యమైన పేరేగదా, ఏ సుబ్బరామయ్యో ఏం తెలుస్తుందని, స్వంతపేరే చెప్పేశారు.

'ఏవూరు?' అని మళ్లీ ప్రశ్న.

'శ్రీకాకుళం' అన్నారాయన.

'ఏం కావాలి?'

'ఈ బళ్లో పనిచేసే పంతులుగా రెక్కడుంటారు?'

'మీది శ్రీకాకుళంకాదు. అసలేవూరో చెప్పండి' అన్నాడు లోపలిమనిషి.

'అసలువూరు విజయవాడ'అని ఆయన మళ్లీ అబద్ధం చెప్పారు. తనకు శ్రీకాకుళపుయాస లేకపోవడాన్ని లోపలిమనిషి కనిపెట్టేశాడని తెలుసుకుని.

'పంతుల్తో మీకేం పని?'

'పనేమిటో పంతుల్తో చెబుతాను. ఆయన ఉండేచోటు తెలిస్తే చెప్పండి, లేకపోతే ఇంకెక్కడికేనావెళ్లి అడుగుతాను.' అన్నారు, లోపలిమనిషిని ఇరుకులోపెట్టే ఉద్దేశ్యంతో.

'నేనే పంతుల్ని. ఇప్పుడు చెప్పండి ఏం పనో.'

'మీతో కొంచెం సాయం కావాల్సివొచ్చాను. తలుపుతియ్యండి పంతులుగారూ!' అన్నారాయన సాధ్యమైనంత దీనంగా కంఠస్వరంమార్చి. ఆయన ఎవరితోనూ దీనంగా మాట్లాడి ఎరగరు. ఇప్పుడీ బడి పంతులు గుమ్మంలో నిలబడి ఈ క్రొత్తవిద్య నేర్వ వలసివచ్చిందికదాఅని తనమీద తను జాలిపడ్డారు కూడాను.

లోపలిమనిషి తలుపుతీసి బయటికి తొంగిచూసి వచ్చిన మనిషి ఒక్కడే వున్నాడని తేల్చుకున్నాక 'లోపలికి రండి'అని ఉత్తరువు జారీచేశాడు. లోపలికి జేరుకోగానే దీపంవొత్తి పెద్దదిచేసి సుబ్బరామయ్యగారి ముఖం దగ్గరకితెచ్చి, 'మీరు జిల్లాబోర్డు ఛైర్మనూ మినిష్టరూ చేసిన సుబ్బరామయ్యగారు. మీరు నన్నెరగరుగాని, నేను మిమ్మల్నిదివరకు రెండుమూడుసార్లు చూశాను. ఈ ప్రాంతాల్లో మీరు వొంటరిగా తిరగటం చాలా ప్రమాదకరమని మీకెవరూ చెప్పలేదనుకుంటాను' అన్నాడు.

'చెప్పారు. వ్యక్తిగతమైన ప్రమాదం గురించి లెక్కచేసే పరిస్థితికాదుగనకనే మీదగ్గరకి వచ్చాను. మీరు నాకు సాయంచెయ్యాలి మేష్టారూ!'

'మీరిక్కడ వుండటం నాక్కూడా ప్రమాదకరం. మీరు నాకెప్పుడూ ఉపకారంచేసి యెరగరు. పైగా నేను పదేళ్లక్రిందట ఉద్యోగంకోసం మీదగ్గరకొస్తే నాకంటె తక్కువ అర్హతలున్నవాణ్ణి వేసుకున్నారు. మిమ్మల్ని నక్సలైట్ల కెందుకు పట్టియ్యకూడదో చెప్పగలరా?'

'పట్టియ్యకుండా వుండటానికి తగినంత కారణం నేనేమీ చెప్పలేను మేష్టారూ. ఆ ప్రమాదం వుందని తెలిసికూడా మిమ్మల్ని వెతుక్కుంటూవచ్చాను.'

'చాలా ముఖ్యమైన పనే అయివుండాలి.'

'అవును, నా కొడుకు రంగారావు నక్సలైట్లలో జేరాడని తెలిసింది. వాడి అచూకీ మీరేమైనా ఇయ్యగలరేమోనని ఆశ.'

'నేనెలా ఇయ్యగల ననుకున్నారు ?'

'మీ రంటే మీరేకాదు. బడిపంతుళ్ల నెవర్నేనా అడిగితే ఫలితం వుంటుందని నాకు తెలిసింది. వాడెక్కడుంటాడో తెలిస్తే చెప్పండి.'

'నాకు తెలియదు కాని ఆచోకీ తెలిస్తే ఏం చేద్దామని ?'

'రెండుమాటలు మాట్లాడి వెళ్లిపోతాను. వాడికేదేనాఅయితే తల్లి బ్రతకదు. నేను బతకను. ఇంటికి రమ్మని బతిమాలుతాను. నా జీవితాన్ని వాడెలాచెస్తే అలా మార్చుకుంటానని చెప్తాను.'

'మీరు బతకనంతమాత్రాన మా నక్సలైట్ల కేమీ నష్టంలేదు—అని మీ అబ్బాయి అంటేనో?'

'అంటాడు నాకు తెలుసు. కాని వాడి ఆశయాలు నెరవేరటానికి సాయం చేస్తానంటే...'

'మీ వర్గంద్వారా మా ఆశయాలు నెరవేరవని తెలుసుకున్నాకే ఇందులో జేరానంటాడేమో!'

'అదికూడా అంటాడు. కాని మనుషులు హేతువాదమే దృష్టిలో పెట్టుకుని అన్ని నిర్ణయాలూ చేసుకోరని నాకు అనుభవంద్వారా తెలుసు. ఒక కన్నీటిబొట్టు జీవితాల్ని మార్చేసిన సంఘటనలుకూడా వున్నాయి. మనుషుల్నందర్నీ వర్గాల మూసల్లోకి ఇరికించేసెయ్యటం అస్తమానం సాధ్యంకాదు మేష్టారూ. ఇదంతా బూర్జువా నల్లమందని మావాడంటాడు. తల్లి కమ్యూనిస్టైఅయినా, మార్క్సిజం వ్యాప్తికోసమే కొడుకు చచ్చిపోయినా, ఏడవటం మానదు.' ఆయన తనకు తానే చెప్పుకుంటున్నట్లు చెప్పుకుపోతున్నారు.

'సుబ్బరామయ్యగారూ, ఈ కన్నీటిబొట్లూ, కొడుకుని పోగొట్టుకున్న తల్లియేడ్పూ, ఇవన్నీ ప్రపంచకంలో వున్నాయన్న గుర్తింపు, మీ కొడుకు ప్రాణంమీది కొచ్చిందికనక, మీ కివాళ కలిగింది' అన్నాడు. అతని ముఖం ఎర్రబడిందని ఆ గుడ్డి వెలుగులోనే తెలుస్తోంది.

'ఆ మాటనిజమే,'అని ఆయన వొప్పుకున్నారు.

అతను ఈ మాట విననట్లే చెప్పుకు పోయాడు :

'సమాజంలో ఆకలి, చిన్నచేపని తినేసే పెద్ద చేపలూ వున్నంతకాలం, కన్నీటిబొట్లూ తప్పవు, తల్లుల కడుపులో చిచ్చూ తప్పదు.'

ఇతనితో వాదన వేసుకోవటంవల్ల ఆయనకి తనపని నెరవేరదేమోనని భయం కలిగింది. అయినా కొంచెం తటపటాయించి, 'అయితే...కమ్యూనిజంలో చిన్న చేపని పెద్దచేప తినదంటారేమిటి?' అన్నారాయన బెరుగ్గా.

'ఎందుకు తినదూ? హంగరీ, జకోస్లోవేకియా, టిబెట్లూ, ఇవన్నీ నేనూ పేపర్లలో చదువుతూనే వున్నాను. పెద్ద నాయకుణ్ణి వ్యతరేకించిన చిన్న నాయకులు ఐపూ మచ్చూలేకుండా పోవటమూ ఎరుగుదును. సైబీరియాకీ పిచ్చాసుపత్రికీ పంపించబడ్డ మేధావుల సంగతీ యెరుగుదును. అక్కడ పెద్దచేప మింగిందంటే, చిన్నచేపల ముళ్ళూ పొలుసులూకూడా మిగలవు. తల్లిచేప పైకి ఏడవటానిక్కూడా జడుస్తుంది.'

'ఆ! అయితే మీరు కమ్యూనిస్టు కాదన్న మాట!' అన్నారు సుబ్బరామయ్యగారు నోరు వెళ్ళబెట్టి.

'ఇప్పుడు కాదు. అందుకే నేను మీలోనూ కలవను, వీళ్లలోనూ కలవను. సగంచచ్చి ఈ మారుమూల బతుకుతున్నాను. కొన్ని నిజాలు మాజీ కమ్యూనిస్టులకి తెలిసినంత స్పష్టంగా మరొకరికి తెలియవు సుబ్బరామయ్యగారూ. కమ్యూనిజంలో ఏ దారుణం జరిగినా, ఏమిటిదని వాళ్లనడిగితే, 'ఓ, ఇవన్నీ తాత్కాలికమైన చిక్కులు' అంటారు. అదే ఇక్కడ జరిగితే, 'అది వ్యవస్థలోవున్న వైరుధ్యం, ఈ సమాజాన్ని పాతేస్తాం' అంటారు. మూఢత్వమూ, దురాశా, సోమరితనం, భయం, ఇవి నశించనంతకాలమూ వ్యవస్థ ఏదైనప్పటికీ కన్నీళ్లూ కడుపుచిచ్చులూ తప్పవు. ఇంతోడిదానికి, మా సిద్ధాంతమే ప్రపంచకానికి తరణోపాయమని అరుస్తారు కొందరు. మా దేశంలో అంతులేని జనాభావుంది, అందులో సగంమంది మూడో ప్రపంచయుద్ధంలో చచ్చినా, వాళ్ల యెముకలమీద మిగతా సగంమందితోనూ నవసమాజం సృష్టిస్తామని కొందరు అరుస్తారు. వాళ్లమాట చెల్లితే, అసలు జరిగేది సగంమందికి చావు, సగంమందికి సంకెళ్ళూను. పాత మూఢనమ్మకాలస్థానే కొత్త మూఢనమ్మకాలు సృష్టిస్తారు రక్తపిపాసులు. ఎటొచ్చీ అధికారదాహంలో వాళ్లకి మీరు మీకు వాళ్ళూ తీసిపోరు. మధ్యలో చచ్చేది మీ అబ్బాయి లాంటి వాళ్ళు. రాబోయే నవసమాజానికి పునాదులుగా వాళ్ళ ఎముకలు పనికొస్తాయి...'

అతను ఇంకా చెప్పబోతున్నాడు. కాని సుబ్బరామయ్యగారు ఒక్కసారి అతనిపక్కకి దూకారు: 'అంతమాటనకండి. మా అబ్బాయి అమాయకుడు. వాడికేమీ తెలియదు. వాడు అమాయకుడు. తెలియక దారి తప్పాడు. వాడు అమాయకుడు...' అని అన్నమాటే అనటం ప్రారంభించారు—తన కొడుక్కి ఆ పెద్దమనిషి మరణశిక్ష విధిస్తున్నట్లుగా!

అతను కొంచెం శాంతించి 'లేదు లెండి. మీ అబ్బాయంటే మీ అబ్బాయేకాదు. ఆ వయసులో వాళ్లకి ఆవేశం ఎక్కువ, ఆలోచన తక్కువ. ఈ సమాజంలో జరుగుతున్న అన్యాయాలూ అక్రమాలూ ముఖ్యంగా ఒక వంక ఆకలీ మరొక వంక అతి మింగుడూ వాళ్లకి కడుమంట కలిగిస్తున్నాయి. దీన్ని పీకేస్తామని బయల్దేరారు. మరో సమాజం చూడనివాళ్లకి దగ్గర కొండలు గరుకు. ఆ గరుకులు కొన్ని చదునుచేస్తే చాలదూ!'

ఆయన ఆందోళన కొంచెం అణుచుకుని, 'ఇంతకీ మీ పేరేమిటి మేస్టారూ?' అన్నారు.

'నా పేరేదయితే యేంగాని,మీకు సాయం చెయ్యటానికి ప్రయత్నించటంవల్ల నాకు రెండువిధాల నష్టం. ఇటు పోలీసులకి నాకు నక్సలైట్లతో సంబంధం వుందని అనుమానం కలుగుతుంది. అటు నక్సలైట్లకి నేను పోలీసు ఏజంటునేమోనని అనుమానం కలుగుతుంది. మీరు వెంటనే ఇక్కణ్ణించి వెళ్లిపోతే మంచిది' అన్నాడతను.

'మీకు ప్రమాదం కల్పించటం నామతం కాదు. నేను వెంటనే ఇంకెక్కడికైనా వెళ్లి రాత్రి గడుపుతాను. మీకు పోలీసుల్నుంచేమీ ప్రమాదం లేకుండా నేను పూచీ పడతాను. నాకు సాయం చెయ్యటానికి

మీరే సరైన మనిషిలా కనిపిస్తున్నారు. డబ్బెంతైనా ఖర్చు పెట్టడానికి సిద్ధం.'

'డబ్బుతో కొనరాని వస్తువులు ఇంకా కొన్ని ఉన్నాయని మీ కెప్పటికీ నమ్మకం కల్గదు, సుబ్బ రామయ్యగారూ.' అన్నాడు పంతులుగారు కటువుగా. అయితే రంగారావు సంగతి వాకబుచేసి చెబుతానని మాత్రం వొప్పుకున్నాడు. అక్కడికిదగ్గర్లో అప్పలసామి కొట్లో రాత్రి వుండటానికి చోటు దొరుకుతుందని పంపించాడు. 'రేపు సాయంత్రం నాలుగ్గంటలకి బడి వొదుల్తాము. ఆ టైముకి నేనేవొచ్చి మిమ్మల్ని కలుసుకుని ఏ మాటా చెప్తాను,' అన్నాడు.

*　　*　　*

తెల్లవారగానే అప్పలసామి టీ తెచ్చి ఇచ్చాడు. ఆయన ఏం పనిమీద అక్కడికి వచ్చారో కూపీ తియ్యటానికి ప్రయత్నించాడు. చింతపండు వర్తకం పెడదామని సరుకు విషయం ఆరా తియ్యటానికి వచ్చానన్నారాయన. అప్పలసామి నవ్వి 'చింతపండు కిది సీతనుకాదు బాబూ, మీకీ యవ్వారం సంగతి బొత్తిగా తెలీదునాగుంది' అన్నాడు మర్యాదగా. ఆయన చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు.

ఇంతలో రెండు పోలీసు జీపులు అప్పలసామి కొట్టుముందు ఆగాయి. అందులో ఒక జవాను చేతు లకీ కాళ్లకీ గాయాల కట్లతో మూలుగుతూ పడి వున్నాడు. అప్పలసామి వాళ్లకి నీళ్లూ, టీ, సరఫరా చేశాడు.

'రేత్తిరికి కురుపాం దెగ్గిర పైరింగైపోనాదంట బాబూ. పోలీసోడిమీద బాంబేసీసినారు. ఇద్దరు సచ్చారు.'

'ఎవరిద్దరు చచ్చారు?' అన్నారు సుబ్బ రామయ్యగారు ఉలిక్కిపడి.

'ఆలే, నక్సలైట్లు' అన్నాడు అప్పలసామి. ఇంతలో మరొక పోలీసు జీపుకూడావచ్చి అక్కడ ఆగింది సుబ్బరామయ్యగారు లేచి నిలబడి జీపులోకి తొంగి చూశారు. గుడ్డకప్పిన రెండు శవాలు అందులో వున్నాయి.

వెంటనే ఆయన ముందు జీపులోవున్న పోలీసు అధికారి దగ్గరకి వెళ్లి 'ఆఫీసరుగారూ, చచ్చిపోయిన వాళ్లపేర్లు తెలిశాయా?' అన్నారు.

'వెళ్లవయ్యా, నీకెందుకు?' అన్నాడు అధికారి చిరాగ్గా. అతను చాలా ఆందోళనలో ఉన్నాడని తెలుస్తేవుంది. కాని మరొకసారి సుబ్బరామయ్య గార్ని తేరిపారజూసి, జీపులోనుంచి కిందికురికి, 'నమ స్కారం సార్, మీరెందు కొచ్చారిక్కడికి?' అన్నాడు.

ఆయన తనను బయట పెట్టవద్దని సంజ్ఞ చేసి, 'ఎవరు చచ్చిపోయారు?' అన్నారు టూకీగా.

'ఇంకాపేర్లు తెలియలేదండీ. ఎవళ్లో కొత్త కుర్రాళ్లు' అని తిన్నగా శవాలున్న జీపుదగ్గరికి దారి తీశాడు పోలీసు అధికారి.

సుబ్బరామయ్యగారి గుండెలు అప్పటికే వేగంగా కొట్టుకుంటున్నాయి. కొత్త కుర్రాళ్లనగానే గుండె వేగం మరికొంచెం హెచ్చింది. కాళ్లు పట్టు తప్పేంతగా వణకటం ప్రారంభించాయి. ఒక శవంమీద కప్పినగుడ్డ ఆయనే స్థిగత్యం కోల్పోయినచేత్తో లాగి చూశారు. అది తన కొడుకు శవంకాదని తెలియగానే గట్టిగా నిట్టూర్చారు.

పోలీసాఫీసరు రెండోశవం ముఖంమీద కప్పు తొలగించేసరికి ఆయన నాలుక పిడచకట్టుకు పోయింది. చావులోకూడా కోపం చిందిస్తున్న ఆలేత ముఖం—రంగారావుది.

'రంగా!' అని ఒక్కఅరుపు అరిచారాయన.— తన పిలుపువల్ల కొడుకు లేచి కూర్చుంటాడన్నంత ఆత్రంతో.

'ఎవరండి? శవాన్ని మీరు ఐడెంటిఫై చెయ్యగలరా?' అన్నాడు పోలీసు ఉద్యోగి.

పోలీసువారి శవాల గుర్తింపు సమస్యలు తీర్చే పరిస్థితిలో లేరు సుబ్బరామయ్యగారు. రెండునిమిషాల తరవాత, 'వృద్ధాప్యంలో ఈ చేతకాని నాన్నకి పనికి రాని పాఠం నేర్పావురా, రంగా!' అని సన్నటి మూలుగ లాంటి ధ్వని వినబడింది ఆయననోట. 'నువ్వే పాఠం నేర్చుకున్నావోకాని రంగా, ఆపాఠం నీకూ పనికిరాలేదు.' అని శవంమీద పడి గొల్లు మన్నారు సుబ్బరామయ్యగారు.

# సరిపాడ పూన్డి తామ్రశాసనము - మడికి రేకులు

## శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి

### శాసనలబ్ధి

ఈ రార్పుగోదావరి జిల్లా, ఆలమూరు తాలూకా మడికి గ్రామమున 7, 8 సం॥ పూర్వము ఆ యూరి గ్రామకరణముగారికి పాటిమట్టి త్రవ్వక మునం దీ శాసనము దొరకినదట. క్రమముగా పురా వస్తు పరిశోధక కీ. శే. శ్రీ రాళ్లబండి సుబ్బారావు పంతులుగారు దానిని సంపాదించిరి. వారు నాయందు గల ప్రేమాతిశయముచే ఆ తామ్రశాసన ప్రతి బింబములను (ఒక్క ప్రతిమాత్రమే) ప్రసాదించి తెలుగు పత్రికల ప్రకటింపననువు గల్పించి నందులకు వారికి నా కృతజ్ఞతాభి వందనముల సమర్పించుచు వారి యాత్మశాంతికై సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఈ శాసనపు తామ్రపత్రములు ప్రత్యక్షముగా జూడజాలక బోయితిని. అందుచే అందుండు రాజ ముద్రికా చిహ్నములగాని తూకముగాని వివరింప జాల నైతిని. కేవల మీ యేకైక ఛాయాప్రతిబింబముల నాధారముగా గైకొనియే నాయోపినకొలది పరిశీలించి యీదిగువ విషయముల బొత్తుపఱచి వ్రాయ బూనుకొంటిని.

### శాసన స్వరూపము స్థితి

ఇది అయిదు రేకులుగల సంపూర్ణ శాసనము. ప్రతిరేకును $23 \times 11\frac{1}{2}$ సె. మీ. కొలతలు గలిగి యున్నది. ఎడమచేతి వైపున 5. సె. మీ. దూర మున 2. సె. మీ. ఉబవగల ఒక రాగికడియము ఈ శాసనపురేకుల బంధిచిన రంధ్రమునుగలదు. అందుచే ఆ రాగి కడియము $1\frac{1}{2}$ సె. మీ. ఉబవయు 12 సె. మీ. వ్యాసమును గలదై యుండవలెను. ఈ రేకుల యందుగాని అక్షరములందుగాని నలుకుట, గుంటలు, గీతలు మొదలగు శిథిల చిహ్నము లెంతమాత్రమును గానవచ్చుటలేదు. అందుచే చక్కని స్థితియందే యుండును.

### శాసనలిపి — భాష

శాసనభాష సంస్కృతము. గద్యపద్యాత్మకము. గ్రామసరిహద్దులు మాత్రము ఆనాటి (నన్నయకు పూర్వపు) తెలుగుభాషయే. లిపి 10 వ శతాబ్దము నందలి వేంగీచాళుక్యలిపియే —ఇందు

9 శార్దూల విక్రీడితములు;
8 అనుష్టుప్పులు;
5 ఆర్యావృత్తములు;
2 ఇంద్రవజ్రలు;
2 వసంతతిలకములు;
1 స్రగ్ధర;
1 రథోద్ధతమను పరాంతిక;
2 మాలినులు;
7 గద్యలు (అందొక చూర్ణిక);
2 పేరుతెలియని శ్లోకములు;
1 లేఖాచార్య నామధేయము అను 40 గద్య పద్యములు గలవు.

మొదటిరేకు మొదటివైపున నేమియు వ్రాసి యుండలేదు. మొదటిరేకు రెండవవైపున 12 పంక్తులును; 2, 3, 4 రేకుల నిరువైపులనుగల $3 \times 2$ - ఆఱు పుటలను; $6 \times 13 = 78$ పంక్తులును; అయిదవ రేకు మొదటి పుటను 15 పంక్తులును; దాని రెండవ పుటను (ఆఖరుపుటను) 3 పంక్తులును; మొత్తము $12 + 78 + 15 + 3 = 108$ పంక్తులు గలవు.

## లేఖనాదోషములు

లిపి చక్కగాను, ఆకర్షణీయముగాను వ్రాసెనే గని భాషయందు లేఖనాదోషములు కుప్పతిప్పలుగా గాన్పించుచున్నవి. నాకా భాషాపరిచయమంతగా లేకున్నను నా యోపిన కొలది సవరణపట్టిక నెక్కడికక్కడనే పొందుపఱచితిని.

## శాసన విషయములు

1—17 పంక్తులు తూర్పు చాళుక్యవంశమునకు మూలమైన చంద్రవంశవర్ణనము; 18-23 కోసలవిజయాదిత్యుని దక్షిణాపథ దండయాత్ర, విష్ణువర్ధన జననము; 24-47 కుబ్జవిష్ణువర్ధుని మొదలు సత్యాశ్రయ విమాలాదిత్యుని వఱకునుగల వంశవర్ణన; 48 విమలాదిత్య పట్టాభిషేకకాలము; 49—60 విమలాదిత్యుని బిరుదులతోగూడిన రాజ్య, విజయవైభవములు; 60—68 విమలాదిత్య యశో వైభవము, రాజసభ, ఆజ్ఞాపన; 69-88 ప్రతిగృహీత వంశము, వైభవము, గుణగణాతిశయము, దండనాయక, సామంతచిహ్నములు; 88-92 దానస్థల నిర్ణయము; 92-102సరిహద్దులు; 102—106 దాన, పాలనా ఫలితములు; 106 దానకాలము; 107— 08 శాసనకావ్యకర్త, ఆజ్ఞప్తి, లేఖక నామధేయములు.

## వి వ ర ణ ము

1—17 పంక్తులు చాలుక్య వంశమునకు మూలమైన చంద్రవంశ వర్ణన. పురాణోక్త్యను సారము. ఇది ఇంతవఱకును (ఈశాసన కాలము వఱకును) తూర్పు చాళుక్యుల ఏ శాసనమందును గానరాదు. అందువలన ఈ పురాణ కల్పిత వంశ వృక్ష వర్ణన కీ తామ్రశాసనమే ప్రాతిపదికమైనది. దానిని వ్రాయించిన పాలకుడు విమలాదిత్య విష్ణువర్ధన మహారాజు. దానిని వ్రాసినకవి (శాసన కావ్యకర్త) రాచియ పెద్దేరితనయ భీమనభట్టు. సరిగా నీ కావ్యాంశములే యీ మహారాజుచేతనే వ్రాయించబడి ఈ శాసనకావ్యకర్తచేతనే వెలువరించబడిన 'రణస్థిపూన్డి' శాసనమునగలవు. అందుచే నేటివఱకుగల చారిత్రక పరిశోధకు లీ పురాణకావ్యకల్పనకు ప్రాతిపదికము ఆ 'రణస్థిపూన్డి' తామ్రశాసనమే యని వక్కాణించియున్నారు. కాని ఇపు డీ సిరిపోడి పూన్డి' తామ్రశాసన మా రణస్థిపూన్డి తామ్ర శాసనమునకు అయిదు—ఆఱు మాసములకు పూర్వమే వ్రాయబడి యుండుటచే నిపు డీ 'సిరిపోడిపూన్డి' తామ్రశాసనమే పురాణోక్తమైన చంద్రవంశమునకు తూర్పు చాలుక్యవంశము జతగూర్చ బడినది యని ధ్రువమగు చున్నది. ఏలనన:— 'రణస్థిపూన్డి' తామ్రశాసనమున 'అష్టమవర్షవర్ధనే సింహమాసే దత్తస్యాస్య శాసనస్య' అని యుండగా యీ సిరిపోడిపూన్డి' తామ్రశాసనమున 'సప్తమవర్షవర్ధనే మీనమాసే దత్తస్యాస్య శాసనస్య' అని వ్రాయబడినది. సప్తమ వర్ష వర్ధన మీనమాసమునకును అష్టమవర్ష వర్ధన సింహ మాసమునకును రమారమి ఆఱు మాసములకాలము వ్యత్యాసమున్నది. కావున ప్రప్రథమమున వ్రాయబడిన యీ 'సిరిపోడిపూన్డి శాసనమే చంద్రవంశప్రశస్తికి మూలాధారము.

## పురాణ (చంద్ర) వంశ
## క ల్పా నా వ శ్య క త

ఈ విమలాదిత్యవిష్ణువర్ధునకు జన్మదా రభ్య యుద్ధప్రసంగములతోనే కాలము గడిచిపోయెను. అది ఈతనితోనే ప్రారంభముకాలేదు. తొలుదొల్త ఈతని తండ్రి దానార్ణవునకును పినతండ్రి రెండవ అమ్మరాజ విజయాదిత్యునకు రమారమి 22 సం॥లు యుద్ధరంగములందే కాలము గడిచిపోయెను. ఆ విషయమున నాతనికి ప్రత్యక్షానుభవము లేకున్నను పైతృక సంబంధగాథాసాన్నికర్షమబ్బెను. ఆ పిదప తండ్రి దానార్ణవుడు రాజ్యము సంపాదించినను స్థిరత్వ మబ్బలేదు. స్వల్పకాలములోనే 3 సం॥నాటికే కాలగతి నందెను. నాటినుండి సుమారు 27 సం॥ కాలము రాష్ట్రకూటులు, గాంగులు మొదలగు వారితోనేగాక నిర్విక్రపరాక్రమప్రసిద్ధుడైన జటాచోడభీమునిచే యీ అన్నదమ్ము లిర్వురును పదభ్రష్టులై వేంగీ

దేశము విడిచి ప్రవాస మనుభవించి పిందరి రాజులనో ఆశ్రయించి అనేక యుద్ధములలో జయాపజయ మధ్యస్థమై నసంకటావస్థల మునిగితేలుచు తుదకు క్రీ. శ. 990 ప్రాంతమున చోడదేశమునకు బోయి రాజరాజు నాశ్రయించి వారి కన్యను కుందవాంబను విమలాదిత్యుడు వివాహమాడి వారి సంపూర్ణ సహాయమున తిరిగి వేంగీదేశమును తన యన్నగారైన 'శక్తి వర్మకు' పట్టము గావించుకొనెను. ఆ పది సంవత్సరములైనను శత్రుబాధలు తప్పలేదు. నిరంతర సంగ్రామ సమావేశములే శరణ్యమయ్యెను. ఆ పిదప ఈ విమలాదిత్యుడు క్రీ. శ. 1011 న రాజ్యారోహణము గావించినను, సంగ్రామ సంకటావస్థలు తప్పలేదు. శత్రువర్గీయులైన రాష్ట్రకూటులతోడి, గాంగులతోడి సంగ్రామములకుదోడు పశ్చిమ చాళుక్య దండయాత్రాసంక్షోభ మధికమై తాళలేక తిరిగి ద్రావిడదేశప్రవాసియై చోడరాజుల (అత్తవారి) సహాయమున 4 సం॥ములకుగాని తాను సంపూర్ణముగా సుస్థిర రాజ్యాధికారి కాలేకపోయెను. ఇంతకును 25 సం॥కాలము తమ వంశాభివృద్ధికై తోడ్పడి రాజ్యస్థిరాస్తిక్యముగావించి తుదకు గన్యనిచ్చి ఆదుకొన్న అత్తవారైన చోడవంశపురాజులు సూర్యవంశపురాజులని ప్రసిద్ధిగనియున్నారు. అట్టి ద్రావిడచోడరాజ్యాధిపతులు పరమశౌర్యపరాక్రమ సాహసోపేతులైన సూర్యవంశోద్భవులై యుండిన వారితో నెడతెగని మైత్రినంది వేంగీదేశాధిపతులై వియ్యమందిన కారణముచే వీరును పరమపవిత్రమైన పురాణవంశస్థులు కావలెనుగదా? అందుచే 'వియ్యకయ్యముల సరిసాటి కావలె'నను నార్యోక్తి ననుసరించి వీరికిని పురాణోక్త పవిత్రవంశ సంబంధము ప్రాతిపదకము కావలసివచ్చెను. హైందవ సంప్రదాయానుసారముగ జగదుపకారులైన ప్రత్యక్షదైవములు సూర్యచంద్రులు. (దివాకర, నిశాకరులు). అందొకటి సూర్యవంశము. అది ఇదివరకే ద్రావిడ దేశాధిపతులైన చోడరాజుల కంకితమయ్యెను కావున ఆస్థానపండితుడును, సమస్తశాస్త్ర పురాణేతిహాస ధర్మజ్ఞుడునైన 'రాచియ పెద్దేరితనయ భీమనభట్టు' జగజెట్టియై సమయోచితముగ — పరమ ప్రత్యక్ష దైవమై, సకలజగదానందకారకుడైన చంద్రునితో సంబంధించిన చంద్రవంశముతో ఈ చాలుక్యవంశమునకు సంధానము గావించి తన గౌరవస్థానమునకు వన్నె దెచ్చుకొనెను. ఈరీతిగా చాలుక్యవంశము అప్పటి నుండియు చంద్రవంశీకులుగా శాసన, కావ్యోద్దీపకులైరి.

1. చారిత్రక విరుద్ధములు:— దక్షిణాపథ మందుగల అన్ని చాళుక్యవంశములకు మూల పురుషుడు కోసల విజయాదిత్యుడే అట్టి అన్నిచాళుక్య వంశములు చంద్రవంశీకులుగానే శాసన కావ్యాదుల బేర్కొనబడవలెను. కాని అట్లుగాక ఒక్కొక్క వంశము వారొక్కొక్క తీరున ప్రశంసింపబడుట వింతగాదోచును. వానియందు 'అస్యాదిత్యభవోవంశ చాలుక్య విశ్రుతః' అనియు, 'హిమకరకరకులం', 'సూర్యచంద్ర వంశములకు మించిన పరమపవిత్ర వంశము' అని జెప్పుకొ యుండుటగాంచ ఈ చాలుక్య వంశపురాజులు తమవంశమును బేర్కొనవలయునని ఇచ్ఛకలిగినప్పుడు అప్పటి పౌరాణికాభిప్రాయముల ననుసరించి వారు సూర్యవంశమని మొదట జెప్పుకొని యుండవచ్చునని, అర్వాచీనులు దీని నే కారణముచేతనో యొప్పుకొనక సూర్యవంశమునకు స్వస్తిజెప్పి చంద్ర వంశము వారమని ప్రకటించుకొని తదనుగుణముగ నూతన వంశానుక్రమణికలను ఆ గాథలను నిర్మించి కొని యుండవచ్చునని' అనుట సత్యమైనది. [వేముల వాడ చాళుక్యులు. శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు. 'భారతి' సర్వధారి జ్యేష్ఠము. 65 పే].

(2) 18—47 పంక్తులు:—కోసల విజయాదిత్యునిదక్షిణాపథదండయాత్ర—విష్ణువర్ధన జననము. కుబ్జవిష్ణువర్ధనుని మొదలు సత్యాశ్రయ విమలాదిత్యుని వఱకునుగల వంశవర్ణన. ఇతర చాళుక్య తామ్రశాసనములకు భిన్నముకాదు.

గమనింపు : క్రీ. శ. 927 సం॥ బేట విజయాదిత్యుని ఏలుబడి (వరణపన్డి తామ్రశాసన కర్త) ఇతర చాలుక్య తామ్రశాసనము లందువలెనే ఇందును లోపింపబడియే యున్నది.

(3) 48 పంక్తి. విమలాదిత్యుని పట్టాభిషేక నిర్ణయము: — 'అనలానలరన్ధ్రగతే శకవర్షే వృషభమాసి సితపక్షే ... షష్ఠ్యాం గురు పుష్యే సింహే లగ్నే ప్రసిద్ధ మభిషిక్తః' అనుదాని ననుసరించి శా. శ. 933+78= క్రీ. శ. 1011 వృషభ మాసి – మేయికి సరిపోవుచున్నది. ఈ విమలాదిత్యుని చేతనే ఏర్పాటు గావింపబడిన 'రణస్థిపూన్డి' తామ్ర శాసనమందును ఈ శ్లోకమే యుదాహరింపబడి యున్నది. అందుచే క్రీ. శ. 1011 మేయి 10 తేది అని చారి తకులు చాలమంది వెలిబుచ్చియున్నారు. కాని కొందరు చారిత్రకుల అభిప్రాయానుసారముగ క్రీ. శ. 1015 మేయి 10 గురువారమని కొన్ని గ్రంథముల కాన్పించుచున్నది. అందుచే ఈ పట్టాభిషేకకాలనిర్ణయమున నీ ద్వైవిధీభావమెట్లు సంభవించెనో పరిశీలింప వలెనుగదా?

విమలాదిత్యుని పట్టాభిషేక నిర్ణయమునకు రెండు విధములు అవలంబించినటుల గానవచ్చుచున్నది. (అ) రణస్థిపూన్డి' తామ్రశాసనము ననుసరించి విమలాదిత్యుని పట్టాభిషేకకాలము క్రీ. శ. 1011 మేయి 10 గానే యున్నది. అయితే 'శక్తివర్మతమ్ముడు శక్తివర్మ తరువాత నితడు 1015 సంవత్సరమున సింహాసనమునకువచ్చి 1022 వఱకు నేడు సంవత్సరములు మాత్రము పరిపాలన చేసియుండెనని కొన్ని శాసనములు స్పష్టముగా తెలుపుచున్నవి' అని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రదేశ కథా సంగ్రహమున 291 పే. పదునాలుగవ ప్రకరణమున వ్రాసియున్నారు.కాని ఆ శాసనములేవియో యుదాహరించి యుండలేదు. ఈ విషయమును నేటి వఱకెవ్వరును పరిశీలించినట్లును గానరాకున్నది. దీనిని గమవింప చాలుక్యవంశాభరణుండును, ఆంధ్ర భోజుడునైన రాజరాజనరేంద్రుడు ప్రసిద్ధపురుషుడై యుండుటచే నాతని పట్టాభిషేకమును ప్రమాణముగా తీసికొని అందుండి విమలాదిత్యుని రాజ్య కాలము ఏడు సంవత్సరములని శాసనము లుద్ఘాటించిన ప్రమాణమును తిగించుట యొకకారణము.

రాజరాజ నరేంద్రుని పట్టాభిషేక కాలము : –

యో రక్షితు వసుమతీం శకవత్సరేషు

..............................

వేదాంబురాశి నిధివర్తిషు సింహగేర్కే ।

కృష్ణద్వితీయదివసోత్తర భాద్రకాయాం ।

వారే గురో ర్వణిజలగ్నవరే౽ భిషిక్తః ॥

అని రాజరాజనరేంద్రుని నందంపూడి, మండ తామ్రశాసనములు విశదీకరించుచున్నవి. కావున దాని ప్రకారము రాజరాజనరేంద్రుని పట్టాభిషేక కాలమగు శా. శ. 944+78=క్రీ. శ. 1022 నుండి విమలాదిత్యుని పట్టాభిషేక కాలమగు ఏడు సంత్సరములు తిగించివేయుటచే 1022 7 1015గా భావించబడినట్లు తోచును. అయితే దీనికొక విఘాత మేర్పడుచున్నది. దీని ప్రకారము రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము క్రీ. శ. 1022 జూలై 19 కదా. మండ తామ్రశాసనమందు—తదనుజో వీరో విమలాదిత్య భూపతిః। మహీ మపా త్సనూ సప్త సప్తసప్తి సమద్యుతిః' అనికదా యుద్ఘాటించబడెను. అపుడు 1022—7—19 నుండి 7—7—7 క్రీ. శ. 1014—12—12 కావలెను. అది పుష్యమాసమగుటచే ధనుర్మాసము గావలసియున్నది. కావున రాజరాజనరేంద్రుని పట్టాభిషేక కాలమునుండి విమలాదిత్యుని పరిపాలన కాలము తిగించి విమలాదిత్య పట్టాభిషేక కాలనిర్ణయము గావించుట సముచితము కానేరదు.

(ఆ) శా. శ. 933+78=1011 మేయి 10 (రణస్థపూన్డి, సిరిపోడిపూన్డి తామ్రశాసనానుసారముగ) సరియైనదిగ గానవచ్చుచున్నది. చాలమంది చారిత్రకులిట్లే గణించుటయు విమలాదిత్యుని రాజ్యాధిరోహణమును (భారతి, వ్యయ — పుష్యమున 66 పేజీయందు) శ్రీవేదము వెంకటరాయశాస్త్రి గారి వ్యాసమును అట్లే ధ్రువపఱచుచున్నది. అంతేగాక Consultation Calendar ప్రకారము 1011 మేయి 10 తారీఖు గమనింపగా 10 శతాబ్ద ధ్రువసంఖ్య 3+; 11 సం॥ ధ్రు 6+; మే ధ్రు=.

7+; తేదీ . ధ్రు 10=3+6+7+10=26÷7=5 శేషము. భాన్వాదిగ గురువారమైనది. కావున క్రీ. శ. 1011—5—10 తేదీ విమలాదిత్యుని పట్టాభిషేక కాలనిర్ణయమైన 'గురు' వారమునకు సరియగు చున్నది. కాని క్రీ. శ. 1015—మేయి 10 అన్నచో పై నిర్ణయము ననుసరించి 10. శ. ధ్రు=3;+15 సం॥ధ్రు 4; + మే॥ధ్రు=7; తే.ధ్రు= 10=3 +4+7+10=24÷7=3 వ వారము భాన్వాదిగ మంగళవారము మాత్రమే అయియున్నది విమలాదిత్యుని పట్టాభిషేకకాలము గురువారము కాని మంగళవారము కాదు. కావున విమాలాదిత్యుని పట్టాభిషేక కాలము 1015 మేయి 10 గాక. 1011 మేయి 10 తేది అని ధ్రువమగుచున్నది. అంతేగాక అతని అన్నగారైన శక్తివర్మ మరణించునప్పటికి అతనికి సంతానములేదు. విమాలాదిత్యుడు అతనికి ద్వైమాతురుడైనను తండ్రియగు దానార్ణవుడు మరణించుటచే తాము రాజ్యభ్రష్టులై ప్రవాస ప్రయాసల కగ్గము కావలసి వచ్చుటచే నిర్వురును యేకోదరులవలెనే ఏ విధమైన పొఱపొచ్చములులేని నేత్రయుగ్మములవలె కష్టసుఖముల ననుభవించిరి. అంతేగాక శక్తివర్మరాజ్యపాలనమునగూడ వీరుభయులకు నే పొఱపొచ్చెము లున్నట్లు కానరాదు. కావున నిస్సంతుసోదరునకు ప్రథమవారసుడగు నీతనికి వెంటనే రాజ్యారోహణముచేయుట కెట్టియాటంకములుగానరావు. అంతేగాక పూర్వమునుండియు బగబట్టియున్న ఇతర దాయాదులును గానరారు. అయితే సంకోచ మొక్కటియున్నది. క్రీ. శ. 1014 వ నీతనిచే గావింపబడిన 'తిరువైయూరు' తమిళదేశపు శాసనము. అప్పటి కాతడు అత్తవారింటికి వెళ్లిన వెళ్లవచ్చును. లేక పశ్చిమచాళుక్య, గాంగ, రాష్ట్రకూటాది శత్రువుల మూకల దండయాత్ర లధికమగుటచే బూర్వపు రీతుల చోడరాజుల (అత్తవారి) సహాయ మపేక్షించి చోడదేశమునకుబోయి భావిసుఖముల తీర్చిదిద్దుకొను నుద్దేశముతో 'లోకమహాదేవీశ్వరముడయమహాదేవునికి' ఆ దానశాసనము గావించియుండవచ్చును. అంతమాత్రముచే అన్నయగు శక్తివర్మ గతించినంతనే నీతడు పదభ్రష్టుడై చోడదేశమునకు బాఱిపోయెనని నిర్దేశింప నలవిగాదు. అంతేగాక 'రాజుల పట్టాభిషేకములు సాధారణముగా నెలదినములలో జరుగుట యాచారము. చాళుక్య సోమేశ్వరుడు తుంగభద్రలో స్వయముగా మునిగి చనిపోయినపుడు ఉత్తరక్రియలైనవెంటనే పదునైదవదినమునాడు (శుభస్వీకరణసమయమున కాబోలు) అతని కుమారుడైన భువనైకమల్ల సోమేశ్వరుడు పట్టాభిషేకము జేసికొనెను. సాధారణముగా నొకరాజు పోయి మఱియొకరాజు పదునైదు దినములలో పట్టాభిషేకము నందకపోయిన దానికేదో బలమైన కారణము కలదని గ్రహింపవలెను'అను శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి ('విమలాదిత్యుని రాజ్యారోహణ వ్యాసము 69 పే.) వాక్యములను గమనింప వలసియున్నది. కావున ఏవిధమున జూచినను విమలాదిత్యుని పట్టాభిషేక నిర్ణయమందు శా. శ. 933 వృషభమాసముఅయిన క్రీ. శ. 1011 మేయి 10 తేదీ అగుట నిశ్చయము. మండత్రామశాసనము ప్రకారము అతని పరిపాలన 1011—5—10+7—7—7= క్రీ. శ. 1018—12—17 తేదీన అంతమగుట ధ్రువము గాంచుచున్నదేగాని ఏమాత్రమును సందేహింప నవకాశములేదు.

49—60 పంక్తులు:—విమాలాదిత్యుని బిరుదములు, విజయములూ; ఈతనికి 'బిరుదాంకభీముడు' 'త్రిభువనాంకుశుడు' 'ముమ్మడిభీముడు' అను బిరుదములుగలవు. స్వశరీర (రూపయౌవన) కాంతులచేతను అయిశ్వర్యాది శుభలక్షణములచేతను 'బిరుదాంకభీముడు' అనియు, 'త్రిభువనాంకుశము' అన యుద్ధమున వైరివీరుల గెలుచుటలో మత్తగజముల వంటి వారికి సింహపరాక్రమశీలుడై నిర్జించి వారి యేనుంగులను, వేలకొలది జవనాశ్వములను గైకొని శత్రు రాజాంతః పురస్త్రీల సాలభంజికల గావించుటచే శ్రీ త్రిభువన నాంకుశుడనియు' బిరుదులు గాంచెను. అంతేగాక 'ముమ్మడిభీముడు' అను బిరుదొకటి ప్రత్యేక ప్రసిద్ధిగాంచిన బిరదము.

రాజరాజనరేంద్రుని మండత్రామశాసనమున

57, 58 పంక్తుల ('భారతి' స్వభాను 192 పే)లో 'ముమ్మడి భీమకొల ముప్పదిపుట్ల వడ్లపట్టు వరిక్షేత్రం ఉత్తరదిశ ముమ్మడి భీమకొలం బదిపుట్ల వడ్లపట్టు జొన్నక్షేత్రంచ' అని గానవచ్చుచున్నది. అనగా ఆనాటి దైర్ఘ్య,పరిమాణ, తులా, కాలమానముల ముమ్మడి 'భీమకొల' అను ఒక నిర్దిష్టము గానబడు చున్నది. అట్లిదితడే గావించియుండుటచే ఈతనికి 'ముమ్మడి భీముడు' అను బిరుదు వచ్చియుండును..

సందేహము:—ఇట్టి మానపరిమాణ మీతని కావశ్యకమా? క్రీ. శ. 970 లో రెండవ అమ్మరాజు కీర్తికాయుడయ్యెను. ఆనాటినుండి క్రీ. శ. 1000 వరకును సుమారు 30 సం॥లు వేంగిదేశము పలుమారులు అనాయకత్వముచే వివిధ పరిపాలనముల మార్పుల జెంది, అల్లకల్లోలిత మయ్యెను. తిరిగి శక్తివర్మ వచ్చినప్పటికి దేశము అరాజకము అందువల్ల ఐశ్వర్యహీనత సంభవించుట సహజము. అందుచే వెంటనే దేశదారిద్ర్య నిర్మూలనకు ద్రవ్యసంపాదనకై నాణెముల సమకూర్చెను.విదేశములతో సముద్ర వ్యాపారమును బెంచెను. అందువల్లనే అతనిపేరున 'చాళుక్యచంద్ర' బంగారు నాణెములు సయాం ఆరకాన్ దేశములందు గానవచ్చుటే నిదర్శనము. ఆ పిదపను ఈ విమలాదిత్యుడు అన్నగారైన శక్తివర్మ గావించిన రాజ్యపరిపాలనాపాటవము వృద్ధిపొందించుటకై వర్తకసంబంధమైన విధుల బలీయము గావించుటకు తులా, దైర్ఘ్య, పరిమాణాదుల మానముల తన పేరుతో 'ముమ్మడికొల'అను పరిణామము గావించియుండుట అత్యవసరకార్యమై యున్నది. కావున ఈతని స్వల్పకాలరాజ్యపరిపాలనాకాలమందు దేశాభివృద్ధి, ప్రజాసౌఖ్యము, ఐశ్వర్యాభివృద్ధి, సంస్కృతి (నాగరికతా) వైభవములు నఖండవిజయము గాంచెనని ధ్రువమగుచున్నది.

60—68 పంక్తులు: – విమలాదిత్యుని వైభవము—కొలువుకూటము – ఆజ్ఞప్తి.

ఈ పంక్తులును ఈ విమలాదిత్యునిచే నేర్పాటు గావించబడి ఈ శాసన కావ్యకర్తయైన రాచయపెద్దేరితనయ భీమనభట్టుచే రచింపబడినవియే. ఈ లేఖలు జోన్నాచార్యునిచే లిఖింపబడినవే. 'రణస్థిపూన్డి' తామ్రశాసనమందును 'తు—చ'లు తప్పక యథామాతృకగా నుల్లేఖింపబడినవి. మహావైభవోపేతుడును, సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ రాజపరమేశ్వర. పరమభట్టారక పరమబ్రహ్మణ్య పరమమాహేశ్వరాది (వంశానుక్రమ స్వీకరణ) బిరుదాంచితుడై గృధవాడి విషయ రాష్ట్రకూట ప్రముఖకుటుంబినుల రావించి నిండుకొల్వుకూటమున (సామంత—మన్త్రి—పురోహిత – సేనాపతి—యువరాజ—దౌవారిక—అధ్యక్ష) ఇట్లు ఆజ్ఞాపించెను.

గమనింపు:—ఇందు 'యువరాజ' అని కొల్వుకూటమున ఉదాహరించుటచే ఈ శాసనకాలమునకు యువరాజు సభామధ్యమున అధికారదీక్షాలంకృతుడై, కార్యాచరణోన్ముఖుడై యున్న యౌవనప్రాదుర్భావమందున్నవాడేగాని కేవలము బాలుడు కాడనుట స్పష్టము. కొందరు విమలాదిత్యరాజ్యప్రారంభకాలమున క్రీ. శ. 1011 లో ఈతనిని చోడచక్రవర్తియగు రాజరాజు చెఱగొని ద్రవిడదేశమునకు గొంపోయి వీరిని వశపఱచుకొని తన కూతును 'కుందవాంబ'ను పరిణయము గావించెననియు, ఆ తరువాత రాజరాజనరేంద్రుడు జన్మించెననియు వ్రాసిన విషయములు మిధ్యామృషావాదములనుట నిశ్చయము.

68—88: దానప్రతి గృహీతవంశము, గుణగణ వర్ణన:—ఆదిని పరబ్రహ్మ స్వాయంభువుడుకాగా అతని తపోవీర్యులైన మరీచ్యాదులు పదిమంది మానసపుత్రులై జన్మించిరి. వారిలో వశిష్ఠమహర్షి ప్రముఖుడు. అతనికి పరమసాధ్వీమతల్లియైన అరున్ధతి ధర్మపత్ని. వారి కుమారుడు తపోనిష్ఠాగరిష్ఠుడై పరమసాత్త్విక స్వరూపుడైన కాన్డిన్య మహర్షి. అతనిపేరుతోనే కౌండిన్యగోత్రము వర్ధిల్లెను. అందు శుద్ధాత్మస్వరూపుడైన మల్లపార్యుడు జన్మించెను. వానికి శ్రౌతాచారసంపన్నుడు, అఘవిదూరుడు సౌజన్యహృదయుడునైన బాదపయ్య కలిగెను. అతనికి సాక్షాత్ శారదాదేవివంటి రేవకాంబ

ధర్మపత్ని. వారి సుకృతఫలముగా సాక్షాచ్చి లక్ష్మీవల్లభునివంటి శౌర్యౌదార్య గంభీర సాహసోపేతుడగు వల్లపార్యుడు దీనచిన్తామణిగా నుద్భవించెను. అతడు లోకమునందు దండనాయకుడై ప్రసిద్ధినొంది వైరివీరులచే బొగడబడిన వాడయ్యెను. అతడు ముమ్మడి భీమునివలన స్వకీయభుజబలమువలన తన స్వామి రాజ్యరక్షకుడై, బుద్ధిబలముచే శాస్త్రవిషయముల బోధించుచు రణకౌశలత్త్వము గలవాడయ్యెను. కావున (89—91) కనకదండ పింఛ ద్వార ప్రతిహార సేనా సముదయ చామర తూర్యనాద కనకఛత్రాది సామస్త చిహ్నముల బరిగ్రహించెను. అందుచే అనుకూలుడును, కష్టపడి (కాపాడి)న వాడును కౌణ్డిన్య గోత్రజుడును బాదపమల్లడను ప్రసిద్ధ నామముగల కమ్మనాటి బ్రాహ్మణునకు భవద్విషయ మందలి 'సిరిపోడిపూన్డి' అను గ్రామమును అగ్రహారము గావించి తన అభివృద్ధికొఱకు, గష్టించిన కృతజ్ఞతకై ధారాదత్తము గావించెను.

92 - 102—దానస్థలగ్రామ సరిహద్దులు. తెలుగు వచనము. దుళ్ల, జన్నవాటిక, సిదరావి అమడ ఱేవు, మడికి మధ్యస్థము.

103—105 దానఫలిత వ్యాస శ్లోకావళి.

106. దానకాల నిర్ణయము. సప్తమవర్ష మీనమాసము=క్రీ. శ. 1011+7=1018 సం॥ ఏప్రియల్ నెల,

107—108—ఆజ్ఞప్తి కావ్యకర్త లేఖకులూ.

### ప రి శో ధ న

దాన శాసనములకు సంబంధించిన గ్రామములు:— విమలాదిత్య విష్ణువర్ధనునిచే అతని పరిపాలనాంత్యకాలమగు క్రీ. శ. 1018 సం. ఏప్రియల్ నెలలో 'సిరిపోడిపూన్డి' తామ్రశాసనమును 1018 (ఆ సంవత్సరమందే) సెప్టెంబరునెలలో 'రణస్థిపూన్డి' తామ్రశాసనమును గావింపబడెనుగదా. అందు రెండవదియగు 'రణస్థిపూన్డి' తామ్రశాసనము చాలకాలముక్రిందనే బయల్పడి చారిత్రకప్రసిద్ధి చెంది యున్నది. మొదటిదిఅగు 'సిరిపోడిపూన్డి' తామ్ర శాసనముమాత్రము ఇపుడు బయల్పడినది. అయితే అపుడా 'రణస్థిపూన్డి' తామ్రశాసన సంపాదకులు వివరించుపట్టున పొఱబడినట్లు గానవచ్చుచున్నది. ఏలనన దానస్థలనిర్ణయమునందు 'భవద్విషయే పొఱవటినామ గ్రామేణ సార్ధం రణస్థిపూన్డి నామ గ్రామః.........' 'పూర్వతః కౌంతనడిపియచెఱువు పడమటికట్ట; ఆగ్నేయతః మ్రోంతకుత్తియుం బాలూరియు రణస్థిపూన్డియు ముయ్యాలికట్టున వెలంగగుణ్ట పడమటికట్ట; దక్షిణతః పెంజెఱువు కట్ట డిగ్గ్రతోవ; నైరిత్యతః పాలూరియుం గొఱుకాటియు రణస్థిపూన్డియు ముయ్యాలికుట్ట చింతగుణ్ట; పశ్చిమతః కొఱుకోటిపొదరు; వాయువ్యతః ఉల్లసీమ్మె వసీమా; ఉత్తరతః—కఱుపత్తియు నేతిదియు సీమ్మె వసీమ; ఐశానతః ఏఱ్ఱిదియు మ్రోన్తకుత్తియు, రణస్థిపూన్డియు ముయ్యాలికుట్టు; ఏతద్రణస్థిపూన్డి గ్రామాగ్రహార సంబంధినః తాంకటిపొలము వామోల్లంఘన క్షేత్రస్యావధయః। పూర్వతోదక్షిణతశ్చ గాంగవేఱు। పశ్చిమతః సిరిపోడిపూన్డియు గాంగనవోలియు ఉల్లయుం బొత్తనకొల్కుఱు। ఉత్తరతః సిరిపోడిపూన్డి సీమ్మెవసీమా, అని సీమానిర్ణయము. అందు శాసన ప్రచురణకర్తలు—'రణస్థిపూడ్డి గ్రామముచుట్టును మొతకుఱు (మోడేకుఱు), ఉల్ల(లొల్ల), సిరిపొడ, పూడి (పెదపూడి), చింతగుంట, పెంజెఱువు మొదలగు గ్రామములు మొదలగునవి గోదావరి మండలములోని అమలాపురము తాలూకాలోనివిగా గన్పట్టుచున్నవి. పొఱువళ గ్రామము అమలాపురము కాలువ యొద్దనున్న పలివెల గ్రామముగా నున్నది.' అని ఆంధ్రదేశ కథాసంగ్రహము — పదునాలుగవ ప్రకరణమున (295పే) ఉదాహరింపబడియున్నది. ఇపుడు దానిని బరిశీలింపగా నది పొఱబాటని వెల్లడియగుచున్నది. అందలి 'ఉల్ల' అనునది 'లుల్ల' గాక 'దుళ్ల' అను గ్రామము. ఆనాటి శాసనలిపిలో 'ఱ' అను అక్ష

రము 'అ, ద, డ, న, శ' మొదలగు అనేకాక్షరములకు సాంకేతికాక్షరమై యొప్పియున్నది. ఆ విషయము ఎపిగ్రాఫిష్టులందరు అంగీకరించిన విషయమే. దాని విషయమై 'వరణపిస్ఠి' తామ్రశాసనము— 'తొలివాయి— తుల్యభాగానది' అను వ్యాసమున విపులముగ విశదీకరింపబడి యున్నది. అంతేగాక 'సిరిపోడి పూండి' పెదపూడిగాకాక సిరిపోడిపూన్డిగానే నేటి ప్రత్యేక తామ్రశాసనమే దొరకినది. 'కొంతనడిపియ: చెఱువు అనునది కొంతేయ యనబడు యొక నది అది భీమమండలములోనిది. 'మ్రోంతకుఱ్ఱు' మోడేకుఱ్ఱుగాదు మోదుకూరు; పాలూరు అను గ్రామనామమే ఇంటిపేరుగా గలవారు నేటికిని గ్రామకరణములై యున్నారు; కొఱుకోటిపాదరు నేటికిని కొఱుప్రోలు పేరున పొలములు చెఱువును గలవు. 'ఉల్లి'యే దుళ్ల; 'కటిపత్తి' అనునది కనుపర్తిపాడు అను పేరున 60, 70 సంవత్సరముల క్రితమువఱకుండి నేడు జీర్ణించిపోయిన చిన్నగ్రామము. ఏడిద శివారు. ఏణ్డిది, ఏడిది యను గ్రామము. ఈ గ్రామములన్నియు నేటికిని రామచంద్రపురం తాలూకాంతర్భాగమగు ఆలమూరుతాలూకాలో గలవు. అంతేగాక దీనికిసరిహద్దుగ్రామము సిరిపోడిపూన్డి దానికి సరిహద్దు గ్రామముగా నుదాహరింపబడి యిచ్చటనే యున్నది.

### శాసన సమీక్ష—ఫలితములు

'చోళులును విమలాదిత్యుడురాజై మరల వేంగియందు నెలకొన్నదే చాలునని, ఇంత యుద్ధమైన తరువాత కొంతకాలము వఱకైనను వేంగికి భయములేదని తలంచి తమదేశమునకు వెడలిపోయి యుందురు...విమలాదిత్యుడును క్రీ. శ. 1018 వరకును రాజ్యమును పాలించి తన కుమారులైన 'రాజరాజ నరేంద్ర విష్ణువర్ధన' విజయాదిత్యులకు యావజ్జీవమును జగడమాడుటకు దగిన పరిస్థితిగల రాజ్యమును ఆస్తిగా వదలిపోయెను.' ('భారతి' వ్యయ—పుష్యము, 71 పే. 'విమలాదిత్యునిరాజ్యాధిరోహణము') అను శ్రీవేదం వెంకటరాయశాస్త్రిగారి వ్యాసమే తధ్యమగుచు కానవచ్చును. అందుకుగల కారణములు:

(1) క్రీ. శ. 1014 లో నీ విష్ణువర్ధన మహారాజ విమలాదిత్యదేవుడు తంజావూరులోని తిరువయ్యారులో 'లోకమహాదేవీశ్వరముడయదేవునికి, కొన్ని వెండిపాత్రలు దానమిచ్చిన శాసనముతప్ప తిరిగి క్రీ. శ. 1018 ఏప్రియల్ వఱకునుగల ఆయన ఏలుబడిలోని ఏడు సంవత్సరములందును వేంగిదేశ మందొక్క శాసనమైనను గానరాకుండుట.

(2) చరమదశయందు మాత్రమే ఆఱునెలల వ్యవధిలోనే 1018 ఏప్రియల్ నెలలో 'సిరిపోడిపూన్డి' తామ్రశాసనమును; 1018 సెప్టెంబరు నెలలో 'రణస్థిపూన్డి' తామ్రశాసమును వెలయించుట.

(3) ఈ రెండు తామ్రశాసనముల మధ్య అల్పకాలములోనే క్రీ. శ. 1018 (జ్యేష్ఠ మాసమున) జూలై నెలలో ఈతని సామన్తరాజగు 'చోడపరాజు' పడవాలు నడుపనాయకునకు 'ఏడువాడల పాలెమును' 'కవచెఱువుల' శాసనము గావించుట; సూర్యవంశోద్భవ రామభట్టారక వరప్రసాదలబ్ధ రాజ్యాభిషేక సంపద్విరాజ ధ్వజ పీతాంబరపతి గరుడ ధ్వజః మధుపురవరమేశ్వరః వేంగీపుర బ్రహ్మపోషణాశ్రయః......... శ్రీ మన్మలయాధిపతియైన చోళయరాజులు పడవాలు నడపనాయకునకు......' మొదలైన విషయములు ('భారతి —కవచెఱువుల శాసనము) శ్రీ కర్తి సాంబమూర్తిశాస్త్రిగారి పరిష్కృత మూలపాఠమున పరిశీలనా విషయమైనవి.

(4) ఇవిగాక 'ఈతడు చరమవయస్సునందు జైనమతమును స్వీకరించి, దేశిగణమునకు జెందిన త్రికాలయోగి సిద్ధాంతదేవుడను జైనగురువు శిష్యుడయ్యెనన్న 'రామతీర్థ శాసనము' (ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి. 198 పే.) గమనింపతగ్గది.

ఇంతకును మూలకారణము ఈతని చరమదశలో బలవంతులైన (అత్తవారు) చోడవంశీయుల అండదండలచే శత్రువర్గమంతయు పరాభూతమైనను కులక్రమాగతమైన 'దాయస్పర్థలు' తిరిగి ప్రారం

భమై విజృంభించి తన కుమారుడైన రాజరాజ నరేంద్రుని యావజ్జీవము బ్రక్కలోని బల్లెమువలె బాధించుటయేగాక, నాతని పౌత్రుడైన 'రాజేంద్ర చోడుడు' తండ్రి కుమారులు మనస్పర్థలకును, 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అను నార్యోక్తినిగూడ నవలద్రోసి పరదేశమేగి మాతా మహులవంశము స్వీకరించి తన జన్మవంశము నంత రింపజేయుటయు; తన తండ్రి ఆంధ్రభోజుడై దేశ భాషా కావ్య(గ్రంథ)మునకు పోషణత్వము వహించి కులబ్రాహ్మణుని ప్రోత్సహించి వ్రాయించిన పంచమవేద మైన 'భారతము' పూర్తిగావింపకబోవుటయు; తుదకు తండ్రి కుమారుల జీవితపర్యంతము కంటిజూపు పంటిమాట లేకబోవుటయేగాక, ఆ వంశమువారెవ్వ రును, తమ రాజధాని రాజమహేంద్రవరము త్రొక్కి జూడకుండుటకును మూలకారణమైనది. ఈ వివరణము నకు వేరొక ప్రత్యేక వ్యాసలేఖన మవసరమగుచున్నది. అంతేగాక 'రణస్థిపూన్డి' గ్రామ సరిహద్దుగ్రామముగా నుదాహరింపబడిన 'సిరిపోడిపూన్డి' గ్రామ నిర్ణయము నందుగల దుళ్ల, రణస్థిపూడి, జన్నవాటిక, మడికి, ఏన్దిదియు నుదాహరింపబడి యున్నవి. ఈరెండు శాసనములలోని సరిహద్దు గ్రామములును, అం దుదాహరింపబడిన దిశలకు సరిగా నొప్పియున్నవి. ఈ సిరిపోడిపూన్డి గ్రామమే నేటి "చిలకలపాడు'గా నొప్పి యున్నది. కావున దానికి ఆగ్నేయముగా నున్నది రణస్థిపూన్డియగుటచే నేటి 'నరిసిపూడి— నవాబు పేటల'తో గూడిన పాఱువటము లేక పాలూరుతో గూడిన గ్రామమే సార్థకంబైన 'రణస్థిపూన్డి' యని ధ్రువమగుచున్నది. కావున పరిశోధకులీ విషయమును జాగ్రత్తగా పరిశీలించి నిర్ణయింప గోరెదము.

మఱియొక విషయము:— చరమ కాలమున విమలాదిత్యుడు అంతకుముందులేని తామ్రశాసనములు వెలయించుట, అందును ఆ రెండును అల్పకాలము లోనే వెలయించుట, ఆ రెంటి కాలమునకు మధ్య ఈతని సామంతరాజును శాసనమును వెలయించుటయు, ఈ దానశాసనములన్నియు, దండనాయకుడు, పడవాలు నడుపునాయకుడు, మంత్రివర్యుడు దానప్రతి గ్రహీతులుగా నేర్పరించుట గమనింప, ఆ సమయమున ఆ రాజ్య మందెంత అల్లకల్లోలము, రాజద్రోహములు సంభవించియున్నవో నూహింపశక్యముకాదు.

**ము గిం పు**

ఏది ఎట్లున్నను విమలాదిత్యుడు—బహుస్వల్ప కాలమే రాజ్యమేలినను, అతని శత్రు వర్గము, అంత్యమున దారాపుత్రుల పోరుగలిగియున్నను, గృహ చ్ఛిద్రములకు తాళజాలక అన్యమతోద్దిష్టమైన జైనసన్యాసియై ఆరోగ్యముచెడి మరణమందినను, దేశమునుమాత్రము సర్వసమర్థతతో ఆర్థిక, వాణిజ్య, నాగరికతా సంస్కృతులలో దీర్చిదిద్దిన కార్యధురంధరు డని చెప్పక చెప్పుచున్నది.

నేర్చియు నేఱక నొనరించిన దోసము లేవేని గమనించిన పాఠకులు, పండితులు, విమర్శకులు, అభి మానులు తెలిపిన విషయబోధ గావించుకొని కృత మస్తకాంజలినొదునని విన్నవించు కొనుచున్నాను.



మొ ద టి తే కు — రెం డ వ పు ట

1. శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణ
ప్రభో ర్నాభీ పంకరుహా ద్బభూవ జగ

2. త ్రసష్టా స్వయంభూ స్తతః జజ్ఞే మానససూను రత్రి
రితి యస్తస్మాన్మునే రత్రి తస్సోమో వంశకరస్సుధాంశు రు

3. దిత శ్రీకణ్ఠ చూడామణిః॥1 తస్మాదాసీత్సు (1) సూతేర్బుధో
బుధసుత స్తతః జాతః పురూరవానామ చక్రవర్తి స

4. విక్రమః॥2 గద్య। తస్మాదాయు రాయుషోనహుషః నహుషా
ద్యయాతి శ్చక్రవర్తి వంశకర్తా తతః పురురితి చక్రవర్తి

5. తతో జనమేజయోశ్వమేధత్రితయస్యకర్తా । తతత్ప్రాచిశ
ప్రాచిశాత్సైన్యయాతి స్సైన్యయాతీ హ

6. యపతి హయపతే స్సార్వభౌమ స్సార్వభౌమాజ్జయ
సేనః జయసేనాన్మహాభౌమః మహాభౌమా

7. ద్దేశానకః దే(2)శానకో త్క్రోధానః క్రోధానాద్దేవకిః
దేవకేరిచుకః రిచుకాదృకుకః భు(3)కుకా న్మతి

8. సరస్సత్రయాగయాజీ సరస్వతీనాథః తతః కాత్యాయనః
కాత్యాయనాన్నీలః నీలాద్దుష

9. న్తః స్త(4)త్సుతః॥3 అయ్యా । గంగాయమునాతీరే యదవిచ్ఛిన్న
న్నిఖామయయూపాక్రమశః క్రి(5)త్వాతథాశ్వమేధాన్నామ మ

10. మహాకర్మా భరతయితియోలభత॥4 తతోభరతాద్భూమన్యు భూ
మన్యో స్సుహోత్ర స్సుహోత్రా ద్ధస్తి హస్తీహస్తినః విరోచ

11. నః విరోచనాదజామిల (6) అజమిళాత్సంవరణః సంవరణాన్య (7)
తపనస్సుతా యాస్తపత్యాశ్చ సుధన్వా

12. సుధన్వన (8) పరీక్షి త్పరీక్షితో భీమసేనః భీమసేనాత్ప్రదీపన ప్ర
దీపనాచ్ఛన్తనుః శ్య(9)న్తనోర్వి (10) చిత్రవీర్య్యః విత్ర (11)

---

ఛ॥ 1. శా. వి. 2. అనుష్టుప్పు 3. గద్య 4. ఆర్యా.

---

సవరణలు:—(1) దాసీత్సుసూతే=దాసీత్సుధాసూతే (2) దోశానకో=ఐశానకో, (3) భుకుకా=బుకుకా, (4) న్తత్సుతః=తత్సుతః, (5) క్రిత్వా=కృత్వా (6) దజమిల=దజామీలః (7) వరణాన్య=వరణస్యా (8) సుధన్వనపరీక్షి=సుధన్వనాత్పరీక్షి (9) శ్యన్తనో=శన్తనో, (10) వ్విచిత్ర=వ్విచిత్ర, విత్ర=విచి.



రెండవ రేకు — మొదటి పుట

13. త్రవీర్య్యా త్పాన్డురాజః॥5 ఆర్య్యా। పుత్రాస్తస్యచధర్మ్మజ భీమా
ర్జున నకుల సహదేవాః పంచేన్ద్రియవత్పంచ స్యా ద్వి

14. షయాగ్రాహిణాస్తత్రః॥6 వృత్తం। యేనాదాహి విజిత్య కాన్డవ
మధోగాన్డివినా వజ్రిణాం యుద్ధే పాశుపతాస్త్రవస్న(1)కరి

15. పోశ్చాలేభిద్దైత్యాన్బహూ న్నివాద్ద్వాసనమధ్యరోహి జయినా
యత్కాలి (2) కేయాదికాన్హత్వా న్పైర మకారి వంశ విధి

16: విచ్ఛేదః కురూణాం విభోః॥7 తతోర్జునా దభిమన్యు రభి
మన్యో పర(3)క్షిత్పరీక్షితో జనమేజయః జనమేజయా క్షే

17. ముకః క్షేముకాన్నరవాహనః నరవాహనాచ్ఛతానీకః శతానీకా
దుదయనః తతత్పరం తత్ప్రభృతి ష్వచ్ఛిన్న సన్తానే ష్వ

18. యోధ్యా సింహసనేకాన్నషష్టి చక్రవత్తి (4) షు గతేషు తద్వంశ్యే
విజయాదిత్యో నామ రాజా వి

19. జగీషయా దక్షిణాపథం గత్యా త్రిలోచన పల్లవ మధి
క్షిప్య దైవదురీహయా లోకాన్తర మగ

20. మత్ తస్మిన్సంకులే పురోహితేన సార్ధ్వం మన్త్ర్వర్తీన్నీ తస్య
మహాదేవీ ముదివేము నామాగ్రహార ము

21. పగమ్య తద్వాస్తవ్యేన విష్ణుభట్ట సోమయాజినా దుహితృ
నివ్వి (5) శేష మభిరక్షతాసతి నన్దనం విష్ణువర్ధన మనూత

22. జాతస్యచకుమారకస్య మానవ్యసగోత్ర హారితి పుత్రాది స్వక్షేత్ర
గోత్ర క్రమోచితాని కర్మ్మాణి కారయిత్వా త మవ

23. ర్ద్ధయత! సచ మాత్రా విదిత వ్రి (6) తాంత సన్నిగ్గర్త్య చలుక్య గిరౌ
నన్దా భగవతీ గౌరీ మారాధ్య కుమార నారాయ

24. ణ మాతృగణాశ్చ (7) సంతర్ప్య శ్వేతాతపత్రైక శంఖ పంచ
మహాశబ్ద పాలికేతన ప్రతిఢక్కా వరాహలా (8) చ్ఛనపెంచ్ఛ

25. కుంత సింహాసన మకరతోరణ కనకదన్డ గంగా యమునాదీని స్వ
కులాక్రమాగతాని నిక్షిప్త నివ సాంబ్రా (9) జ్య చి

---

5. గద్య; 6. ఆర్యా. 7. శా. వి.

---

(1) వన్కక=మన్ధక; (2) త్కాలి=త్కాల; ( ) పరక్షిత-పరీక్షిత; (4) వత్తి=వర్తి (5) నివ్వి శేష-నిర్విశేష, (6) వ్రిత ంత=వృత్తాన్త, (7) గణాశ్చ=గణాంచ (8) లాచ్ఛన=లాంఛన, (9) సాంబ్రాజ్య=సామ్రాజ్య



రెండవ రేకు — రెండవ పుట

26. హ్సాని సమాదాయ కదంబ గంగ్గాది భూమిపా న్విజిత్య సేతు
సేతు నర్మ్మదామధ్యం సార్ధ్వ సప్తలక్షం దక్షిణాపథం పా

27: లయామాస॥8 శ్లోకం॥ తస్యాపి ద్విజయాదిత్యో విష్ణువర్ద్ధ
న భూపతః పల్లవాన్వయా జాతాయా మహాదేవ్యా
28. శ్చ నన్దనః॥9 తత్సుతః పొ(1)లకేశివల్లభః తత్పుత్రః
కీత్తి(2)వర్మ్మా తస్యతనయః స్వస్తిశ్రీమతాం సకలభువన సంస్తూ
29. యమాన మానవ్యసగోత్రాణాం హారితిపుత్రాణాం కౌశికీ వర
ప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరిపాలితానాం
30. స్వామి మహాసేన పాదాన (3) నుధ్యాతానాం భగవన్నారాయణ
ప్రసాద సమాసాదిత వరవరాహలాంఛనే క్షణ
31. క్షణ వశీకృతారాతిమణ్డలానా మశ్వమేధావభృథస్నాన
పవిత్రీకృతవపుషాం చాలుక్యానాం
32. కుల మలంకరిష్ణో స్సత్యాశ్రయవల్లభేన్ద్రస్య భ్రాతా
కుబ్జవిష్ణువర్ద్ధనోష్టాదశ వర్షాణి వేంగీ
33. దేశ మపాలయత్. తదాత్మజో జయసింహవల్లభ
స్త్రయస్త్రింశతం। తదనుజేన్ద్రరాజ సప్త
34. దినాని తత్సుతో విష్ణువర్ద్ధనోనవ। తత్సూనుమ్మంగి
యువరాజః పంచవింశతిం తత్పుత్రో జయసింహస్త్రయో
35. దశ। తదవరజః కోకిలిష్షణ్మాసాన్ తస్య జ్యేష్ఠభ్రాతా
విష్ణువర్ద్ధనస్తముచ్చాట్య సప్తత్రింశతం తత్పుత్రో వి
36. జయాదిత్య భట్టారకోష్టాదశ। తత్సూనుర్విష్ణువర్ద్ధన
ష్షట్త్రింశతం। తత్సూనుర్విజయాదిత్య నరేన్ద్ర మృగరా
37. జ శ్చాష్టచత్వారింశతం। తత్సుతః కలివిష్ణువర్ద్ధనోద్యర్ద్ధ
వర్షం। తత్సుతో గుణగవిజయాదిత్య శ్చతుశ్చత్వా
38. రింశతం। తద్భ్రాతుర్విక్రమా(4)త్య భూపతే స్తనయ శ్చాలుక్య
భీమ స్త్రింశతం తత్సుతః కొల్లభి గణ్డ విజ

8. గద్య. 9. అనుష్టుప్.

(1) పొలకేశి=పులకేశి, (2) కీతి=కీర్తి, (3) పాదానను=పాదాను, (4) విక్రమాత్య=విక్రమాదిత్య.



మూ డ వ రే కు — మొ ద టి పు ట

39. యాదిత్య ష్షణ్మాసాన్। తత్సూను రమ్మరాజ స్సప్తవర్షాణి। త
త్సుతం విజయాదిత్యం బాలముచ్చాట్య తాడపో
40. మాసమేకం। తంజిత్వా చాలుక్య భీమ తనయో విక్రమాదిత్య
ఏకాదశ మాసాన్। తత్తాడపరాజసుతో యుద్ధ
41. మల్ల స్సప్త వర్షాణి॥10॥ తం యుద్ధమల్లం పరిహృత్య దేశా
త్విష్టేతరేషామపి శాత్రవానాం క్ష్మా మమ్మరాజాను
42. జ రాజ భీమో భీమ స్సమా ద్వాదశ రక్షతిస్మ ॥11॥ తత్సూను
రనతారాతి రమ్మరాజో నృపాగ్రణీః పంచవింశతి
43. వర్షాణి వేంగీ భువ మపాలయత్। 12॥ ద్వైమాతురోమ్మ నృపతే
ర్ద్వార్నం (1) నృపోరాజ భీమనృపతనయః విద్యాకలా
44. ప చర చతురంతధరా మపా త్సమాస్త్రిసః। ॥13॥ అను। దానార్ణ
వా సీద్దైవ దుశ్చేష్టయా తత
45. స్సప్త వింశతి వే(2) ర్షాణి వేంగి మహీ రనాయికా। 14॥ అత్రా
న్తరే దానసరేంద్ర సూను శ్రీ (3) శక్తి వర్మా
46. సురరాట్స (4) ధర్మార్థ యశ్శౌర్య శక్త్య వినిహత్య శత్రూన్
స్స (5) ద్వాదశాబ్దాన్ స్స (6) మరక్షదుర్వీన్। 15॥ స్యై (7)
47. వ దాననృపతే స్సాధ్వ్యా (8) ర్యా మహాదేవ్యాః సూను ర్విమలా
దిత్య స్సత్యాశ్రయ వంశవర్ధనో దేవః॥16॥ అనలా
48. నలరంధ్రగతే శకవర్షే వృషభమాసి సితపక్షే యష్టమ్యాం
గురుపుష్యే సింహలగ్నే ప్రసిద్ధ మభిషిక్తః।17॥ శ
49. శి విశదయశో వాప్త్య స్వశరీర విబోధనార్థ మహహత్క
ణ్ఠో। శశలక్ష్మ లక్ష్మ లక్ష్మీం (9) శంభు ర్బిరుదాంకభీమ

50. నృపతేర్య్యస్య|[18]|| అరి కరటి కుంభ విదలన ముక్త సమాయుక్త
రుచిరముక్తానికరః హారయివ యస్య ఔర
51. సిథారాధ్యాసిత జయశ్రీ యో భాతి చిరం| యత్తేజత్ర్ప
పలాయితరిపుగృహ శాల (10) భంజికా.

---

10. గద్య. 11. ఇంద్రవజ్ర 12 అనుష్టుపు. 13. ఆర్యా. 14. అనుష్టుపు. 15. ఇంద్రవజ్ర. 16. అనుష్టుపు 17. ఆర్యా. 18 ఆర్యా.

---

(1) దానం=దాన (2) వేషాణి=వషాణి (3) శ్రీశక్తి=శ్రీశక్తి (4) రాట్సధర్మ్మా=రాట్సుధర్మ్మా, (5) స్సద్వాదశ=సద్వాదశ (6) స్సనురక్ష=సమరక్ష (7) స్త్యైవ=తస్యైవ, (8) శ్చాయార్=చార్య్, (9) లక్ష్మిం=లక్ష్మిం, (10) శాల=సాల.



మూడవ రేకు — రెండవ పుట

52. ఖరోధీలు(1)తా పటస్తు పరజనవిలోకనాసహనబద్ద పటయివ
భాతి||[19] దుస్సాధనాధిక విరోధి గజే
53. న్ద్ర సంఘట నిర్భేదత్రిభువనాంకుశ నామయుద్వే అన్ధ
త్వాన్నిజమజీగిమ దుద్భృతం యో బహిష్వ సిం
54. హ పరిహాసి పరాక్రమ శ్రీః | య స్సార్వ్వభౌమ ధరణీశ్వర
నీతకల్ప ప్రాఘూర్ణ్ణకేభ మదసిక్త మహీ వి
55. భాగః యస్తజ్జితానిలజవాశ్వ సహస్ర సంపాదాత్యాహృతా
హిత శిరో(2)కిత శూలకోటిః||[20] ఆదౌ శంభు శిరో
56. మణి స్సవ సుధాసూతి స్సుధాంశు స్తత స్తద్వంశ్యైభరతస్త
తశ్చ విజయాదిత్య శ్చలుక్యాంకితః శ్రీ సత్యాశ్ర
57. య వల్లభ స్తదపిచ శ్రీ సర్వ్వలోకాశ్రయో దేవో
ముమ్మడి భీమనామ నృపతి ర్య్యార్వం

58. శకత్తాఙ్గభవత్ ॥21 సౌరాష్ట్రాన్ద్రయన్తి నిశిత పరశు
ధారాయ(3)మానా శకానాం లాటానాం గూర్జ్జర

59. రాణా మధ భవతి మనోహారిణీ వల్లభావా (4) శూరాన్వస్తాన్ (5)
విధత్తే సుకృతివఖిలాన్వైరమన్యాన్

60. విభీతాన్ కాష్ఠాన్తన్తత్తప్రశ్రీ రివ నయతి రణే శౌర్యాఙ్గ సమ్ప
ద్వదీయా ॥22 సవీర మకరధ్వజః మకరధ్వజయివ ధ్వస్త విగ్ర

61. హః గ్రహపతిరివాహితాన్ధతమసాపహార్యః హరేవ రాజకలా
ధరః ధరణీధరయివ రమారామాభిరామః రామ

62. యివ పరశుక్రియాసహః సహదేవయివ దేవాద్వయ్యఙ్గ నన్దనః
నన్దనవిశేషయివాభిలషితఫలసముత్పవిసహ

63. స్రః సహస్రాక్షోపమానః మానవ్యసగోత్రః గోత్రని(6)స్తారకః
తారకాధిపాన్వయవాద్ధి(7)వృద్ధి నిశాకరః కరదీకృతారాతి

64. పరంపరః పరనరపతి నికర ము(8)కుట తట ఘటిత మణిగణ కిరణ
పరికరిత సమర(9)ణిత చరణోస్దీవరః వర

---

19. గద్య, 20. వసంతతిలకం, 21. శా. వి 22. స్రగ్ధర.

---

(1) లుతా=లూతా, (2) శిరోకిత= శిరోంకిత (3) యమానా=యవానాం, (4) వల్లభావా= వల్లభానాం, (5) శూరాన్వస్తాన్=శూరాన్వస్తాన్వఙ్గ. (6) గోత్రనిస్తారకః=గోత్రవిస్తారకః (7) వాద్ధి= వార్ద్ధిఙ్గ, (8) ముకుట=మకుట, (9) సమరణిత=సమరారుణిత.



నా లు గ వ రే కు — మొ ద టి పు ట

65. వరాహ లాంచ్ఛనాలోకనమాత్రావిత్రాసితాఖిల ధరాధీశ
వక్రః చక్రవర్తి (1) పదవీ సముచితానేక ధవలచ్ఛ

66. త్ర చ్ఛాయాచ్ఛాదిత సర్వ్వలోకః స్స(2)ర్వ్వలోకాశ్రయ శ్రీ విష్ణు
వర్ద్ధన మహారాజాధిరాజ (3) పరమేశ్వర పరమభట్టారక
67. పరబ్రహ్మణ్యో పరమమాహేశ్వరః॥ గుద్దవాడి విషయనివాసినో
రాష్ట్రకూట ప్రముఖాన్ కుటింబిన స్సర్వ్వా స్సమా
68. హూయ మన్త్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారికాధ్యక్ష
మిత్థమాజ్ఞాపయతి యథా॥[23] ఆద్యో య
69. స్స్వయమద్బభూవ పత(4)మబ్రహ్మణి పృజ్యాన్దపో వీర్య్యా
న్తా స్వయస్సృష్టమన్దమభవ ద్వైస్యమమ్మహత్త్తేనయత్
70. తస్మాల్లోక పితామహో విధిరభూ త్తస్మా న్మరీచ్యాదయః
పుత్రా యే దశ జజ్ఞిరే శ్రుతిమ
71. యా వర్చ్చస్వినో మానసాః॥[24]॥ తేషాంశ్రేష్ఠతమో వశిష్ఠ
ఇతి యస్సారున్ధతికోముని స్తస్మా
72. త్కున్డిన ఇత్యభూదథచ తత్కౌన్డిన్యగోత్రే క్రమాత్।
సుద్ధాత్మా జని మల్లపయ్య్యర్ ఇతి
73. యః పౌత్రి(5)కృతోఘస్సుధీ శ్రౌతాచార విచారచారుహృద
య స్సౌజన్య జన్మాలయః॥[25]॥ బాదపయ్య ఇతి త
74. స్య నన్దనో నన్దనోపగత సూరిసున్దరః సున్దరత్వ సమతః
కృతాంగ భూరంగభు(6)మిప వదాన్యతాధికః॥[26]॥ యో
75. వాక్ శ్రీముఖచారురత్నముకుర శ్రీ రేవకాంబేతి యో
సాధ్వీ సాద్ధ్వజనీన కర్మ్మరతయోః పుత్రస్సమాసీధు
76. యో। ర్మ్మల్ల స్సల్లలితాకృతిః కృతమతిః శ్రీభామినీ వల్లభ
శ్శౌర్యౌదార్య్య విచార్య్యకార్య్యనిరత శ్రీ దీన
77. చిన్తామణిః॥[27] యోవక్త్రి(7)యమన్య నాగవిషయే త్యాగా
శ్రితో యాః సతాం యేనాకారిశమాశిషా సముద

23. గద్య, 24 శా. వి. 25. శా. వి. 26. రథోద్ధతం, 27. శా. వి.

(1) వత్తి=వర్త్తి, (2) స్సర్వ్వ=సర్వ్వ, (3) రాజాధిరాజపరమశ్వర=రాజాధిరాజరాజ పరమేశ్వర, (4) పతమ=పరమ, (5) పౌత్రికృతోఘస్సుధీ=పుత్రకృతోఘస్సుధీ (పుత్రి—ఇకారము కొట్టివేసెను.) (6) భుమిప=భూమిప, (7) యోవత్త్రిజయ=యోవక్త్రిర్జయ.



నా లు గ వ ఱే కు — రెం డ వ పు ట

78. యా యస్మజన్మై ద్దీ౯యతే। యస్మాద్విభాతి పాపదోష నికరా
యస్యాత్కవతిం (1) రమా యస్మిస్తిష్యతి సత్యమ
79. త్యనుపమం శుంభద్యణాం (2) బుధోనిధౌ ||28|| లోకే సంప్రతి
దన్డనాయక ఇతిఖ్యాత స్సతాన్నాయకోప్యాధారోపి జగ
80. జ్జనస్య విదిత శ్రీ సజ్జనాధార ఇత్యోజో మల్ల ఇతి ద్విషాం
ప్రకటితః పాపాతి భీతోపి యశ్చత్రక్షా
81. త్రకలత్రచిత్రతిలకగ్రైవేయక చ్ఛేదకః ||29|| సత్యాశ్రయ
ప్రహిత దారుణ దన్డ ముఖ్యా నీలోరితాః కృత త
82. యామధిపే నయనా నిష్కన్ధకీక్రితి (3) రవద్వ్యత రాజ్యలక్ష్మీ
సస్వామిన స్వభుజ దన్డబలే నయేనా। ||30|| చ త న్ప
83. భిరుపధాభిశ్శు ద్ధ్యతయస్య బుద్ధిః పరిషదినయతే
సాప్యేవ శాస్త్రాను శాస్త్రీ జగ దపార .
84. విబోధంతి ష్యతే యస్యనీతే వధి రణ మవభేత్తా విద్ధి
ష చ్ఛ (4) క కూటం ||31|| గుణక బలిత కాన్డా
85. శ్చన్డ రోచిత్ర్పచన్డః ప్రబల రణమురాయా మగ్రణీ
ర్యా౯ భటానాం సురపిత్పనకు
86. రుంబ న్తప్ప౯య న్త్వవ్య కవ్యే రతివిచరణ పద్మాక్షాలనా
క్షీణపూణ౯ః ||32|| లబ్ధ్వా స్వణ౯ కరంక పింఛ్ఛ కర (ం)
87. కం విస్తారికో వ్వా౯ంబరం శ్రీద్వార ప్రతిహార దన్డ నికరాం
(5) న్ని ష్వివనీ చామరం స్తంభావేష్టన తూయ్య౯
88. హేమకశచ్ఛత్రాణి యస్సజనాధారో ముమ్మడి భీమతో
భృతవహాసామన్తచిహ్నానిమత్ ||33|| తస్మైమ

89. ధృక్త్రాయ కృతక్లేశాయ కౌణ్డిన్య గోత్రాయ బాదపీయ
మల్లఇతి ప్రసిద్ధాభిధానాయ కమ్మద్వి
జేన్ద్రాయ సజ్జనాధారాయ ప్రచణ్డదణ్డనాయకాయ
కవికల్పకాయ శ్రీదీనచిన్తామణయే

---

(1) కపత్ది=కపర్దినే, (2) ఉంభద్యణాం=ఉంభద్యణాం, (3) క్రితి=కృతి, (4) షట్ప్ర షట్ప్రక, (5) న్నిష్ఠీవ=నిష్ఠీవ.

---

28. శా. వి 29. శా. వి. 30. వసంత తిలకం 31. మాలిని 32. మాలిని, 33. శా. వి.



**అయిదవ రేకు — మొదటి పుట**

91. భవద్విషయే సిరిపోడిపూన్డి నామగ్రామో గ్రహారీకృత్య మత్సంవద్ధిన్తత
కృతకైశికత్వ నిమిత్తం (1) మయాదత్తమి

92. తి విదిత వస్తువః। అస్యావధయః పూర్వతః దుల్లపొలగరు సునగుమి
యగరుసు। ఆగ్నేయతః దుల్లయి (2) నా

93. గలేడియు రణస్థిపూన్డి తాకడపాల ముయ్యాలికుట యాడిగ
స్త్రతము పొగున వెలగగుట్టయిం బిప్పని గున్ట

94. యిం జినయు సీమముగా మారట్లదాంక ద్దాకడ పాలమున
పాలగరుసగరుసు। దక్షిణతః జన్నవాటియు

95. సిరిపోడిపూన్డియు గొటికెడియు ముయ్యాలికుట్టున మారట్టం।
నైరిత్యతః ఇమ్మారట నున్డి సిదరావియసీమ

96. ము। పశ్చిమతః సిదరావినయున్డి మడికి పొలగరుసు। వాయు
వ్యతః అమడతేవుల

97. సీమము సీమము గాంగుత్తి పూన్కిగోడె పాలమున తూర్పున
సీమము సీమము। ఉత్తరత (ః)

98. సిరిపోడిపూన్డి పొలమున నుడిగాడియ యను చేని
ఉత్తరము గరునసీమముగా వచ్చి రే
99. న్డి పరియల నడిమి పెన్రోద్దవనున్డి మరడి తిప్పయ్య నారామాను
మ రేను రావియు బుట్టతోడి యున్నవు
100. పొదలును డొన్తి రావములు సీమము। ఈశాన్యతః కొల్మికుడి
చిన్తనుండి ఉత్తరమిచ్చి గొంగ్గన ప్రోలిం క్రొత్త త్రోలిన్డి దాంక బా
101. తిన త్రోవయు న్యావృ్ణ వాతిన పెద్దత్రోవ తల చిన్త మన్డి
మేడి తావయిగాంగలి వంకయు సీమము। ఇన్నుల యేడిలోని కు
102. ఱ్డలు దుల్లవారును సిరిపోడిపూన్డివారును గాంగ్గప్రోలివారును
నెన్దేన్దిను పాంబాలుసేసి కాంబంచి కొనిమన్నుడ। అ
103. స్యోపరి నకేనచిద్బాధా కర్త్తవ్యా యఃకరోతి సపంచ మహా
పాతకో భవతి తథా చోక్తం వ్యాస భట్టారకేనాపి [34]। బహు
104 భిర్వ్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా యస్య యస్య యదా
భూమి స్త్స్య...ఫలం। [35] స్వదత్తాం పరదత్తాం వా యో హరేతు వ
105. సున్దరాం।...ష్టిం వర్షసహస్రాణి విష్ఠాయాంజాయతే క్రిమిః [36]॥ అన్యే
షాం యశసో లోభాత్ స్వయశో మలినీభవత్ తదా త్రి

34. గద్య. 35. అనుష్టుపు. 36. అనుష్టుపు.

(1) నిమిత్త-నిమిత్తే, (2) దుల్లయి=దుల్లయు.



అ యి ద వ ఱే కు — రెం డ వ పు ట

106. యాన్య ధర్మాన్తు పాలయేనదపాలయేత్ [37]॥ పప్తమవర్ష వర్ద్ధనే
మీనమాసే దత్తస్యాస్య శాసన్యం శ్రీ దన్డనాయుకరితి
107. శ్రీ జోగినాయకః [38]॥ ఆజ్ఞప్తి నృపకామో రాచియ పెద్దేరి తనయ
భీమనభట్టః కర్తై [39] ష కావ్యానామగ। శాసనలేఖకః జొన్నా
108. చార్య్యః [40].

37. అనుష్టుపు. 38. దానకాలము. 39. శాసనకర్త. 40. లేఖకః.

షరా:—ఈ ముమ్మడి భీమ విమలాదిత్యునిచే అష్టమ వర్ష సింహ మాసమునందు (క్రీ. శ. 1018 సెప్టెంబరు) వజ్జియ ప్రెగ్గడకు దానమిచ్చిన 'రణస్థిపూన్డి'—ఈ సిరిపోడిపూన్డికి సరిహద్దు గ్రామమని బుజువైనది.

ఇవి రెండును తూర్పు గోదావరి జిల్లాలో ఆలమూరు తాలూకాలోనివే.

1. సిరిపోడిపూన్డి=చిలకలపూడి. 2. రణస్థిపూన్డి=నవాబుపేట.

# మృత్యోర్మా

శ్రీ నూతలపాటి గంగాధరం

సరే,
నీ మాటకే వస్తాను !
ఈ పాత్రను పగలేసి
ఈ యాత్రను తగలేసి
దీపాన్ని మలిపేసి
దేశాన్ని వదిలేసి
ఎక్కడికి వెడతావు?

ఎక్కడికి వెళ్లినా
ఈ అప్పులు నిన్ను వదలవు
ఈ దెప్పులు మానవు
ఈ కలత మారిపోదు
కన్నీళ్లు ఆరిపోవు
నీ నీడ నిన్ను వదలిపెట్టదు.

గుండెలో చెమ్మ ఉన్నంతకాలం
చుట్టూ అప్పులు ఉండకపోవు
కండలో బలం ఉన్నంతకాలం
దెప్పులు రేగక మానవు
బ్రతుక్కి ఒక ఆశయం ఉన్నంతకాలం
వెనక కలత మెదలక పోదు
కంటి చివర కరుణ ఉన్నంతకాలం
కన్నీళ్లు తిరుగక పోవు
నీలో దీపం వెలుగుతున్నంతకాలం
నీ వెంట నీడ ఉండక పోదు.

మట్టినుండే పుట్టింది మాణిక్యం
బురదనుండే విరిసింది పంకజం
మట్టినుంచి పుట్టిన మనం
మణిదీపాల్లా ప్రకాశించాలి.
పంకంనుంచి పుట్టిన మన బ్రతుకులు
పద్మాల్లా విరిసి పరిమళం వెదజల్లాలి.

నిరాశతో ఉసూరుమని కూలబడితే
మళ్లీ నరకంలోకే నీ పయనం.
ఈ దారి వద్దనుకుంటే
గోదారే శరణ్యం.
నీ కంటె తక్కువ వాళ్లున్నారు
వాళ్లూ బ్రతుకు తున్నారు
వాళ్లంతా నీతో నడవాలి.
నీకంటె అధికులున్నారు
నువ్వూ వాళ్లతో పోటీపడాలి.

కంటిలో నలుసు పడిందని
కంటినే పొడుచుకుంటామా ?
పంటికి రాయి తగిలిందని
పరమాన్నం పారేస్తామా?
పురుగు అడ్డు వచ్చిందని
పువ్వును వాసన చూడ్డం మానేస్తామా?
చెయ్యి కాలిందని
పొయ్యిని ఆర్పేస్తామా?
నుయ్యి దూర మని
నీళ్లు త్రాగడం మానేస్తామా?

మంచి ఉన్నచోటే చెడ్డ ఉంది
పంట ఉన్న చోటే కల్లు ఉంది
కష్టం వెనకే సౌఖ్యం ఉంది
ఈ అమావాస్యే నిజంకాదు
పున్నమి వచ్చి పువ్వులు పూయకపోదు.

## మృ త్యో ర్మా

శిలను ఉలితో మలిస్తేనే
శిల్ప మవుతుంది.
నేలను పదునుచూచి దున్నితేనే
నిండుగా పండుతుంది.
పూలను నూలుతో గుచ్చి కూరిస్తేనే
మాల అవుతుంది.
అగ్నిలో కాల్చి కొట్టితేనే అపరంజి
ఆభరణ మవుతుంది.

బాధల పొదుల్లోంచే
సౌఖ్యం విత్తులు అంకురిస్తాయి.
రేపు సుఖించడానికి
ఇవాళ కష్టపడాలి.
రేపు జీవించడానికి
ఇవాళ మృత్యువునైనా ఎదుర్కోవాలి.

---



# ఆధునిక నవల: అధీరనాయకుడు

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

కథకూ కావ్యానికీ నాయకుడు ఉంటాడు. కావ్య భేదమైన నవలలోనూ నాయకుడు ఉంటాడు. సాంప్రదాయికంగా నాయకుణ్ణి ధీరోదాత్తుడు, ధీరలలితుడు, ధీరశాంతుడు, ధీరోద్ధతుడు అంటూ కావ్యంలోని రసాన్నిబట్టి, పాత్రగుణగణాల్నిబట్టి విభజించారు. ఇందులో నాయకుడికి 'ధీర' లక్షణం సామాన్యమైనదిగా గ్రాహ్యం. ఇంగ్లీషులో నాయకుడు,' 'ధీరుడు' అన్నరెండు పదాలకూ అభేదాన్నే పాటిస్తూ, 'హీరో' అన్నారు. నాటకేతిహాసముల తర్వాత పుట్టిన ప్రక్రియ అయిన నవల. జీవితాన్ని విస్తృతంగా, విపులంగా ప్రతిబింబిస్తూ వచ్చింది. నాటకేతిహాసాల్లో కేవలం రాజూ, తత్తుల్యుడూ మాత్రమే నాయకుడుగాఉంటే నవలలో సామాన్యుడు నాయకుడయ్యాడు. సామాన్యుని సాంఘిక జీవనం, సాంసారిక జీవనం, ఆతని కష్టసుఖాలూ ఇతివృత్తం అవుతూ వచ్చాయి. కాని ఈ సామాన్యునిలోనూ 'ధీర' గుణం ప్రధానంగా కనిపిస్తూనే ఉంటుంది. వీరేశలింగంగారి 'రాజశేఖరుడు' మొదలుకొని ఉన్నవవారి 'రామదాసు'గాని, విశ్వనాథవారి 'ధర్మారావు'గాని ధీరగుణం కల్గిఉన్న నాయకులే. ఆంగ్ల సాహిత్యంలో డికెన్స్, హార్డీల నవలల్లో పేదవారి జీవితం, కడగండ్లు, సాంఘిక దురన్యాయం విస్తృతంగా చిత్రింపబడినా, ఆ నవలల్లో నాయకులు కూడా 'ధీర'గుణం కలిగి ఉన్నవారే. ఎదురైన విషమపరిస్థితుల్లో నిలిచి, సాధించి, జయించి బయటపడినవారే. అలా బయటపడక ఒకవేళ మరణించినా 'ధీర'గుణాన్ని నిలుపుకున్నవారే, షేక్స్పియర్ విషాదాంతనాటకాల్లోలాగా. లేకపోతే దృఢమైన వ్యక్తిత్వాన్ని నిరూపించుకున్నవారే. ఇలా ధీరనాయక లక్షణం నవలల్లో సాధారణంగా కనిపిస్తూనే ఉంటుంది. అందుకు విరుద్ధంగా 'అధీరు'డైన నాయకుణ్ణి చిత్రించిన ఆధునిక నవలల్ని గురించే యీ ప్రస్తావన. ఇంగ్లీషులో అధీరుడైన నాయకుణ్ణి 'ఆంటి—హీరో' (anti-hero) అని వ్యవహరిస్తున్నారు.

తెలుగు నవలల్లో అధీర నాయకుణ్ణి చిత్రించిన మొదటినవల విశ్వనాథవారి 'చెలియలికట్ట'. ఇందులో రంగారావు నాయకుడు. వదినెగారైన రత్నావళిని లేవదీసుకొనివెళ్ళిపోతాడు. అతనిలో మొదట్లో కనిపించే సాహసం, క్రొత్తభావాల తాలూకు చైతన్యం తర్వాత కన్పించదు. అది కేవలం యౌవనోద్వేగం తాలూకు ఆభాసమే తప్ప వ్యక్తిత్వ లక్షణం కాదని తర్వాత రుజు వవుతుంది. ప్రేమనుగూర్చి, వ్యక్తిస్వేచ్ఛనుగూర్చి అతడు అరువు తెచ్చుకున్న క్రొత్త ఊహలకు అతని వ్యక్తిత్వంలోగాని, బుద్ధినైశిత్యంలోగాని ఆధారమూ, ఆలంబనమూ లేవు. అందుకే సాహసం చేసిన తరువాత కర్తవ్యం తెలీని మూఢునిలా ప్రవర్తిస్తాడు. ఈ నాయకుని అధీరతకు ప్రతిగా నాయిక రత్నావళిలోని ధీరత్వము, బుద్ధినైశిత్యమూ వికాసంచెంది ప్రకాశిస్తాయి. రత్నావళి వ్యక్తిగా స్వధర్మాన్ని త్వరలో నిర్ణయించు కొంటుంది. ఆమెలో స్వధర్మపరిణామం వైరాగ్యంగా, నిస్సంగత్వంగా పర్యవసిస్తుంది. రంగారావుకి ఈ ఆధ్యాత్మిక యాత్రతో సంబంధం లేదు. యాంత్రికంగా నైమిత్తిక జీవితం గడుపుతూ ఉంటాడు. కాని ఈ అధీర నాయకునిలో మనం ఏవగించుకోవలసిన గుణాలేమీ కనిపించవు. రంగారావు దుష్టుడు కాడు. సోమరికాడు. కఠినమనస్కుడుకాడు. వ్యసనలోలుడు కాడు. సగటు 'మనిషి.' క్రొత్త ఆలోచనలు చేసి, క్రొత్తపుంతలుత్రొక్కి కర్తృత్వం వహించే శక్తి

యుక్తులు అతనిలో మృగ్యం. కాని భీరువుమాత్రం కాదు, మనం జాలిపడవలసిన పాత్ర. మొట్టమొదట అతనుచేసిన సాహసం ఒకతాత్కాలిక ప్రేరణమీద జరిగింది. కొన్ని నూతన సిద్ధాంతాలు, పుస్తకాల్లో చదువుకొన్నవి, ఆ ప్రేరణకు కారణమయ్యాయి. తర్వాత ఆ సిద్ధాంతాల లోటుపాట్లను గూర్చి అతను పట్టించుకోనేలేదు. జీవితానికి తల ఒగ్గాడు. ఇలా బాహ్యప్రేరణకు ఒక్కదెబ్బతో లొంగిపోయి, దాన్ని ఏవిధంగానూ స్వధర్మంతో సమన్వయం చేసుకొనే వెరపులేక, అర్థశూన్యమైన నైమిత్తిక జీవితం వెళ్లబుచ్చడమే రంగారావు అధీర లక్షణం. ఇందుకు భిన్నమైన ధీరత మనకు రత్నావళిలో కనిపిస్తుంది.

కాల్పనికవాదం (Romanticism) మన సాహిత్యాన్నీ, చదువుకున్న యువతీయువకుల జీవితాన్నీ ప్రభావితం చేస్తున్న రోజుల్లో అది సంఘ సంస్కరణోద్యమంతో, స్వాతంత్ర్య స్వదేశీ ఉద్యమాలతో, హైందవ వ్యవస్థా పునరుద్ధరణోద్యమంతో భిన్న రీతుల్లో మేళవింపై సాక్షాత్కరించింది. కాల్పనిక వాదల తాలూకు ప్రేమానుభూతినీ వ్యక్తిస్వేచ్ఛనూ సంఘసంస్కరణతో ముడిపెట్టి తీవ్రమైన కలవరం పుట్టించినవాడు చలం. కాల్పనికవాదాన్ని హైందవ వ్యవస్థా పునరుజ్జీవనోద్యమంతో ముడిపెట్టినవాడు విశ్వనాథ. ఎవరి వెర్రి వారి కానందం. చలం యొక్క స్వచ్ఛంద ప్రేమ సిద్ధాంతాన్ని పరాస్తం చెయ్యడానికిగా విశ్వనాథ వ్రాసిన నవల 'చెలియలికట్ట'. ఈ నవలలో వివాహ వ్యవస్థయొక్క పారమార్థిక ప్రయోజనాన్ని నిరూపించడం కంటె స్వచ్ఛంద ప్రేమసిద్ధాంతం యొక్క వైఫల్యాన్ని చిత్రించడమే ధ్యేయం. సాధారణంగా ఒక దృక్పథాన్ని లేక సిద్ధాంతాన్ని నిరూపించేందుకు ఆలంబనంగా కథగాని కావ్యంగాని వ్రాయబడుతవి. సిద్ధాంత దృష్ట్యా వ్యక్తికి ఏవి ఉత్కృష్ట గుణాలుగా పరిగణింప బడుతున్నాయో ఆ గుణాల్ని ప్రకాశింప జేసేందుకు ప్రధాన పాత్రల్ని తీర్చిదిద్దడం జరుగుతుంది. అందువల్ల సాహిత్యంలో కథానాయకులందరూ ఆయా విధాల్లో రులుగానే రూపొందుతారు. ఇది సాహిత్యంలో పూర్వంనుంచీ జరుగుతున్నదే. కాని దృక్పథాలు, సిద్ధాంతాలు, వాదాలు (isms) అనేవి సమాజంలో ఉద్ధృతప్రచారంలో ఉన్నప్పుడు అవి వ్యక్తికి జీవితాన్ని దిద్దుకోవడానికి సహాయకారులుగాకాక వ్యక్తిని ఆకర్షించే, పట్టిపీడించే మోహినీపిశాచాలుగా తయారైన పరిస్థితి ఏర్పడుతుంది. ఈ సిద్ధాంతాలూ వాదాలూ ఇటు సంప్రదాయంనుంచీ వచ్చినవైనా, అటు సంస్కారంనుంచి వచ్చినవైనా వ్యక్తికీ, వ్యక్తి సుఖానికీ, ధర్మానికీ నీటితో సమన్వయం కుదరక పోవటం జరుగుతున్నది. అలాంటి పరిస్థితిని వ్యక్తం చెయ్యడంలోనే అధీరుడైన నాయకుడు సాహిత్యంలో సాక్షాత్కరిస్తున్నాడు. సంప్రదాయానికీ, సమాజానికీ ఎదురుతిరిగి కాల్పనికవాదసౌందర్యానుభూతిలో, వలపుమత్తులో స్వచ్ఛందంగా జీవితాన్ని తీర్చిదిద్దుకునే నాయికానాయకుల్ని చలం సృష్టించాడు. అలాగే సంప్రదాయాన్ని సమర్థిస్తూ దానికి ప్రాతినిధ్యం వహించే మంచీచెడూ పాత్రల్ని విశ్వనాథ సృష్టించాడు. కాని అటు సంప్రదాయంనుంచీ వెళ్ళె, ఇటు స్వచ్ఛందంగా జీవించలేక, ఎటువంటి వికాసమూ లేకుండా బ్రదుకుని స్తబ్ధంచేసుకున్న అధీరుడు రంగారావు. గంగారావు సిద్ధాంతాలతో పోరాటంనుంచీ విరమించుకున్న వ్యక్తి. అటువంటి పాత్ర విశ్వనాథ నవలల్లో అతనొక్కడే! మారుతున్న సమాజంలో అధీరత అతని విశిష్టత.

బెంగాలీ రచయిత శరచ్చంద్రుని నవలల్లో సంప్రదాయంనుంచీ బయటపడనూలేక, అందులో యిముడనూలేక సుఖానికీ మనశ్శాంతికీ దూరమై బాధపడి కృశించే అధీరపాత్రలు ఎన్నో కనిపిస్తాయి. కాని వాళ్లలోని అధీరతనూ, స్తబ్ధతనూ, ఆత్మవినాశాన్నీ అమాయకత్వంగానో, మంచితనంగానో, లేక భావనాత్మకప్రేమకోసం త్యాగంగానో తోపింపజేస్తూ, దాన్నీ ఒకరకం ధీరత్వంగా నిరూపించే ప్రయత్నం చేస్తాడు రచయిత. అందుకే ఆ నవలల్లో స్పష్టత లోపించి, పాత్రల్లో మూగబాధ కనిపిస్తుంది. నిజానికి అది వాళ్లలోని అధీరత.

గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర'లో సీతారామయ్య మరొక అధీరనాయకుడు. తండ్రినుంచీ సంక్రమించిన వారసత్వం బరువుతో జీవితపరిస్థితుల్ని ఎదుర్కొనే నేరవులేక, తనకు కావలసిందేమిటో తనకే తెలీక మనోవైకల్యానికి లోనై అధీరుడుగా అస్తమించిన విషాదచరిత్ర సీతారామయ్యది. హేతువాద సిద్ధాంతాలకూ స్వోత్కర్షతోనిండిన ఊహలకూ అనుగుణంగా జీవితం ఉండాలనే తాపత్రయం అలా లేదనే నిస్పృహ, సీతారామయ్యలోని అధీరతా లక్షణం.

విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి'లో సుబ్బయ్యకు మనుష్యులంటే భయం. అతని పిరికితనానికి చిన్నతనంలో ఒకానొక సంఘటన కారణం. ఆ సంఘటన మనస్సుమీదవేసిన ముద్ర కారణంగా సుబ్బయ్య మనుష్యులతో వ్యవహరించే విధానమే ఒకతీరుగా రూపొందింది. ఎదుటివారెవరైనా ఎలాంటివారైనా అడ్డుచెప్పకుండా ప్రవర్తించడంలోఉన్నభద్రత అందులో మూలసూత్రం. పరిస్థితులు విషమించి, ఈ విధానం అతనికి పనికిరాకుండాపోయినస్థితి ఏర్పడీ, సుబ్బయ్య భయం పరాకాష్ఠచెంది, ఒక్కసారిగా పొంగిచల్లారిన పాలలా, అంతర్హితం అయిపోతుంది. ఇలా భయం నుంచీ విముక్తిచెందిన అధీరునికి జీవితం క్రొత్త కాంతులతో కనిపిస్తుంది. నీతి, సంప్రదాయం, సమాజంవంటివి కేవలం నీలితెరలుగా, ప్రక్కకు ఒత్తిగిస్తే ఒత్తిగిలేవిగా కనిపిస్తాయి. కావలసింది వాటిని ప్రక్కకునెట్టే సాహసంమాత్రమేఅని తోస్తుంది. జీవితాన్ని సిద్ధాంతాలకూ ఊహలకూ అతీతంగా అందుబాటులో ఉండేదిగా దర్శించగలుగుతాడు ఈ అధీరుడు. ఏదో ఒక దృక్పథం, లక్ష్యం, లేక విశ్వాసం తన వ్యక్తిత్వంలో రూపొందటంద్వారా విజయాన్ని సాధించే ధీరనాయకుని విజయానికి భిన్నమైన విజయం ఈ అధీరనాయకునిది. పరిస్థితులు, అతని సంకల్పరాహిత్యం కారణంగా, అతనికి ప్రసాదించిన విజయం సుబ్బయ్యది.

బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' నవలలో కథానాయకుడు దయానిధికూడా అధీరుడే. దయానిధి స్త్రీలపట్ల అధీరుడు. వాళ్లంటే ఆకర్షణ, అపకర్షణ రెండూ ఉన్నాయి దయానిధికి. దయానిధి జీవితంలో కాల్పనికవాదప్రేమసూత్రాలూ అన్వయించవు; సంప్రదాయ వివాహమూ ఫలించదు; దేశభక్తి మానవసేవ వంటి ఆదర్శాలూ అర్థరహితమే అవుతాయి. దయానిధికి చివరకు మిగిలింది: తను ఏకాకి, తన ఏకాంతాన్ని ఎవ్వరూ భగ్నంచెయ్యలేరు. తనతో తను సమాధానపడక తప్పదు, అనే స్పృహ ఒక్కటే! సంప్రదాయానికీ, సమాజానికీ, సిద్ధాంతాలకూ అతీతమైన అస్పృశ్యమైన సత్యాన్ని మానవత్వంలో చివరకు మిగిలేదిగా సూచించడమే ఈ నవలలోని నాయకుని అధీరతయొక్క పర్యవసానం.

మారుతున్న సమాజంలో విలువలు మారుతూ వస్తున్నాయి. స్త్రీవిమోచనోద్యమాలంటూ (Women's Liberation Movements) విదేశాల్లో ఉద్ధృతంగా ప్రారంభమైన విప్లవంఛాయలు మన సమాజంలోనూ ఉన్నాయి. ధీరుడైన భర్తకంటె అధీరుడూ ఆటబొమ్మాఅయిన భర్త సంసారాన్ని స్వర్గతుల్యం చెయ్యగలడన్న నవలలు తెలుగులో వచ్చాయి. ఆధునికనవలలో అధీరుడైన నాయకునికి స్త్రీ రచయితలు వాళ్ల దృక్పథంనుంచీ పెట్టిన మెలిక (Twist) గా ఈ పరిణామాన్ని పరిగణించవచ్చు. కాని ఆటబొమ్మలో లోపించేది జీవలక్షణం ఒక్కటే. దానికి తిరుగుబాటు తెలీదు.

జీవితాన్నిగూర్చి సమాజాన్నిగూర్చి దృక్పథం గడచినయాభై ఏళ్లల్లో ఎంతో మారిపోయింది. వ్యక్తినిష్ఠమైన కాల్పనికవాదం ప్రభావం క్షీణించి, లుప్తమై, వర్గనిష్ఠమైన సామాజికవాదం ప్రబలుతూ వచ్చింది. సాంఘిక ఆర్థిక వ్యవస్థముందు, సమూహం ముందు వ్యక్తి అల్పుడుగా కన్పించాడు. జి. వి. కృష్ణారావు 'కీలుబొమ్మలు' నాయకునిలో, కుటుంబరావు 'బెదరిన మనుష్యులు'—సీతప్ప, రామమ్మలలో ఈ రకం అధీరతా లక్షణం గోచరిస్తుంది. ఈ పాత్రలలో కనిపించే చేతకానితనం, నిస్పృహ, బెదరు, సమాజంలో వారి ఆర్థిక స్థితినుంచి సంక్రమించినవేనని ప్రతిపాదన. ఆ స్థితినుంచి బయటపడే ధీరత

వ్యక్తులుగా వాళ్లకు లేదు, ఎప్పుడూ రాదు, వ్యవస్థ మారినప్పుడే ఇటువంటి వాళ్లు మారి మరో విధంగా ఉంటారు అని సిద్ధాంతం. విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి'లో ఈ ప్రతిపాదన సిద్ధాంతము లేవు. అక్కడ 'ఆత్మ న్యూనతా భ్రాంతి' అనే మనోవైజ్ఞానిక సూత్రం అన్వయింపబడి, ఒకానొక వ్యక్తిలో మార్పు మానసికమైనవిప్లవం దానికదే సాధ్యం అనే ప్రతిపాదన కనిపిస్తుంది. వ్యవస్థ మారితేతప్ప వ్యక్తుల్లో మార్పు సాధ్యమేకాదు అనే సిద్ధాంతన్ని· విశ్వనాథ శాస్త్రి సహా కొందరు రచయితలు ఇటీవల గట్టి పరచుకొన్నట్లు తోస్తున్నది. దాని ఫలితంగా అధీరులైన పాత్రలను కేవలం వర్గచైతన్యానికి ప్రతినిధులుగా చిత్రించడమో, లేక రాజకీయవిప్లవాకాంక్షనే మనిషిలోని ఉత్తమ ధీరత్వంగా పోషించడమో జరుగుతున్నది. దీనివల్ల రాజకీయాలకు మేలు జరగవచ్చు కాని, సాహిత్యానికీ వ్యక్తుల్లో నిజమైన మానసిక విప్లవానికీ దోహదం జరగడం సందేహాస్పదమే.

వ్యక్తిలో మానసిక విప్లవం అంటే అర్థం పది మందీ ఆలోచించే దానికి తను భిన్నంగా ఆలోచించడమే. ఒక వర్గం మరొక వర్గంమీద లేవదీసే తిరుగుబాటు రాజకీయ విప్లవం అవుతుంది. తద్వారా ఆ వర్గంలో ఒకడైన వ్యక్తి ఆలోచనల్లో వచ్చే మార్పు ఆ వర్గం వారందరికీ సామాన్యమైనదిగా వుంటూ, అది అతనిలోని సామాజిక–రాజకీయ చైతన్యంలో మార్పు మాత్రమే అవుతుంది. అంటే కొన్ని ప్రయోజనాల కోసం తనవర్గంవాళ్లతో ఏకీభవించి అనుసరించే (conformist) ఆలోచనా విధానమేతప్ప, ఆ పదిమందీ ఆలోచించే దానికి భిన్నంగా ఆలోచించి నిలబడడం కాదన్నమాట. ఆలోచనల్లో అటువంటి వ్యక్తిగతమైన తిరుగుబాటుకీ, ఈ నిత్యనూతనమైన మానసిక విప్లవానికీ సామాజికవాదంలో అవకాశమూ, గుర్తింపూ లేనేలేదు! పైగా ఆంక్ష ఉంది! వ్యక్తి సర్వస్వతంత్రుడు, అతనికి సమాజంతో సంబంధం ఏమీలేదు, అనేది కాల్పనిక వాదా

నికి పరాకాష్ఠ అయితే, వ్యక్తి సమాజశరీరంలో ఒక అవయవం మాత్రమే, అతనికి ప్రత్యేక చైతన్యం అంటూ ఏమీలేదు, ఉండటానికి వీల్లేదు, అనడం సామాజిక వాదంయొక్క మూలసూత్రం. ఈ రెండు సిద్ధాంతాలనీ యథాతథంగా అంగీకరించకపోవడం, రెండింటిలోనూ కొంత సత్యం ఉన్నదని అంగీకరించడమూ, మానవునికి వ్యక్తిగా, సామాజికునిగా రెండువిధాలా క్షేమంఅని తోస్తుంది! అసలు మనిషిలో జీవలక్షణం అనేది అతనిలోని వ్యక్తికీ—సమాజానికీమధ్య నిత్యమూ జరిగే సంఘర్షణేఅని తోస్తుంది. ఈ సంఘర్షణకు స్వస్తిచెప్పి ఏఒక్కదానికో పట్టంగట్టే పరిస్థితి ఏర్పడినప్పుడు, మనిషి అటు ఉన్మాది (మార్మికయోగి) అయినా అవుతాడు; ఇటు జీవచ్ఛవమైన బానిస అయినా అవుతాడు. 'విప్లవం', 'తిరుగుబాటు' అనేది ప్రతివ్యక్తిలో సమాజానికీ—వ్యక్తికీ జరిగే సంఘర్షణ, ఆటూ—పోటూ: అది ఉండటమే జీవలక్షణం. దానికి పర్యవసానం ఉండరాదు, ఉంటే వ్యక్తిగా మృతి. ఈ సత్యాన్ని నేడు రచయితలు విస్మరించే ధోరణి ఉన్నందువలననే వారి సాహిత్యసృష్టికూడా జీవలక్షణం కోల్పోయే ప్రమాదం ఉన్నది. |

వ్యవస్థమీద, సామూహిక విశ్వాసాలమీద, వ్యక్తి ప్రతియుగంలోనూ తిరుగబడుతూనే ఉన్నాడు. ఆ తిరుగుబాటులో ప్రాణాలివ్వడం, ఆత్మబలివంటివి ధీరత్వానికి చిహ్నాలు. ఏసుక్రీస్తు, సోక్రటీస్, గాంధీ వంటివారు చేసిన ప్రాణత్యాగం మనకు విలువైనదిగా తోస్తుంది. ప్రకాశంపంతులు బ్రిటిషువారి తుపాకుల ముందు రొమ్మువిరిచి నిలబడటంలో ఈనాటికీ చెప్పుకునేంత ధీరత్వం కనిపిస్తుంది. కానీ ఇటీవల హిరోషిమా, వియత్నాం, బంగ్లాదేష్ విపరీతాలను తలచుకుంటే మారినయుగలక్షణం మనకు బోధపడుతుంది. మనుష్యులు ఈగల్లా, దోమల్లా చంపబడే పరిస్థితుల్లో వ్యక్తి ప్రాణత్యాగానికి విలువ, ప్రయోజనం ఏమున్నది? నేడు కొన్నిదేశాల్లో ఏర్పడిన సామాజిక పరిస్థితుల్లో, ప్రభుత్వ వ్యవస్థల్లో ధీరునికంటే అధీరుడే ప్రయోజకుడుగా కనిపిస్తాడు. విశ్వాసాల కోసం ప్రాణత్యాగంచేసేవారిని మారణహోమం చెయ్యడానికి అటు విప్లవ సైద్ధాంతికులు, ఇటు నియంతలూ సిద్ధంగాఉన్న రోజుల్లో ధీరునికంటే అధీరునికే బ్రతికే అవకాశం, అందువల్ల విలువ ఎక్కువ. కాని కేవలం ఏదోవిధంగా బ్రతకడమే 'విలువ' అనిపించుకోదు. ఇక్కడ తప్పనిసరిఅయ్యే స్తబ్ధజీవితానికి ఒక అర్థం ఉంటుంది.

తెలుగు నవలల్లో అధీరనాయకుల్నిగూర్చిచేసిన పై చర్చలో స్తబ్ధత, నిస్పృహ, కర్తృత్వ విహీనత, సంకల్పరాహిత్యం, అధీరతా లక్షణాలుగా విశ్లేషించాం. ఇవన్నీ రంగారావు, సీతారామయ్య, సుబ్బయ్య, దయానిధి క్రమంగా వివాహవ్యవస్థకు, హేతువాదానికి, ఔద్ధత్యానికి, దాంపత్యప్రేమకు ఎదురుతిరగడంమూలంగా సంభవించినవే. ఈ పాత్రల వ్యక్తిత్వం, తిరుగుబాటు, క్రొత్తసిద్ధాంతాలను నిరూపించే ధీరతగాకాక వారి 'అధీరత ద్వారానే ప్రకటితమయింది. 'కీలుబొమ్మలు' లోని నాయకుడుగాని, సీతప్ప రామమ్మలుగాని అటువంటి 'అధీరులు'కారు. వాళ్లు దేనికీ ఎదురుతిరగలేరు, వ్యతిరేకించలేరు. వాళ్లు కేవలం సామాజిక శక్తులు నిర్మించిన కీలుబొమ్మలు. వాళ్లలో అర్థవంతమైన స్తబ్ధతకాని మరొకటికాని లేదు. ఇలాంటి మనుష్యులే నియంతృత్వ వ్యవస్థకు పనికివచ్చేవాళ్లు. వీళ్లలో జీవలక్షణమైన ప్రతిఘటన ఏకోశానా కనిపించదు. అందువల్లే వీరి అధీరతకు మానవత్వం దృష్ట్యా విలువలేదు. ఎందుకంటే వీరిద్వారా మానవ చరిత్రకాని, సమాజంకాని ఆశించేదేమీ ఉండదు.

———

# తిక్కన అనువాదసరణి

శ్రీ కాళూరి హనుమంతరావు

"త్రిక్కన అనువాదసరణి — అంబోపాఖ్యానము' (భారతి, ఆగష్టు 1971) అన్న నా వ్యాసంలో వ్యాస భారతాన్ని చాలా సంక్షేపించడం వలన తిక్కన రచనలో కావ్యపుష్టి చాలా తగ్గింది అని ప్రతిపాదించాను. నా అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తూ నవంబరు భారతి సంచికలో శ్రీ శింగనమల్ల రాధాకృష్ణయ్య గారు 'మహాకవి తిక్కన—కవితారీతులు' అన్నవ్యాసం, శ్రీ సంపత్కుమారగారు 'అంబోపాఖ్యానం—తిక్కన రచన' అన్న వ్యాసం రచించారు. వీరిరువురి అభిప్రాయాలనూ ఈ వ్యాసంలో నేను పరామర్శిస్తాను.

ఈ రెండు వ్యాసాలలో ప్రధానమైన అభిప్రాయం — ఈ ఉపాఖ్యానం కవి కథనంకాదు, భీష్ముడు దుర్యోధనుడికి రాజసభలో చెబుతున్నది కనుక ఆ పరిస్థితికి అనువుగా అవసరమైనంత మేరకు తిక్కన సంక్షేపించాడు, ఇలా సంక్షేపించడం గొప్ప రచనాశిల్పం—అని.

కాని మహాభారతం యావత్తూ వైశంపాయనుడు జనమేజయునికి చెబుతున్నట్లు సూతుడు శౌనకాది మునులకు చెప్పినదే. మహాభారత యుద్ధ వర్ణన అంతా సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పినది. మరి, వాడన్ని బాణాలు వేశాడు, వీడన్ని బాణాలు వేశాడు అంటూ విపులంగా ఎందుకు వర్ణించబడినట్టు? మహాభారతంలో ప్రతి ఉపాఖ్యానమూ ఒకరు ఇంకొకరితో చెప్పినదే తప్ప అన్యం కానరాదు. మార్కండేయుడు ధర్మరాజుకి రామోపాఖ్యానం, సావిత్ర్యుపాఖ్యానం చెబుతాడు: ఎర్రన ఈ రెండు ఉపాఖ్యానాలనీ అట్టే సంక్షేపించకుండా చక్కగా ఆంధ్రీకరించాడు. సావిత్ర్యుపాఖ్యానంలో—

'చిత్తంబున బైకొనియెడు
నుత్తల మడచుచును ముఖ పయోరుహమున ద
ల్కొత్తెడు వెడనవ్వున బ్రియు
చిత్తం బిగురొత్త జనియె జెలువ యడవికిన్.'

ఇట్లా దంపతులు మందగమనంబున నరిగి పరిసరారణ్యంబు దరియం జొచ్చి రప్పుడు.

కమనీయ కమలినీ కల్లోల వీథుల
గదలు రాయంచల గతుల యొప్పు
బహుపుష్పపల్లవ ప్రకరచిత్రితములై
తనరారు తరు లతా తతుల సొంపు
మకరంద రసపాన మదవిలోలంబులై
క్రాలెడి యెలదేటి గముల యులివు
బరిపక్వ మంజుల ఫలరసోద్ధతములై
పలుకు రాచిలుకల పటు రవంబు
ప్రియుడు వేరవేర ప్రీతిమై జూపుచు
జెప్పుచును జనంగ జిగురుబోడి
గనుచు వినుచు నిర్వికార సల్లాప మిం
పార నతని తెరగు నరయుచుండె.'

(అం. మ. భా. అర. 7. 211—13)

అన్న ఎర్రన రచనలో వర్ణనా నైపుణికీ, మనోవిశ్లేషణకీ మధురమైన మాటల కూర్పుకీ మనం పరవశిస్తాం. కావ్య రచన అంటే ఇదీ. అంతే గాని, మార్కండేయుడు ధర్మరాజుకి ఈ వర్ణన అంతా గణయతిప్రాసలు కూర్చుకొని చేశాడా? అని మనం ప్రశ్నించం. ఈ ఉపాఖ్యానకథనానికి సావిత్రీచరిత్రంలోని నీతే ప్రధానం కాబట్టి అది మాత్రం చెప్పాలి, ఈ వివరాలన్నీ అనవసరం అని మనం అనం.

సాహిత్యం వాస్తవజగత్తుకి అతీతమైనది. సాహిత్యంలో మనోవిశ్లేషణకాని, వర్ణనకాని, రెండూ కాని ముఖ్యం. అందుకొరకు శ్రవ్యకావ్యాలలోనూ దృశ్యకావ్యాలలోనూ కవులు వాస్తవికతకు అతీతంగా

రచిస్తారు, అలా రచించడం అవసరం. లేకపోతే లోకంలో మామూలుగా జరిగే వాటికీ సాహిత్యంలో చూపబడిన వాటికీ ఏమీ అంతరం లేకపోతుంది. ఉదాహరణకి అనర్ఘరాఘవ నాటకంలో తాటక వర్ణన. ఇలా ఉంది—

'నిర్మజ్జచ్చకురంతభ్రమదతి
కపిశక్రూరతారానరాస్థి
గ్రంథిం దంతాంతరాలగ్రథిత
మవిరతం జిహ్వయాఘట్టయంతీ
ధ్వాంతేఽపి వ్యాత్తవక్త్ర జ్వల దనల శిఖా
జర్జరే వ్యక్తకర్మా
నిర్మాంతీ గృధ్రరౌద్రీం
దివ ముపరి పరిక్రీడతే తాడకేయమ్.' (2.54)

(లోతుకు పోతున్న కళ్లలో తిరుగుడు పడుతున్న భయంకరమైన కపిశవర్ణంకల తారకలు కలిగి, కోరల మధ్య ఉన్న మనుష్యాస్థిగ్రంథిని నాలికతో ఆడిస్తూ, వివృతవదనంలో జ్వలిస్తున్న అగ్నిశిఖచేత అంధకారం పటాపంచలు కావడంవలన తాను చేస్తున్న కృత్యాలు కనిపిస్తూ ఉండగా, ఆకాశంలో గ్రద్దవలె రౌద్రంగా ఈ తాడక క్రీడిస్తున్నది)

ఈ వర్ణన చేసినవారు భయభ్రాంతులైన తాపసులు. ఉన్నదున్నట్లుగా రచించాలంటే ఇక్కడ భయంతో పారిపోతున్న మునులని వెంట తరుముతున్న తాటకని రంగంమీద ప్రవేశపెట్టాలి. కాని అలా చేస్తే నాటకప్రదర్శనలో గందరగోళం జరుగుతుందితప్ప తాటక భయంకరత్వాన్ని సామాజికుడు అనుభవించలేడు. కనుక ఇక్కడ ఈ వర్ణన అవసరం. శ్రవ్యకావ్యంలో కవి ఇంకా ఎక్కువ స్వాతంత్ర్యం తీసుకొని వర్ణనాదులు చేస్తాడు, కౌరవ పాండవ సైన్యాలని అలా నిలుచోబెట్టి కృష్ణునిచేత , భగవద్గీతోపన్యాసం చేయిస్తాడు కవి. ఇందులో అవాస్తవికత స్ఫుటమే. కాని భగవద్గీతలోని భావగాంభీర్యానికీ, ఆలోచనలఔన్నత్యానికి మనం ముగ్ధులవుతాం. అంతేతప్ప ఆ సన్నివేశంలో వాస్తవికతలేదనీ శిల్పం లేదనీ ఆక్షేపించం.

అందుచేత భీష్ముడు సభలో చెప్పడంవలన ఈ కథని అవసరమైన మేరకు సంక్షేపించడమే యుక్తం, అదే గొప్పకావ్యశిల్పం అనడం పొరపాటు. అప్పుడు ఆ మాత్రం వివరాలైనా ఎందుకు చెప్పాలి అన్న ప్రశ్న వస్తుంది. 'కథాకాలక్షేపార్థమో లేక వినోదకాలక్షేపార్థమో సమావేశమైన సభ' కాక 'కదనకుతూహలంతో యెగిరెగిరిపడే రాజన్యుల సభలో' భీష్ముడు తొంభై ఏడు పద్యా లెట్లా గడగడ పఠించగలిగాడు? ప్రయోజనం దృష్టితోనే ఈ ఉపాఖ్యానాన్ని రచించవలసివస్తే 'ఆ శిఖండి పూర్వం స్త్రీ, ఇప్పుడు పురుషుడు; అంచేత నేనతణ్ణి చంపను; అదంతా చాలా పెద్దగాథ, తర్వాత తీరికగా చెబుతాను' అని మాత్రం ఇక్కడ భీష్ముడిచేత అనిపించి కథని దాటవేయవలసి ఉంది. కాని కావ్యరచన అలా ఎప్పుడూ ఉండదు కదా! కావ్యంలో కవి తానైచెప్పినా, పాత్రలచేత చెప్పించినా దానిలో కావ్యగుణాలు ఉండాలి. అంటే కావ్యంలో కవి చెప్పినా పాత్ర చెప్పినా కథనం ఒకేలాగ ఉండాలనికాదు. ఆవశ్యకత ఉండి, దానివలన పాత్రపోషణ జరిగితే పాత్రని బట్టి కథనంలో మార్పు ఉండవచ్చును. ఉదాహరణకి మయసభలో దుర్యోధనుడు భంగపడడం ముందు కవి వర్ణించాడు. తర్వాత దానినే దుర్యోధనుడు తన తండ్రికి వర్ణించి చెబుతాడు, ఈ రెండు కథనాలలోనూ కొంత వ్యత్యాసం ఉంది. [1]తండ్రికి పాండవుల మీద ద్వేషం తెప్పించే ప్రయత్నం దుర్యోధనుడి కథనంలో కనిపిస్తుంది. ఇలా ప్రయోజనాన్ని బట్టి కథనంలో మార్పు ఉండవచ్చును. ఇతివృత్త నిర్వహణంలో శిల్పం చూపవచ్చును. ఉదాహరణకి వాల్మీకి కాకాసుర వృత్తాంతం చెప్పడంలో చక్కని శిల్పం ప్రదర్శించాడు. ఇది చిత్రకూటాశ్రమంలో జరిగింది. కాని సుందరకాండలో దీన్ని చెబుతాడు. ఈ కథని సీత రామునికి అభిజ్ఞానంగా హనుమంతునితో చెప్పి పంపుతుంది. కనుక ఈ కథని జరిగిన సమయంలోకాక, చెప్పవలసిన ఆవశ్యకత కలిగినప్పుడే చెప్పడం ఒకశిల్పం. రామబాణం వెంట తగలగా కాకాసురుడు ముల్లోకాలూ తిరిగాడు. కనుక ఈ సంఘటన ముల్లోకాలలోనూ తెలిసినదే కావచ్చును. అందరికీ తెలిసిన దానిని అభిజ్ఞానంగా చెప్పడంలో ఉద్దేశమేమిటి ?[2] అంటే

1, 2 ఈ రెండు అభిప్రాయాలూ శ్రీ కాళూరి వ్యాసమూర్తిగారివి.

క్కడ అభిజ్ఞానం కథకాదు; ఆ సన్నివేశంలో సీతా రాములకి మాత్రం తెలిసిన రహస్యప్రవర్తన ఈ కథ ద్వారా సీత రాముడికి సందేశం కూడా పంపుతుంది. నాకు రవ్వంత అపకారం చేసిన ఒకకాకిమీద రాముడు రెండో ఆలోచన లేకుండా బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. ఇప్పుడింత అపకారం చేసినా రావణుణ్ణి ఎందుకు ఉపేక్షిస్తున్నాడు—అని. అభిజ్ఞానంగా చెప్పిన రహస్య విశేషాలతో కూడిన ఈ కథని వాల్మీకి రెండుసార్లు చెప్పకుండా అవసరమైన చోటనే చెప్పడం కథనశిల్పం. కావ్యంలో ఉపాఖ్యాన నిర్వహణలో శిల్పం ఈ తీరున ఉంటుంది తప్ప కవి చెప్పిన వాటిలోనే వివరాలుండాలనీ, పాత్రలు చెప్పినవి టూకీగా ఉండాలనీ అనుకొనడం పొరపాటు. కావ్యంలో కావ్యగుణా లెప్పుడూ కొరవడ కూడదు.

కనుక 'ఆ తరువాత సాళ్వ తిరస్కృత అయిన అంబా మనః పరిస్థితిని వర్ణించడం భీష్ముడి కనవసరం. ఆవిడ ఏ నిర్ణయానికి వచ్చిందో అది అవసరం' అన్న సంపత్కుమారగారి అభిప్రాయం యుక్తంకాదు. అలాగయితే అంతా అనవసరమే అనవలసి వస్తుంది. 'చని చనియవ్వెలంది యిట్లని వితర్కించు' అని అయినా ఎందుకు వ్రాయాలి ? 'సాళ్వుడు తిరస్కరించగానే నన్ను చంపడానికి నిర్ణయించింది' అని భీష్ముడిచేత అనిపిస్తే చాలు— విషయం తెలియడానికి. కాని అలా వ్రాసేదానిని సాహిత్యం అనం.

భీష్ముడు స్వార్థపరుడై, దీనిలో నా తప్పేమీ లేదు, అంతా అంబాసాళ్వులదే అని సభలో అందరినీ నిమ్మించే ప్రయత్నంతో ఈ కథ చెప్పి ఉన్నట్లైతే అప్పుడు కథనంలో మార్పు ఉండవచ్చును. కాని భీష్ముడు మహానుభావుడు. జరిగింది జరిగినట్లు చెప్పాడు. కనుక తిక్కన సంక్షేపించడంవలన కావ్య గౌరవం లోపించిందే తప్ప కథనంలో ఏమీ శిల్పం ప్రదర్శితం కాలేదు,

'భారత కథ వ్యాసుని సమకాలికుల చరిత్ర. దాన్ని చారిత్రిక దృష్టితో చెప్పకుంటూ పోయాడు బాదరాయణుడు. దాన్ని కావ్యదృష్టితో తెనిగించాడు కవిబ్రహ్మ. అంబ తపస్సుకు పూనుకొనడం, మునుల చేత వారింపబడడం, హోత్రవాహనుడూ అకృత వ్రణుడూ రావడం వంటి సంఘటనలను వివరంగా చెప్పడంలో వ్యాసుని చారిత్రిక దృష్టి స్పష్టంగా కనిపిస్తోంది.' అన్నారు రాధాకృష్ణయ్యగారు.

సమకాలిక సమాజాన్ని వర్ణిస్తున్న మహా ప్రతిభావంతుడైన గొప్ప రచయిత ఎప్పుడూ రచనా శిల్పపు కట్టుబాట్లకు బద్ధుడై ఉండలేడు. పెను తుఫానువంటి అతని రచనావేశం ఈ బంధనాలని ఎగరగొట్టివేస్తూ ఉంటుంది. రామాయణ మహా భారతాలలో కథతో గాఢంగా అతకని కొన్ని సన్నివేశాలూ వర్ణనలూ చర్చలూ ఉన్నాయి. అవి ఆ కవుల ప్రతిభకే నిదర్శనాలు తప్ప రచనాశిల్పం లోపించడానికికాదు. War and Peace అన్న గొప్ప నవలలో టోల్‌స్టాయ్ ప్రధాన కథతో గాఢ సంబంధం లేని అనేక విషయాలు వివరించాడు. చరిత్ర శక్తులను చర్చించాడు. అతని రచనోద్వేగం అటువంటిది. ఆ చర్చలు ఆ నవల గొప్పతనానికి దోహదం చేస్తున్నాయి. వ్యాసభారతం ఉద్గ్రంథ మైందంటే పాత్ర పోషణ, కథాకథనం ఒకఎత్తూ, దానిలో ఆలోడింప బడిన అనేక విషయాలు ఒక ఎత్తూను.

అంటే ప్రస్తుత మహాభారతంలో ఉన్న ప్రతి వాక్యం శిరోధార్యమనీ, ఔచిత్యసంయుతమనీ కాదు. అక్కడక్కడ మనకి నచ్చనివి ఉండవచ్చును. అనేక ప్రక్షిప్తాలతో గ్రంథం సంకీర్ణంగా పెరిగి పోయి ఉండవచ్చును. కాని రామాయణ మహా భారతాలలో సాధారణంగా మనకి గంభీరమైన జీవితతత్త్వ పారదృశ్యమైన ఆర్షవాక్కు మాటి మాటికీ ఖంగుఖంగుమని వినిపిస్తూ ఉంటుంది. రామాయణ మహాభారతాల గొప్పతనం ఈ వాక్కులలో మనం చూడాలి.

మూలంలో కొన్ని అనౌచిత్యాలున్నాయనీ తిక్కన వాటిని పరిహరించాడనీ వీరిరువురూ వాదించారు.

'కి మర్థం భరత శ్రేష్ఠ
నైవ హన్యాః శిఖండినమ్.'

అన్న దుర్యోధనుడి మాటలలో అతని రాజసం తొంగి చూస్తున్నదేగాని ఆరాటంకాదు, తిక్కన అనువాదంలో

ఆ రాజసాన్నీ తొలగించి దుర్యోధనుడికి భీష్మునియందు కల గౌరవభావాన్ని ప్రదర్శించాడు' అని రాధా కృష్ణయ్యగారు వ్రాశారు. దుర్యోధనుడికి భీష్ముని యందు ఏ మాత్రం గౌరవభావం ఉందో ద్యూత సమయంలోనూ, గోగ్రహణసమయంలోనూ తెలిసినదే. శ్లోకం అంతా చదివితేతప్ప దుర్యోధనుని ఆరాటం తెలియదు.

'ఉద్యతేషు మహో దృష్ట్వా
సమరే ప్వాతతాయినమ్.'

అన్న రెండో చరణం రాధాకృష్ణయ్యగారు ఉదాహరించలేదు.

సేనానాయకుడుగా అభిషిక్తుడైన భీష్ముడు పరమోత్సాహంతో ఉన్నాడని నేను వ్రాసినదానికి ఉభయులూ భీష్ముడు పరమసాత్త్వికుడూ భాగవతోత్తముడూ అనీ, అదతనికి విషాదసమయంకాని ఉత్సాహ సమయం కాదనీ వ్రాశారు. యుద్ధం గురించి అతని వ్యక్తిగతమైన అభిప్రాయమేదైనా సర్వసేనాధిపత్యం వహించిన ఆ సమయంలో కౌరవ సైన్యానికి ప్రోత్సాహం కలిగించడం తన ధర్మం. అందుచేతనే

'మీటుగల రాజరథికుల
నాటికి వేవుర వధింతు నరు శరములు నో
నాటి పడవైచు నంతకు
వేటాడెద ప్రతిబలంబు వీరుల నెల్లన్.
అట్లుగాక నా కయ్యంబు సేయు దివసంబులలోన.
పదివేల జంపగా నో
పుదు నేనను నెత్తికోలు పుట్టిన యది నీ
పదునొక డక్షోహిణులను
జదురున నడిపింతు నెదిరి సైన్యము గలతున్.'

(4. 407—9)

అంటాడు. అనడమేకాదు; తొమ్మిది రోజులు పాండవ సైన్యాన్ని మారణంచేసి వారికి జయం అసాధ్యం అనిపింపజేశాడు. భీష్ముడు సాత్త్వికుడూ పరమభాగవతుడేకాక మహావీరుడు కూడా. కనుక సర్వసైన్యాధిపత్యం వహించినప్పుడు తన పక్షానికి ఉత్సాహం కలిగిస్తూ తాను ఉత్సాహం పొందడంలో అనౌచిత్యంలేదు.

'యద్యైవహి వనం ప్రాయాత్'అన్న శ్లోకంలో జ్ఞానిఅయిన భీష్ముడు మరణానికి భయపడ్డట్లు వ్యాసుడు రచించడంలో ఔచిత్యంలేదు, తిక్కన దీనిని తొలగించాడన్నారు—రాధాకృష్ణయ్యగారు. భీష్ముడికి కరిగినది భయంకాదు; జరిగినదానికీ జరుగబోతున్న దానికీ మనోవైకల్యం.

ఏతావతా వ్యాసభారతంలో ఉన్నదల్లా గుణవంతమనీ, కవిత్రయభారతంలో ఉన్నదల్లా గుణహీనమనీ నా ఉద్దేశంకాదు. కొన్నికొన్నిచోట్ల వీరూ బాగానే రచించిఉండవచ్చును. కాని అనేకదశాబ్దులుగా వ్యాస భారతాన్ని సరిగా పరిశీలించకుండానూ, అసలు చూడనైనా చూడకుండానూ, నన్నయ్య వాల్మీకి అంతటి కవి అనీ, కవిత్రయంమూలానికి మెరుగుపెట్టారనీ వ్యాసాలమీద వ్యాసాలూ, పుస్తకాలమీద పుస్తకాలు వ్రాసెయ్యటం, సభలలో ఉపన్యసించివెయ్యటం ఆంధ్ర సాహిత్యవేత్తలకి ఆనవాయితీగా ఉంటోంది. ఈ ఆనవాయితీ మహాప్రవాహంలోపడి కొట్టుకుపోకుండా సత్యాన్ని సమీక్షించాలి. వ్యాసభారతం గొప్పతనాన్ని అర్థం చేసుకొనడం చాలా ఆవశ్యకం.



# కంప్యూటర్

డా. విశ్వనాథ అరుణాచలం

## 1. ఉపోద్ఘాతము

కొండగుహల్లో మృగాలకు మల్లే నివసించేనాటి నుంచి మనుష్యుడు గణించడం నేర్చుకొన్నాడు. అతని దైనందిన అవసరాల్నిబట్టి చేతిలోని వ్రేళ్లను, ఇంకా అవసరమైతే కాలిలోని వ్రేళ్లను, గణించడానికి ఉపయోగించేవాడు. నాగరకత పెరిగినకొద్దీ అతడు గణించడంలో మార్పు, చేర్పు ఏర్పరచుకొన్నాడు. ఎంచడానికి చేతివ్రేళ్లు, కాలివ్రేళ్లు చాలవని గుర్తించిన ఫలితంగా గణించడంలో గొప్పఅభివృద్ధిని సాధించినాడు.

గణితచరిత్ర పుటలను ఒక్కసారి త్రిప్పామంటే మనుజుడు చాలాకాలంనుండి త్వరగా గణించేందుకు అవసరమయ్యే విధానాలను కనుక్కొంటూనే ఉన్నాడని తెలుస్తుంది. అవిచ్ఛిన్నంగాసాగే ఈ అన్వేషణలో ఎన్నో యాంత్రిక సాధనము లుత్పన్నము లైనాయి. ఇందు ముఖ్యంగా మనకు తెలిసినవి అబాకస్ (Abacus), సంవర్గమానపు పట్టీలు (Logarithmic Tables), స్లైడ్ రూలు (Slide Rule), ఇవి ఆధునిక గణన యంత్రాలు. వీటన్నిట్లో అతిప్రాచీనమైనది అబాకస్. ప్రపంచంలో అనేకదేశాల్లో చాలకాలంనుంచి ఈ సాధనాన్ని ఉపయోగించేవారని గణితచరిత్రకారులు అంగీకరిస్తారు. క్రీ. పూ. 2500 సంవత్సరములనాడే దీన్ని వాడినారనుటకు ఆధారాలున్నాయి. సంవర్గమానాల్ని నేపియర్ (John Napier; Ad. 1550—1617) ప్రవేశపెట్టినాడు. క్రీ. శ. 1614 లో నేపియర్ ఈ పట్టీలను ప్రకటించి ప్రచారములోనికి తెచ్చినాడు. దాదాపు అదే కాలంలో స్లైడ్‌రూల్ తయారైనది. కొంత లాఘవత్వమును ఉపేక్షించి యాంత్రికముగా సంవర్గమానాలద్వారా గణనం చేయుడమే స్లైడ్‌రూల్ ఉపయోగము. గణన యంత్రము (calculating Machine) చేతితోనో, విద్యుచ్ఛక్తితోనో పనిచేయుటకు అనుగుణమై అనేక విధములైన గణనములను జేయగల్గిన ఒక నూతన సాధనము. పందొమ్మిది, ఇరువదవ శతాబ్దములలో ఎన్నో రకములైనగణనయంత్రము లుత్పన్నములైనవి. వీటన్నిటిలోకి పేర్కొనతగింది క్రీ. శ. 1890 లో హోల్లెరిత్ (Hollerith. Dr. Herman 1860—1929) నిర్మించిన — విద్యుదయస్కాంతముచే పనిచేయు — యంత్రము: దీనినుంచి ఉత్పన్నమైనదే నేటి కంప్యూటర్.

## 2. ప్రాచీనకాలంలో గణనము

రాతియుగపు మనుష్యులు కొయ్యచెక్కలపైన రాతిఫలకములపైన గుర్తులు (tally marks) వేసుకొంటూ వారికి అవసరమైన గణితమును నిర్మించుకొనేవారు. ఆర్థిక వ్యవహారమునకు, కాలగణనమునకు, వ్యాపారమునకు ఈ పద్ధతినే అనుసరించేవారు. మానవకార్యకలాపముల పరిధి పెరిగినకొలది, కాలక్రమేణ ఈ గుర్తుల పద్ధతి త్యజింపబడినది. అనేకములైన పద్దుల లెక్కించవలసినప్పుడు ఈ గుర్తుల పద్ధతి చాలదు. అందువల్లనే అంకెలు అవతరించాయి మొట్టమొదట ఇవి ఈజిప్టులో ప్రారంభమైనదనటానికి చారిత్రక ఆధారాలున్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| I | II | III | IIII | III II |
| (1) | (2) | (3) | (4) | (5) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| III III | IIII III | IIII IIII | III III III | ∩ | e |
| (6) | (7) | (8) | (9) | (10) | (100) |

పై చిహ్నములే మొదటి అంకెలుగా వ్యవహరింపబడినవి. ఈజిప్టుదేశస్థులు పొడవులను కొలవడం ప్రారంభించారు: పొడవులను కొలవడానికి తొలుత వారుపయోగించిన యూనిట్లు వారి ప్రభువు ఫారో (Pharaoh) మూర. ఫారోలు మారినప్పుడల్లా ఈ మూరల పరిమాణాలు మారుతూఉండటంవల్ల చివరకు వారికే ఈ పద్ధతి తృప్తికరంగా లేకపోయింది.

ఈజిప్టు ప్రవేశపెట్టిన అంకెలను సంస్కరించి రోమన్లు ఈ క్రింది సంఖ్యలను ప్రతిపాదించారు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| I | II | III | IV | V | | |
| ఒకటి | రెండు | మూడు | నాలుగు | ఐదు | | |
| VI | VII | VIII | IX | X | | |
| ఆరు | ఏడు | ఎనిమిది | తొమ్మిది | పది | | |
| XX | XXX | XL | L | LX | XC | C |
| ఇరువది | ముప్పది | నలుబది | యాభై | ఆరువది | తొంబది | వంద |
| D | M | | | | | |
| ఐదువందలు | వెయ్యి | | | | | |

ఈజిప్టు అంకెలకంటే రోమన్‌సంఖ్యలు శ్రేష్ఠములే అయినప్పటికీ సంకలన వ్యవకలన భాగ ప్రక్రియలను నిర్వర్తించడం అతికష్టము.

ఉదాహరణము :

```
 XXI
  IX
 ---
 XXX
```

ఈ సంకలనంలో ఇరువదిఒకటి, తొమ్మిది కలసి ముప్పది అవుతుందనే పూర్వజ్ఞానం ఉండబట్టే సాధన సులభమయింది. ప్రాథమిక గణిత ప్రక్రియలను రోమన్‌అంకెలలో నిర్వహించాలంటే అనేక సూత్రాలను వ్రాయవలెనేమో! ఈ సూత్ర బాహుళ్యం చూచి చిన్నచిన్న గుణకార భాగహారాలు కూడ మనం చేసేందుకు జంకుతాము.

భారతదేశం దశాంశగణన పద్ధతిని ప్రతిపాదించింది. ఇది గణిత చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించదగిన అధ్యాయము. ఆనాడు అరబ్బులు వాణిజ్యకళలో ఆరితేరిన వారవటంవల్ల, అతిముఖ్యమైన ఈ దశాంశగణన అవిష్కరణను తక్షణం గ్రహించి విద్యుత్తువలె సమకాలీన విజ్ఞాన ప్రపంచానికి ప్రసరింపచేశారు. అందువల్లనే కొందరు గణిత చరిత్రకారులు దశాంశపద్ధతిని హిందువులు, అరబ్బులు ఇరువురు కనుక్కొన్నారని, వీటిని 'హిందూ అరబ్బు' సంఖ్యలని పేర్కొంటారు.

దశాంశగణనంలోని విశిష్టత విశ్వవిదితము. సున్న అనే సంఖ్యను ఈజిప్షులుకాని, రోమన్లుకాని భావించలేదు. సున్న మొట్టమొదట ప్రవేశించింది దశాంశ పద్ధతిలోనే. ప్రాచ్యులు అనాగరకులనుకొనే పాశ్చాత్యులు కొందరు 'గణిత శాస్త్రాభివృద్ధికి భారతీయులు ప్రసాదించింది 'సున్న'—అని శ్లేషలో ప్రస్తావించడం కూడా కద్దు.

స్థానముల విలువ, సున్న ఈ రెండు దశాంశ పద్ధతికి మూలస్కంధములు. ఇంతకుమునుపే పేర్కొన్నట్టు ఈజిప్టు అంకెలలోను, అంతకంటే శ్రేష్ఠమైన రోమన్ సంఖ్యలలోనూ ఈ రెండు అంశములు లేవు.

## 3. కంప్యూటర్లు—పుట్టు పూర్వోత్తరములు

విజ్ఞాన శాస్త్రజ్ఞులు నేటి యుగాన్ని అంతరిక్ష యుగం అంటారు. అంతరిక్షయుగంలో మనం ఎదుర్కొనే సమస్యలను సాధించేందుకు చిన్నచిన్న యంత్రములు నిరుపయోగములు. రాకెట్ గంటకు 8000 కిలోమీటర్ల వేగంతో ఎగసిపోతూ ఉంటే దాని గమనాన్ని క్షణక్షణానికి గుర్తించవలెనంటే, అది మానవ సాధ్యంకాదు. ఒక సెకండులో భూమిని ఏడు ప్రదక్షిణాలు చేసే కాంతి కిరణ గమన వైఖరిని సమీక్షించడం, చంద్రమండలానికి వెళ్లే గగననౌకను సక్రమమైన మార్గంలో నడిపించడం, వ్యోమగాములతో సల్లాపించడం మొదలైన అతిమానుషమైన ప్రక్రియలను నిర్వహించేందుకు అవతరించిన 'బ్రహ్మరాక్షసి' కంప్యూటర్. యావద్భారత దేశంలోని ప్రజలందరూ ఒకరోజంతా చేసే కార్యాన్నంతా ఒకే ఒక కంప్యూటర్ కొన్నిక్షణాల్లోచేసి ఊరకుంటుంది. అందువల్లే దీనిని 'బ్రహ్మరాక్షసి' అందాము.

గణన విస్తర భీతిచేత గడచిన శతాబ్దములలో, ఈ శతాబ్ద పూర్వార్థములోనూ విజ్ఞాన పరిశోధకులు ఎన్నో సమస్యల్ని అసంపూర్ణంగా వదలివేశారు. ఉదాహరణకు — వెయ్యి అవ్యక్తరాశులుకల వెయ్యి సరళ సమీకరణాలను, కొన్ని నియమములు చెల్లినప్పుడు సిద్ధాంతరీత్యా సాధించవచ్చునని సులభంగా ప్రతిపాదిస్తాము. కానీ ఒక ఉదాహరణను తీసుకొని సాధించేందుకు ప్రయత్నిస్తే గణనవిస్తరభీతిచేత మనం మొదటి రెండుమూడు పద్దుల్లోనే విసుగుచెంది మానేస్తాము. ఎందుకు ? సమస్య క్లిష్టమైనది కాదు. అయితే సుదీర్ఘమైన గణనప్రక్రియ నిర్వహించవలసి నందువల్ల. ఈలాంటి ఘట్టాలు ఎన్నో చూడవచ్చు—క్రీ. శ. 1946 కు ముందు జరిగిన విజ్ఞాన పరిశోధనలలో.

విజ్ఞాన పరిశోధకులు గణనప్రక్రియకు సహాయపడే యంత్ర మేదైనా ఉంటే ఎంతో ప్రయోజనకారిగా ఉంటుందని ఊహిస్తూనే వచ్చారు. ఈ ఊహలు క్రీ. శ. 1830 నుండి విజ్ఞాన జగత్తులో రేకెత్తినవని రూఢిగా చెప్పవచ్చు. చార్లెస్ బాబ్బేజి (Charles Babbage 1792—1871) చక్కని ఊహలతో ఒక గణనయంత్రాన్ని నిర్మించాలని అనేక సంవత్సరాలు ప్రయత్నించాడు. సమకాలీన సాంకేతిక సహాయము ఆశించినంతగా అందలేదు. (అభివృద్ధి చెందలేదు). కాబట్టి చార్లెస్ బాబ్బేజి ప్రయత్నాలు ఫలవంతాలు కాలేదు. దాదాపు ఒక శతాబ్దం తరువాతగాని బాబ్బేజి ఊహలకు రూపకల్పన కలిగే భాగ్యం ప్రాప్తించలేదు. 1946 లో ఒక ఎలక్ట్రానిక్ కంప్యూటర్ నిర్మాణమైన తరువాత కొల్లలుగా ప్రపంచమంతటా కంప్యూటర్లు విస్తరించినవి.

ఆధునికమైనకంప్యూటర్ నిర్మాణకార్యక్రమంలో అగ్రగణ్యులుగా నిలచినవారు J. Presper Eckert అనే ఎలక్ట్రికల్ ఇంజనీయర్, John W. Mauchly అనే భౌతికశాస్త్రవేత్త. ఈ శతాబ్దిలో తలమానికమైన గణితశాస్త్ర మేధావులలో ఒకరైన John Von Neumann. క్రీ. శ. 1944 లో Eckert, Mauchly

ఇరువురు, యుద్ధకార్యముల కుపయోగపడే ENIAC (Electric Numerical integrator And Computer) నిర్మాణం ప్రారంభించి 1945 లో పూర్తి చేశారు. ఇటువంటి యంత్రాన్ని గురించే 1944 లోనే John Von Neumann ఆసక్తి చూపి అంతకంటే చిత్రమైన కంప్యూటర్‌ను ఊహించాడు. తత్ఫలితంగా 1952 లో, కొంతమంది మిత్రులతో కలిసి MANIAC I (Mathematical Analyser, Numerical Integrator And Computer) ని తయారు చేశాడు నాయ్‌మాన్. తరువాత ఎన్నో కంప్యూటర్‌లు తయారైనాయి. కంప్యూటర్‌లను ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలు ప్రారంభమైనవి.

### 4. కంప్యూటర్ లోని ప్రధానాంగములు

కంప్యూటర్‌లు రెండు రకాలు;

(1) అనలాగ్ (Analogue) కంప్యూటర్.

(2) డిజిటల్ (Digital) కంప్యూటర్.

ఒకానొక విజ్ఞానవేత్త సరదాగా అన్నమాటలు ఈ రెండిటి కార్యవిధానంలోని విభేదాన్ని స్థూలంగా వివరిస్తవి.

'నీ ప్రియురాలి వంపుసొంపుల రేఖాకృతిని అనలాగ్ కంప్యూటర్ చిత్రిస్తే, డిజిటల్ కంప్యూటర్ వాటికొలతలను లెక్కిస్తుంది'.

రోమన్లు చేతివ్రేళ్లను, కాలివ్రేళ్లను 'డిజిటి' అంటారు. లెక్కించేటప్పుడు మొట్టమొదట వ్రేళ్లను ఉపయోగించారు కాబట్టి అంకములకు డిజిట్ అనే పేరు సార్థకమైనది.

కార్లు, బస్సులలోఉన్న వేగమాపకాలు, ఇంధన మాపకాలు ఒకవిధమైన అనలాగ్ కంప్యూటరులే. కంప్యూటర్లు బ్రహ్మరాక్షసిలాగా పనిచేసినప్పటికీ అవి స్వయంగా ఆలోచించలేవు. మన ఆదేశాల ప్రకారం విశ్వసనీయంగా పనిచేసే సేవకులే కంప్యూటర్లు. కంప్యూటర్ పనిచేయాలంటే దాని కర్థమయ్యే భాషతోనే పనిని చెప్పవలె. ఈ భాషను కంప్యూటర్ ప్రణాళిక, ఫోర్ట్రాన్ (Fortran) అని వ్యవహరిస్తాము.

కంప్యూటర్‌లోని అనేక అంగములు చిత్రవిచిత్ర సంక్లిష్టనిర్మాణక్రమలను పొందిఉంటాయి. ప్రతి అంగమును వివరించాలంటే ఒక గ్రంథమే వ్రాయవలసివస్తుంది. అందువల్ల స్థూలంగా కంప్యూటర్ లోని ప్రధానాంగములనుగురించిమాత్రం చర్చిస్తాము.

ఒక డిజిటల్ కంప్యూటర్‌లో ఐదు ప్రధానాంగము లుంటాయి;

(1) Input Unit

(2) Control Unit

(3) Storage Unit

(4) Arithmatic Unit

(5) Output Unit

(1) Input Unit: సమస్యను కంప్యూటర్ భాషలోనికి అనువదించి తత్సాధనకు మొట్టమొదట ఉపయోగించే విభాగము Input Unit. ఇది మనం ఇచ్చే సమస్యాసామగ్రిని విద్యుత్ Impulse లుగా మారుస్తుంది.

(2) Control Unit: (i) లో తయారైన ఈ విద్యుత్ Impulse లను అసంఖ్యాకములైన తంత్రీమార్గాలలో వివిధయూనిట్లకు ప్రసారింపచేసే విభాగమిది.

(3) Storage Unit: కంప్యూటర్ బ్రహ్మాండమైన శక్తిని కలిగివున్నప్పటికీ దానికి స్వంతంగా ఆలోచించేశక్తిలేదని చెప్పాము. అయినా మానవాతీతమైన అఖండజ్ఞాపకశక్తి ఉన్నది కంప్యూటర్లకు. ఈ జ్ఞాపకశక్తి స్థావరమే స్టోరేజి యూనిట్.

(4) Arithmatic Unit: కంప్యూటర్ చేసే గణనములన్నీ Arithmatic Unit లో జరుగుతవి. సంఖ్యల ప్రాథమిక గణిత ప్రక్రియలన్నీ ఈ యూనిట్‌లోనే నిర్వహింపబడతాయి. ఈ తతంగమంతా ద్వంద్వాంశ (Binary) సంఖ్యలలో జరుగుతుంది.

(5) Output Unit: లెక్కించడమంతా పూర్తి అయిన తరువాత మనకు కావలసిన ఫలితాలను

విద్యుత్ Impulse లలో ఈ యూనిట్ తెలుపుతుంది. ఈ చిహ్నములను మళ్లీ మన భాషలోనికి అనుపదించుకొని సారాంశాన్ని గ్రహించవలె.

## 5. ద్వంద్వాంశ గణితము

కంప్యూటర్‌కు మనమిచ్చే సమస్యా సామగ్రినంతా ద్వంద్వాంశ గణితములో ఇవ్వవలె. కంప్యూటర్‌కు సంబంధించిన టెక్నాలజీ బాగా అర్థం కావాలంటే ఈ ద్వంద్వాంశ సంఖ్యలను, భిన్నములను గురించి తెలుసుకొందాము. మనకందరికీ తెలుసు, అతిప్రాచీనకాలంలో మనుజుడు లెక్కించేందుకు తనచేతివ్రేళ్లను ఉపయోగించినాడు. అందువల్లనే మనకు 0, 1, 2, 3......9 అనే పది సంఖ్యలు రూఢి అయినాయి. ఈ పది అంకములతో అసంఖ్యాకములైన సంఖ్యాప్రపంచాన్ని సృష్టించవచ్చు. అదృష్టవశాత్తో, దురదృష్టవశాత్తో మనిషికి పదివ్రేళ్లు కాక పదునాల్గు వేళ్లంటే బహుశః మనకు పదునాల్గు అంకెలు ఉండేవేమో! అట్లాగే రెండే రెండు వ్రేళ్లంటే రెండు అంకెలు మాత్రమే ఉండేవి. ఈలాంటి చిత్రమైన ఊహలు గణితజ్ఞులలో ఏనాటినుండో ఉన్నాయి. దాదాపు మూడువందల సంవత్సరాల క్రితం గాట్‌ఫ్రీడ్ లైబ్‌నిట్జ్ (Gott fried Leibnitz) రెండంకెల సంఖ్యాసరళిని ప్రవేశపెట్టాడు.

దశాంశ గణనంలో ఒకట్లస్థానము, పదుల స్థానము, వందలస్థానము, వేలస్థానము......అని అంకెలకు స్థానబలం ఉంది. 1438 అంటే 8 ఒకట్లు, 3 పదులు, 4 వందలు, 1 వెయ్యి కలసిన సంఖ్యఅని మనం అందరం ఎరిగినదే. ఈ పద్ధతి ప్రకారమే ద్వంద్వాంశ సంఖ్యలను నిర్మిస్తాము. దశాంశ సంఖ్యలలో ఏస్థానాన్నైనా 0, 1, 2,...9 అను అంకెలతోనే, ఒక్కొక్కస్థానాన్ని ఒకేఒక అంకెతో నింపుతాము. అట్లాగే ద్వంద్వాంశ సంఖ్యలలో ఏస్థానాన్నైనా 0, 1 అనే రెండు అంకెలతోనే నింపవలె.

435, 345, 543 లు ఒకే అంకెల సమితి [3, 4, 5] తో ఏర్పడిన సంఖ్యలైనప్పటికీ అంకెల స్థానములలో (అమరికలలో) వైవిధ్య మున్నందువల్ల అవి వేర్వేరు సంఖ్యల్ని సూచిస్తాయి. అట్లాగే 1010, 1100, 1001 లు వేర్వేరు ద్వంద్వాంశ సంఖ్యల్ని సూచిస్తాయి.

1438 ని

| $10^3$ | $10^2$ | $10^1$ | $10^0$ |
|---|---|---|---|
| 1 | 4 | 3 | 8 |

అన్న పథకముద్వారా గ్రహిస్తున్నాము. అట్లాగే ఈ కొత్తసంఖ్యలను తదనుగుణమైన పథకంద్వారా గ్రహించవలె. ఉదాహరణమునకు

11 =

| $2^1$ | $2^0$ |
|---|---|
| 1 | 1 |

కాబట్టి ద్వంద్వాంశ సంఖ్య 11, దశాంశ సంఖ్య 3 కు సమానము. 11 ను దశాంశములో పదునొకండు అంటాము. ద్వంద్వాంశములలో ఒకటి ఒకటి అని చదువుదాము. పైన వివరించిన సూత్రాలను పాటించి ఈ క్రింది పట్టీని సులభంగా తయారు చేయవచ్చు.

| ద్వంద్వాంశ సంఖ్యలు | ఉచ్చారణ | తత్తుల్య దశాంశ సంఖ్య |
|---|---|---|
| 1 | ఒకటి | 1 |
| 10 | ఒకటి సున్న | 2 |
| 11 | ఒకటి ఒకటి | 3 |
| 100 | ఒకటి సున్న సున్న | 4 |
| 101 | ఒకటి సున్న ఒకటి | 5 |
| 110 | ఒకటి ఒకటి సున్న | 6 |
| 111 | ఒకటి ఒకటి ఒకటి | 7 |
| 1000 | ఒకటి సున్న సున్న సున్న | 8 |
| 1001 | ఒకటి సున్న సున్న ఒకటి | 9 |
| 1010 | ఒకటి సున్న ఒకటి సున్న | 10 |
| 1011 | ఒకటి సున్న ఒకటి ఒకటి | 11 |
| 1100 | ఒకటి ఒకటి సున్న సున్న | 12 |

ఈలా దశాంశ సంఖ్యలకు సమానమైన ద్వంద్వాంశ సంఖ్యలను, ద్వంద్వాంశ సంఖ్యలకు సమానమైన దశాంశ సంఖ్యలను వ్రాయవచ్చు.

రెండు ఉదాహరణములు పరిశీలిస్తాము.

(1) దశాంశములలోని 18 ని ద్వంద్వాంశ సంఖ్యగా మార్చుట.

నిర్మాణము : 18 ని 2 తో గొలుసు భాగహారము చేయవలె.

2) 18
2) 9 — శేషము 0
2) 4 — శేషము 1
2) 2 — శేషము 0
2) 1 — శేషము 0
0 శేషము 1

శేషముల నన్నిటినీ చివరినుండి మొదటివరకు అమర్చితే 10010 ఏర్పడుతుంది—ఈ ద్వంద్వాంశ సంఖ్య దశాంశములలోని 18 కి సమానము.

ఉపపత్తి :

10010=

| $2^4$ | $2^3$ | $2^2$ | $2^1$ | $2^0$ |
|---|---|---|---|---|
| 1 | 0 | 0 | 1 | 0 |

దత్తసంఖ్య దశాంశ సంఖ్యలలో ఒక $2^4$ అనగా 16
ఒక 2' అనగా 2,

మొత్తము 16+2=18 కి సమానము.

(2) 1110 అనే ద్వంద్వాంశ సంఖ్య ఏ దశాంశ సంఖ్యకు సమానము.

పథకం ప్రకారము :

1110=

| $2^3$ | $2^2$ | $2^1$ | $2^0$ |
|---|---|---|---|
| 1 | 1 | 1 | 0 |

ఒక $2^3$ అనగా 8
ఒక $2^2$ అనగా 4
ఒక $2^1$ అనగా 2, కాబట్టి 8+4+2=14
దత్తసంఖ్య దశాంశములలో 14 కు సమానము.

ఈ ద్వంద్వాంశ సంఖ్యలలో రెండేరెండు అంకములు—0, 1 లు ఉన్నందువల్ల ఏసంఖ్యనైనా బల్బులసాయంతో సూచించవచ్చు. బల్బు వెలిగితే ఒకటి అని, వెలగనప్పుడు సున్నఅని మనం గ్రహించగలిగితే ద్వంద్వాంశ పద్ధతిలో ఏసంఖ్యనైనా ఈ బల్బుల అమరికలలో సూచించవచ్చు.

ఉదాహరణానికి 1010 అనే ద్వంద్వాంశ సంఖ్యను




చే సూచించవచ్చును. ఈ పద్ధతిని ఉపయోగించే కంప్యూటర్ గణనప్రక్రియ జరుగుతున్నది.

(Ⓜ గుర్తు వెలిగే బల్బును O గుర్తు వెలగని బల్బును సూచిస్తాయి.)

ఒక పరిమాణములో కత్తిరించబడ్డ కార్డులను (Punch Cards) తీసుకొని అందు 1 ని సూచించేందుకు బెజ్జమును చిత్రించి, O ను సూచించేందుకు ఖాళీస్థలము నుపయోగించి గణించవలసిన సమస్యాసామగ్రిని పంచ్ కార్డులమీద రచించవచ్చు. ఎంత విస్తృత విషయాన్నైనా ఈ కార్డులపైన చిత్రించి ఉంచుకొనవచ్చు.

## 6 ద్వంద్వాంశ సంఖ్యల ప్రాథమిక గణిత ప్రక్రియలలో పాటించవలసిన ముఖ్య సూత్రములు

1. సంకలనములో 1+0=1, 1+1=10
2. వ్యవకలనములో 1—1=0, 1—0=1, 10-1=1
3, గుణకారములో 1×1=0, 1×0=0×1=1

ఉదా॥ ద్వంద్వాంశములు — దశాంశములు

```
  1011          11
 × 101         × 5
 -----         ---
  1011          55
 1011
 ------
 110111
```

110 111, 55 లు సమానములని చూపుట.

110111

| $2^5$ | $2^4$ | $2^3$ | $2^2$ | $2^1$ | $2^0$ |
|---|---|---|---|---|---|
| 1 | 1 | 0 | 1 | 1 | 1 |

ఒక $2^5$ అనగా 32
ఒక $2^4$ అనగా 16
ఒక $2^2$ అనగా 4
ఒక $2^1$ అనగా 2
ఒక $2^0$ అనగా 1, మొత్తము55కు సమానము.

4. భాగహారము : దశాంశ సంఖ్యలలోవలెనే ద్వంద్వాంశములలో గుణకారమును నిర్వహించితిమి. అలాగే భాగహారమునుకూడా నిర్వహించవలె.

ఉదా॥ ద్వంద్వాంశములు — దశాంశములు

```
101)11110(110          5)30(6
    101                  30
    ---                  --
     101                  0
     101
     ---
       0
```

## 7. ద్వంద్వాంశ భిన్నములు

దశాంశ భిన్నములలో పథకం ప్రకారము

132.12=

| $10^2$ | $10^1$ | $10^0$ | $10^{-1}$ | $10^{-2}$ |
|---|---|---|---|---|
| 1 | 3 | 2 | 1 | 2 |

అనగా ఒక $10^2$
మూడు $10^1$
రెండు $10^0$
ఒక $10^{-1}$
రెండు $10^{-2}$ లు మొత్తము

$100+10+2+1/10+2/100=132.12$

ఇదేపద్ధతి ప్రకారము

101.11 =

| $2^2$ | $2^1$ | $2^0$ | $2^{-1}$ | $2^{-2}$ |
|---|---|---|---|---|
| 1 | 0 | 1 | 1 | 1 |

అనగా దశాంశములలో ఒక $2^2$
ఒక $2^0$
ఒక $\frac{1}{2}$
ఒక $\frac{1}{4}$, మొత్తము $5\frac{3}{4}=23/4$

కాబట్టి ద్వంద్వాంశ భిన్నము 101.11 దశాంశములలో 5.75 కు సమానము.

దశాంశపూర్ణాంకభాగము 5 ద్వంద్వాంశపూర్ణాంకభాగము 101కి దశాంశ భిన్నభాగము .75 ద్వంద్వాంశభిన్నభాగము .11 పరస్పర సమానములు.

కాబట్టి ఒక దశాంశసంఖ్య భిన్నభాగములో ఎన్ని అంకెలుంటాయో, తత్తుల్యమైన ద్వంద్వాంశసంఖ్య భిన్నభాగములో కూడా అన్నే అంకెలుంటాయని దృఢ పరచవచ్చు.

## 8 గణితశాస్త్రాభివృద్ధి - కంప్యూటర్‌లు

ఉపయుక్త గణితశాస్త్రములో కంప్యూటర్ల ప్రయోజన మెంతైనా ఉన్నది. ఖగోళశాస్త్ర పరిశోధనలో కంప్యూటర్‌లు అనిర్వచనీయమైన సాయం చేస్తాయి. శుద్ధగణిత విభాగమైన సంఖ్యాసిద్ధాంతములో (Theory of Numbers) కంప్యూటర్ల పాత్రను కొంత పరిశీలిస్తాము. ఒకానొక సిద్ధాంతమును ప్రతిపాదించి దానికి తార్కికమైన ఉపపత్తిని తక్షణమే ఇవ్వలేక పోవచ్చుగాని ప్రతిపాదనకు మాత్రం సంపూర్ణ సంకల్పసిద్ధి రావలె. ఈ సంకల్పసిద్ధి ప్రయోగాలద్వారా కొన్నిసందర్భాల్లో అలవడుతుంది. సమకాలీనులచే 'గణిత విద్యానిధులలో రాణ్ణందను' అని ప్రశస్తిబడసిన కార్ల్ ఫ్రెడరిక్ గాస్ (Karl Frederich Gauss 1777—1855) అనేక సంఖ్యల స్వభావాలను క్రోడీకరించి విపులీకరించి సిద్ధాంతాలను ప్రతిపాదించి తరువాత వాటి ఉపపత్తులను గూర్చి పరిశోధనలు జరిపినాడు. ఏ సంఖ్యనైనా రెండు ప్రధాన సంఖ్యల (Prime Numbers) మొత్తముగా వ్రాయవచ్చుననే ప్రసిద్ధమైన గోల్డ్‌బాక్ (Gold Bach) ప్రతిపాదన కూడా ఈ కోవకు చెందినదే. ఈ విధమైన కొత్తకొత్త సత్యాల నెన్నో కంప్యూటర్‌ద్వారా సమీక్షించవచ్చు. ఇటీవలన స్వీడన్ దేశములో ఎలక్ట్రానిక్ కంప్యూటర్ ద్వారా గణితజ్ఞులకు తెలిసిన పెద్ద ప్రధానసంఖ్య $2^{3217}-1$ ను కనుక్కొన్నారు. ఈ సంఖ్యలో 967 అంకెలున్నాయి.

ప్రధాన సంఖ్యల అధ్యయనంలో మనం $2^n - 1$ (n ధన పూర్ణాంకము) అనే మెర్సన్నీ (M-rsenne) సంఖ్యలను $2^{2^n} + 1$ అనే ఫెర్మా (Fermat) సంఖ్యలను ఎదుర్కొంటాము. ద్వంద్వాంశ పద్ధతిలో ఈ సంఖ్యలను వ్రాస్తే చాల గమ్మత్తుగా ఉంటుంది. మెర్సన్నీ సంఖ్యలు అన్నిస్థానాల్లో ఒకటిని కలిగి ఉంటుంది. ఫెర్మా సంఖ్యలు 11, 101, 1001, 10001 లాగా ఉంటాయి.

కరణీయ సంఖ్యల రమాగమి విలువలు ద్వంద్వాంశ పద్ధతిలో ఏలా ఉంటాయో పరిశీలించవచ్చు. ఒకట్లతోనే ఏర్పడే ద్వంద్వాంశ సంఖ్యలు దశాంశాల్లో ప్రధాన సంఖ్యలా? ఈ విషయాలన్నీ కంప్యూటర్‌లద్వారా అతిసులభంగా చర్చించవచ్చు.

## 9. ఉపసంహారము

రాను రాను ప్రతిశాస్త్రంలో గణిత పద్ధతుల యాజమాన్యం పెరుగుచున్న ఈకాలంలో శాస్త్ర చర్చలకు కంప్యూటర్ పాత్ర అతిముఖ్యమైనదిగా రూపొందుతున్నది. త్వరలోనే పాశ్చాత్యదేశాల్లోవలె మనదేశంలోకూడ కంప్యూటర్ శిక్షణను ఉన్నత పాఠశాల విద్యార్థులకు ఇస్తారేమో!

సంఖ్యా సిద్ధాంత చర్చలకు కంప్యూటర్ సహాయాన్ని గురించి ఆక్స్‌ఫర్డులో 1969 ఆగస్టు 18 23 తారీఖుల్లో పెద్దసామూహిక చర్చ జరిగింది. ఈ చర్చలను ఏ. ఒ. ఎల్. ఎట్‌కిన్, బి. బె. బిర్చ్‌లు గ్రంథరూపంగా క్రోడీకరించినారు—ఈ గ్రంథాన్ని (434 పుటలు) అకడమిక్ ప్రెస్ (లండన్) వారు '71, జూలైలో ప్రచురించియున్నారు.

---



గ్రంథవిమర్శలు :

# అవతారికలు - చరిత్ర

(కర్త : శ్రీ తేరాల సత్యనారాయణశర్మ. ప్రకాశకులు : విజయభారతీ నిలయం, నల్లగొండ. డెమీ 1/8 పే. 196 లు వెల : రు. 5/- లు)

ఆంధ్ర గ్రంథాలలో అవతారికలు ఆశ్వాసాద్యంతాలూ గద్యలూ చరిత్ర కెంతో సహకారులని చారిత్రకులకే తప్ప సామాన్యపాఠకుల కెక్కువ తెలియదు. శ్రీ శర్మగారు చరిత్రయందు ఉత్సాహముతోపాటు కొంత పరిజ్ఞానము కలిగి స్వతంత్రముగా పరిశోధన చేయగలవారు.

ఈ గ్రంథములో ఎనిమిదిమంది కవుల అవతారికాదులు, కవుల కాలములు విచారణ చేసినారు. వారు గ్రహించిన కవులు (1) పాల్కురికి సోమనాథుడు (2) భాస్కర రామాయణ కర్తలు (3) రంగనాథ రామాయణ కర్తలు (4) మార్కండేయ పురాణకవీ, కృతిపతీ (5) మడికి సింగన (6) గౌరన (7) భైరవకవి (8) కాసె సర్వప్ప.

పాల్కురికి సోమనాథునికాలము (చివరి) ప్రతాపరుద్రునికాల మనువారి వాదమునే బలపరచినారు.

అవతారికయేలేని భాస్కర రామాయణమును ఇందులో గ్రహించుట చిత్రమే ఐనా, తత్కర్తలను గూర్చి ఆద్యంత పద్యాలతో చర్చించినారు.

రంగనాథరామాయణ కర్తృత్వమును గూర్చియు, బుద్ధభూపాలుని తండ్రిపేరు పూర్వ రామాయణములో విఠల భూపతి యనియు ఉత్తర కాండలోవున్న క్షితీంద్రుడనియు వ్యత్యాసముగా ఉండుటను ప్రస్తావించి నిర్ణయములకు పూనుకొనక వదలినారు.

మార్కండేయ పురాణ ప్రస్తావనలో మారన గురువు తిక్కన సోమయాజియనియు, తండ్రి ఎవరో తిక్కనామాత్యుడనియు తెలిపి వదలినారు. కృతిపతియైన గన్నయసేనాని కాకతీయ రాజ్యపతనానంతరము ఇస్లాము మతము స్వీకరించి ఏఏ కామములతో ఏఏ కార్యములు నిర్వహించినదియు వర్ణించినారు కాని అందుకు ఆధారములు కూడా చెప్పియుంటే బాగుండేది. మల్లిక్‌మక్బూల్ ఇత్యాది నామములు ధరించినది మరియొక ప్రతాపరుద్రసేనాని అని కొందరు ప్రసిద్ధ చరిత్రకారులు వ్రాసియుండుటచేత అట్టి ఆధారాలు చెప్పుట అవసరము.

మడికి సింగనకాలము నిర్ణయించుటలో శ్రీ శర్మగారు కొంత వీరత్వము ప్రదర్శించినారు. సకలనీతిసమ్మతము అకాడెమీ ప్రతి పీఠికలో శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు చేసిన కాలనిర్ణయ విధానములోని లోపములు చక్కగా నిరూపించినారు. సింగన తండ్రి అయ్యలు మంత్రి అనపోతభూపాలుని వద్ద మంత్రిగా ఉన్నందున 1357 ప్రాంతమువాడని వీరు చెప్పుచు శ్రీ వెంకటరావుగారు అనపోత భూపాలుని రెండు శాసనములలో అయ్యలుమంత్రి ప్రస్తావము లేనందున ఆ కాలమువాడు కాదనుట ఎంత అసందర్భ వచనమో చక్కగా నిరూపించినారు. మరియు సింగన జ్ఞానవాసిష్ఠములో

'అతడు తిక్కన సోమయాజుల పౌత్రుడై
కొమరారు గుంటూరు కొమ్మ విభుని

పుత్రి జిట్టాంబిక...వివాహమై—అల్లాడమంత్రి' అన్నపద్యములో 'పౌత్రుడై' అని ఉన్నది తప్పని 'ప్రపౌత్రుడై' అని సవరింపవలెనని శ్రీ నిడుదవోలు వారు చెప్పినది కాదని, శ్రీ శర్మగారు కొన్ని ప్రతుల పాఠములనుబట్టి 'పుత్రుడై' అని సవరించవలెననుట కొంచెము నయమే. కాని శ్రీ శర్మ తరమునకు 30

ఏళ్లు అనుచు సోమయాజుల అవసానకాలమనదగిన 1280 నుంచి లెక్కించుటకూడ తమ వాదానికి అనుకూలంగా సరిపుచ్చడమే అవుతున్నది. శ్రీ నిడుదవోలువారు ఆధారపడిన మంగళమహాశ్రీలోని సంవత్సరములో మార్గశిర పంచమి బుధవారము కానంత మాత్రముచేత దానిని పూర్తిగా త్రోసివేయవలసిన దేనా? శ్రీ నిడుదవోలువారు ఆ వారము మాఘ శుద్ధ పంచమికి సరిపోవుచున్నదని చెప్పినది ఆలోచించ వద్దా? చరిత్ర రచనకు ఉపక్రమించువారు ముందు ఒకనిర్ధారణ చేసుకొని అందుకు విరుద్ధమైన అధారాలను తేలికగా త్రోసివేయుట న్యాయముకాదు. ఈ విషయములో శ్రీ నిడుదవోలు వారు చేసిన పొరపాటే శ్రీ శర్మగారును చేసినట్లు భావించక తప్పదు.

గౌరనార్యుడును శ్రీనాథుడును సమకాలికు లన్న వారిని శ్రీ శర్మగారు తీవ్రముగా విమర్శించి నారు. కాని గౌరనకాలము 1356—1425 అని వారే అన్నందున, గౌరనా శ్రీనాథుడూ 40, 50 సంవత్సరములు సమకాలికులని ఒప్పుకొన్నట్లయినది. కాకపోతే శ్రీనాథునికంటె గౌరన ముందు పుట్టి ముందు స్వర్గస్థుడయ్యె ననవచ్చును, అంతేకదా!

భైరవకవి పై గౌరన కుమారుడే అనుటకు శ్రీ శర్మగారు చూపిన ఉపపత్తులు బాగున్నవి.

సిద్ధేశ్వర చరిత్రము వ్రాసిన కాసె సర్వప్పను ఈ గ్రంథములో చేర్చుటకు కారణము శ్రీ శర్మ గారికి చరిత్రకారులయందున్న అభిమానమే అని తోస్తున్నది.

కావ్యాల అవతారికలు ఆద్యంత పద్యాలూ ఉదాహరించుటలో, చరిత్రకు సంబంధించని భాగాలు వదలివేసి ఉంటే గ్రంథ ప్రయోజనానికి భంగం లేకుండా ఈ గ్రంథంలో అనవసర గ్రంథ విస్తృతి ఎంతో తగ్గి ఉండేది. అంతేకాక చారిత్రకాంశాలు పాఠకులకు దృష్టిలో దృఢతరంగా నిలిచేవి.

ఈ గ్రంథంలో నూతనాంశాలు ఏమంత లేక పోయినా, మన గ్రంథావతారికల ప్రాధాన్యము ఆంధ్ర పాఠకులకు గుర్తు చేసినందుకు గ్రంథకర్తనూ, ముద్రణకు సహాయము చేసిన ఆం. ప్ర. సాహిత్య అకాడెమివారినీ అభినందిస్తున్నాము.

## ప్రవర వరూథినీయమ్

(సంస్కృత కృతికర్త: శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, ఆంగ్లానువాదకులు. శ్రీ పిశిపాటి కృష్ణమూర్తిగారు; ప్రకాశకులు: డిటో, 5677, సెంటుమేరీస్ రోడ్డు, సికందరాబాదు. క్రౌను 1/8 పే 611 లు వెల: రు. 1/-)

పెద్దన మనుచరిత్రములోని మొదటి రెండా శ్వాసముల కథను 'ప్రవరవరూథినీయమ్' అను పేర సుప్రసిద్ధకవిపండితవరేణ్యులైన శ్రీ సన్నిధానము వారు సంస్కృతములోనికి స్వేచ్ఛానువాదము చేసినారు. మూలములోని 137 గద్య పద్యములను 109 శ్లోకములుగా అనువదింపబడినవి. కావ్యారంభమునకు ముందు కావ్యమును కృతిపతిని గూర్చిన 10 అవతారికా శ్లోకములును గలవు. వీనినన్నిటిని శ్రీ కృష్ణమూర్తిగారు ఆంగ్ల వచనములోనికి అనువదించి అనువాదము ఎదురెదురు పేజీలలో ముద్రించినారు.

సంస్కృతానువాదమునకు ఒక ఉదాహరణము.

'వండనలయుదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథులేతేర నడికిరేయైనఁ బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ.'

'న తస్య దారా అలసా భవంతి
కదాపి పాకాయ దదత్యజస్రం
భోజ్యం నిశీథేఽ ప్యతిథిభ్య ఇష్టం
స్వబంధుతాయా ఇవ హృష్టచిత్తాః.'

ఇక ఆంగ్లానువాదరీతికి ఈ క్రింది యుదాహరణము లిచ్చుచున్నాము తుదకు ప్రవరుడు శుచియై అగ్నిని ధ్యానించు ఘట్టము.

'న కి మప్యకార్యం ప్రవర
స్తస్యాః స్పర్శేన వాసితం నక్షః

ప్రక్షాళ్యాంబుభిరాచమ్యా
స్తావీ ద్గార్హపత్యాగ్నిమ్.'

'త్వద్రూపేణ ముఖేన నిర్జరగణో
భూక్తే కణేహత్య భో
స్త్వామీశం శ్రుతయఃస్తువంతి
బహుధా త్వం లక్ష్యసేఽంతః స్థితః
విశ్వ స్యాహవనీయ దక్షిణపద
ఖ్యాతాగ్నియుగ్మం భవ
త్వంజాతం గృహదేవతేఽవ భగవన్
స్వాహాస్వధావల్లభ.'

పై రెండుశ్లోకముల ఆంగ్లానువాదము :

'Then pravara, not saying a word in reply to the maiden, cleansed his chest which was polluted by the touch and embraces of Varudhini, took in his hand a little of the holy waters, chanted hymns in praise of the God of fire, invoked and worshipped by every house-holder.'

The multidtudinous Gods in heaven get their sustenance through thee The Srutis praise thee as the Lord of the universe itself. Thou art all-pervading The Ahavaneeya and Dakshinagni too invoke and contemplate upon thee only. O Swaha, the Lord Consort of Swadha, my presiding family deity, save me.'

'తస్యాః స్పర్శేన వాసితం వక్షః' అను దానిలోని వాసితశబ్దము అందము అనువాదములో పోయినది. వక్షమును నీటితో ప్రక్షాళనము చేసినది పోయినది. ఆచమనమంటే చేతిలో కొంచెము నీరుపోసికొనుట కాదన్న మాటకూడ ఎరుగనట్లు అనువదించినారు. గార్హపత్యాగ్ని త్రేతాగ్నులలో ఒకటి అని అనువాద కులకు తోచినట్లులేదు. కాకున్నచో తర్వాతి శ్లోకాను వాదములో ఆహవనీయ దక్షిణాగ్నుల పేర్లు ఇచ్చినట్లే దాని అనువాదమునకు పూనుకొనక గార్హపత్యాగ్ని అని ఇచ్చి ఉండేవారు.

ఇక రెండవదానిలో ముఖ్యముగా చివరి రెండు పాదముల అర్థమును ఏమాత్రమును ఆంగ్లాను వాదకులు అవగాహనము చేసికొనుటకు శ్రద్ధ చూప లేదనుట స్పష్టమగుచున్నది.

ఆహవనీయ దక్షిణాగ్నులు నీనుండి (గార్హపత్యమునుండె) జాతము లైనవని మూలము. త్రేతాగ్నుల స్వరూపము ఏమాత్రము ఎరిగినవారైనను దాని సూక్ష్మము గ్రహింతురు. ఆంగ్లానువాదములో 'అవి రెండును నిన్ను ధ్యానించి ఉపాసించు'ననుట సరికాదు.

అన్నిటికంటె 'స్వాహా స్వధావల్లభ' అను మూలసంబోధనమును 'స్వధాదేవికి భర్తవైన ఓ స్వాహా' అని అనువదించుట ఏమాత్రమూ క్షంతవ్యముకాదు. 'స్వాషావధూవల్లభా' అని పెద్దన ఉపయోగింపగా, శ్రీ శాస్త్రిగారు దానిని 'స్వాహా స్వధావల్లభ' అని మార్చి అనువదించుటలో దోషము లేదు. స్వాహాకారమూ స్వధాకారమూ ఉన్నవి కనుక అగ్నిని స్వాహాస్వధలకు భర్తగా భావించుట యుక్తమే. స్వాహాదేవిని స్వధాదేవికి భర్తగా భావించి పై విధముగా వ్రాయుటచేత, ఆంగ్లానువాదము చదివినవారు పెద్దన కును శ్రీ శాస్త్రిగారికిని ఆచమనము సంగతియు, గార్హపత్యాగ్నికి ఆహవనీయ దక్షిణాగ్నులతోగల సంబంధమును, స్వాహాస్వధాకారముల స్వరూపమును, తెలియదను భ్రాంతికి లోనౌదురు.

మన ప్రాచీన కావ్యాలకూ ఆధునిక కావ్యాలకూ మంచి సంస్కృతానువాదములూ ఆంగ్లానువాదములూ చేయుటకు పూనుకొనవలసిన అవసర మెంతో ఉన్నది.

శ్రీ శాస్త్రిగారు యథాశక్తిగా పెద్దన పద్యాలను సంస్కృతీకరించారు. అందులో పెద్దన కవితలోని మాధుర్యము కొరవడుట వారిలోప మనలేము.

వచనములో వ్రాసిన ఆంగ్లానువాదము బాగుండక పోయినను, అపార్థములతోనైనా ఉండకుండ జాగ్రత్త వహించుట అత్యవసరము. మూలార్థము స్ఫురించకపోతే, శ్రీ శాస్త్రిగారినే అడిగి ఉండవచ్చును, లేక మనుచరిత్ర మూలమైన చదివి యుండవచ్చును. ఈ ఆంగ్లానువాదకులు దీనితో 37 ఆంగ్లానువాదములు చేసి ప్రచురించినట్లు అట్టమీద ప్రకటనవలన తెలియుచున్నది కనుక వారిని ఉత్సాహముతోపాటు జాగరూకత వహించుట అవసరమని ఉద్బోధించు చున్నాము. ఆంగ్లభాషా దోషములు కూడ అక్కడక్కడ కనిపించినవిగాని అచ్చు తప్పులో వ్రాత తప్పులో ఐఉండవచ్చునని సరిపెట్టుకొనుచు, అన్ని విషయములలో శ్రద్ధ వహించుట అవసరమని సూచించుచున్నాము.

## ఊ ర్మి ళ

(కవి : శ్రీ వావిలాల రామమూర్తి : ప్రకాశకులు : సాహితీసమితి, ఒంగోలు : ప్రాప్తిస్థానము : కవి, పి. ఆర్. ఎమ్. ఎచ్. స్కూలు, ఒంగోలు. క్రౌను 1/8 పే. 76 లు వెల : రు. 2-50 లు.)

సీత అడవికేగినను శ్రీరామునితో నున్నది. మాండవీ శ్రుతకీర్తులు వ్రతస్థులైన భరత శత్రుఘ్నులతో నున్నారు. తనకు సర్వస్వమైన రాముని కొలువులో లక్ష్మణుడు 14 సం. లు గడపినాడు. 'పాపము, ఊర్మిళ భర్తృవియోగముతో 14 సం. లు ఎట్లు గడపినదో మరి! వాల్మీకియే ఆమె ఊసెత్తలేదు. మన జానపదకవులు మాత్రము ఊర్మిళాదేవి నిద్రను వర్ణించినారు. ఇట్లు మహాకవులచే విస్మృత ప్రాయురాలైన ఊర్మిళ కథను భావనచేసి శ్రీ రామమూర్తి ఈ కావ్యము రచించినారు.

ఇందులో ఊర్మిళ 7 సం. లు నిర్వికల్ప సమాధిలో నున్నది. అప్పుడు నిజదైవమైన లక్ష్మణుడు ప్రత్యక్షమై అత్తలకు సేవచేయుచుండుమని శాసింపగా అంతటినుంచి ఆ పనికి దొరకొన్నది. మధ్య జనకునిలేఖ. ఇంతలో సీతారామలక్ష్మణులు అయోధ్యకు తిరిగి వత్తురు. ఊర్మిళా లక్ష్మణుల సంయోగము; వారికి అంగద చంద్రకేతులు జనించుట, వారికి ప్రత్యేకముగా రాజ్యప్రాప్తి అవుటతో కావ్యము ముగియుచున్నది.

1. స్థాపన 2. సమాధి 3. సాక్షాత్కారము 4. సిందూరము 5. సేవనము 6. సందేశము 7. సంగ్రామము 8. సామీప్యము 9 సైకతము 10. సౌభాగ్యము అని ఈ కావ్యము పది శీర్షికలుగా విభజింపబడినది. కాని విషయసూచిక (ఆద్యంతములలో తెల్లకాగితములు మిగిలిపోయినను) ముద్రింపబడకుండుటకు కారణము కనబడదు.

కావ్యమంతయు ప్రౌఢభాషలో సాగినది. పండితుల కిష్టమైన—ధిత్సువు—రిరంస మత్స్యండికా—చిరంటి—తోదితచిత్తుడు—ముత్తో—సీమాటి—గోపానసి—శంయువు—శుభంయువు — ఉగ్రాణము— తస్థివాంసుడు — సౌత్ర్యము — చాంద్రీద్యుతులు—వంటి పదములు అప్రయత్నముగా పద్యములలో చేరుచున్నవి.

'సేవనము'లో ఊర్మిళ తన యత్తలకు చేసిన సేవలలో 'బాగలాకు ముడుపుల్ ఘటియించి సితాభ్రఖండముల్ కలిపి విడెంబు కూర్చెడిని'అని వర్ణించినారు. అత్తలప్పుడు విగతభర్తృక లగుటచే తాంబూలము సేవింపరుగాక! మరియు నామె అందరికంటె ముందులేచి 'ప్రహసంతి నొక్కెడ రాజబెట్టు'నని వర్ణించినారు. రాజభవనములలో అత్తలైనను పోయి రాజబెట్టుట ఉండదు. అయినను జానపదుల వర్ణనలలో ఇట్టివి సర్వసాధారణము. జానపదు లభిమానించిన ఊర్మిళను కావ్యవస్తువుగా గ్రహించిన ఈ ప్రౌఢకవి ఇట్టి కల్పనలు పొరపాటునగాక బుద్ధిపూర్వకముగానే చేసియుందురని భావింపదగును.

ఈ కవికి శ్రీ విశ్వనాథవారి కవిత్వమందు గాఢభక్తి ఉండుటచేత వారి కవిత్వచ్ఛాయలును ఇందులో అక్కడక్కడ కనిపించుచుండుట యుక్తమే.

శ్రీ విశ్వనాథవారి సదభిప్రాయముతోకూడిన ఆశీస్సులును ఈ కావ్యమునకు లభించినవి.

ఈ ప్రౌఢకావ్యము శ్రీ రామచంద్రుని కంకితమైనది. ఈ గ్రంథముద్రణకు ద్రవ్యదానముచేసిన ఉప్పలపాటివారిని అభినందించుచున్నాము.

— నోరి నరసింహశాస్త్రి.

## శిలామురళి

[కావ్యము : కవి : శ్రీ ఇంద్రగంటి శ్రీ కాంత్ శర్మ; ప్రచురణ : సురుచి ప్రచురణలు, పవరుపేట : ఏలూరు, 112 పేజీలు; వెల : రూ. 3. మేలుప్రతి : రూ. 4.]

అల్లిబిల్లి ఖండకావ్యాలతో తృప్తిపడని కవికుమారులు కొందరు కథాకావ్యాలకు మళ్లీ ప్రతిష్ఠ సంపాదించ చూస్తున్నారు. కథకూ, కవిత్వానికీ పొంతన అంతగా కుదరదనీ, కవి హృదయంలోని రాగాలాపన ఎటు తీగలు సాగితే అనుభూతిని అటు మళ్లించాలనీ అందుకు కథ అడ్డు వస్తుందనీ తలంచి, ఆవేశం కలిగినప్పుడే కవిత్వం వ్రాయ తలపెట్టి, కవితావేశం చల్లారగానే కావ్యఖండికలను గూడ ముగిస్తున్నారు, మఱి కొందఱు. భావకవులు కథకూ, కవిత్వానికి సంబంధం లేదనీ హృదయాన్ని కదిలించే భావాలను వెల్లడించటానికి కథ ఆలంబనంగా ఉండనక్కరలేదనీ తలంచారు. భావకవిత కొక విధంగా అద్యులైన గురజాడ, రాయప్రోలు పూర్ణమ్మ కథ; తృణకంకణము మొదలైన చక్కని కథాకావ్యాలు వ్రాశారు. మాత్రాఛందస్సులను స్వీకరించి శ్రీశ్రీ, దాశరథి, నారాయణరెడ్డిగారలు కూడ కొన్ని కమ్మనికథాకావ్యాలను వెలయించారు. కవితలో మరింత స్వేచ్ఛనూ, స్వాతంత్ర్యాన్ని కోరిన, ఇతివృత్తంలోనూ, భాషలోనూ ప్రజాస్వామ్యభావాలకు దగ్గరగా వచ్చిన, వచనకవిత్వం మొదట్లో కొంతగా నిసర్గసౌందర్యాన్నీ, క్లుప్తతనూ, ప్రదర్శించి యింపుగొలిపినా వచనకవితా రచనలో ఆరితేరిన శ్రీ కుందుర్తి మళ్లీ కథాకావ్యరచన అవసరమని తలుస్తున్నారు. కథాకావ్యాలు రాకపోతే చదువరులకు మహాకావ్యం చదివిన అనుభూతి కలగటం కష్టమనీ, పరిధి సంకుచితమైపోతుందనీ హెచ్చరించారు. కాని అనుభూతిని ఆవిష్కరించటమే కవిత్వం ప్రధానంగా చెయ్యవలసిన పని అని తలంచిన శ్రీ తిలక్, యింకా మరికొందరూ కథావస్తువును విధిగా అనుసరించవలసివస్తే కవిత్వం పలచబారక తప్పదని వాపోయారు. శ్రీ నారాయణరెడ్డి వ్రాసిన 'జాతిరత్నం' వంటి కావ్యాలను పరిశీలిస్తే స్వేచ్ఛనుకోరే కవుల కవ్యాలకు కథ నిగళబంధనంకాకమానదని అనిపిస్తున్నది. చంపూకావ్యాలలో అంత బాధాకరంగా ఉండక, రసవత్కావ్యాలు వెలువడినప్పటికీ, యీ శతాబ్దంలో వెలువడిన మాత్రాఛందస్సులో వెలువడిన కావ్యాలనూ, వచనకావ్యాలనూ పరిశీలిస్తే చదువరులు కథాకావ్యాలను కోరటంలేదని చెప్పవచ్చు.

సమకాలిక సంఘజీవితంతో సంబంధంలేని 'శిలామురళి'వంటి కావ్యాలను ఛందస్సౌందర్యంకోసము, పదలాలిత్యానికీ అక్కడక్కడా సుకుమార భావుకతకూ సంతసించి చదివినప్పటికీ దీనిని విశిష్టమైన కావ్యంగా మాత్రం యెంచలేరు. 'బౌద్ధనాగరకతకు దేశం భక్తితో తలవంచి మొక్కేకాలం'లో జరిగిన కథ శిలామురళి. వివిధ మాత్రాఛందస్సుల్లో కవి దీనిని కళాఖండంగా మలచటానికి ప్రయత్నించారు. మురళిని వాయించటంలో ప్రజ్ఞావంతుడైన ప్రద్యుమ్నుడు ఇంద్రదమనుని కుమారుడు. పూర్ణవర్మనుని శిష్యుడు. గుణాఢ్యుడనే భ్రష్టయోగి సరస్వతీదేవి హితవచనాలను పెడచెవినిపెట్టి క్షుద్రశక్తులను సాధించి 'వశీకరణంతోటి దేవి పట్టుకుని కట్టాలి' అని తలంచి కొంతకాలం ప్రయత్నించి అవికూడ సరిగా పొందలేక పోతాడు. మూరదాసనే మారుపేరుతో ఇంద్రదమనుని స్నేహితునిగా పరిచయం చేసుకొని ప్రద్యుమ్నుని దగ్గఱగల సంగీతవిద్యను సాధనగా చేసికొని 'మేఘమల్హార్' రాగం ఆలపింప చేసి సరస్వతీదేవిని బంధిస్తాడు. ప్రద్యుమ్నుడు తన

ప్రాణసఖియైన సునందకు నచ్చజెప్పి, పూర్ణ్ణవర్ధ్మనుల ఆశీస్సులుపొంది గుణాఢ్యుని వెదకటానికి బయలు దేరుతాడు. బందీయైన భారతీదేవిని చూచి, అక్కడే వేచి ఉండి గుణాఢ్యుడు రాగానే అతడిని శిక్షించ టానికి మారుగా దేవిని విడిచి పెట్టమని ప్రార్థియ పడతాడు· గుణాఢ్యుడు పశ్చాత్తప్తుడై తా నమభ వించిన మనోవేదనను తెలియజెప్పి తన గురువుదగ్గర తెచ్చిన మంత్రజలం దేవిపాదాలపై చిలికిస్తే దివ్య సీమలలోకి ఆమె పయనిస్తుందని, కాని అవిధంగా చిలకరిస్తే శిలామూర్తిగా మారిపోతాననీ తనకా ధైర్యంలేదనీ చెప్పి విలపిస్తాడు. ప్రద్యుమ్నుడు త్యాగం చెయ్యటానికి కృతనిశ్చయుడై ఆ జలాన్ని గుణాఢ్యుడి నుండి స్వీకరించి

'మెరవువలె ఆదేవి మిన్నెక్కి విహరించి
మృదు మధుర రాగాల కళలలో తేలాలి !
మూగవోయిన కవుల వాక్కులో ఉరమాలి !
తీగగా శిల్పి హస్తాలలో తిరగాలి !'

అని సరస్వతీ భక్తునిగా తన కర్తవ్యం నెరవేర్చి శిలగా మారిపోతాడు. విషాద మధుర కావ్యమిది. నేటి పాఠకులను యీ కథ ఆకర్షిస్తుందని చెప్పటం కష్టం. కాని శ్రీకాంత్ శర్మగారి లేఖిని మాత్రా ఛందస్సులలో ఎన్నెన్నో అందచందాలను వెలయించింది. సుకుమారమైన భావుకత, దానికితగిన లయవిన్యాసం, ప్రకృతిసౌందర్యోపాసన యీ కావ్యానికి వన్నె పెట్టాయి.

ప్రద్యుమ్నుడు మురళి వాయించే ప్రదేశంలోని అడవిని వర్ణిస్తూ

'ఆమూల నొకకూత, ఈమూల నొకకూన
అడివి తీగలమీద జలజలా విరివాన
పిట్టవరిగిడుతుంది, పూవు అరవిడుతుంది
అట్టహాసంతోటి అడవి మేల్కొంటుంది.'

అని చెప్పి మనోజ్ఞమైన దృశ్యకల్పన చేశారు. ప్రద్యుమ్నునికై ఎదురుచూచే సునంద

'ఆతడురానీ, రాకపోనీ, ఆది వేరు
సతతమూ అతనికై బ్రతుకు అర్పిస్తాను !
మేఘమల్హారాన మెరుపునై పోతాను !
మెరపునై, తలపునై, మెరిసిపోతానంతె !

అనుకుంటుంది. వియోగ బాధ ననుభవించే సునంద తలంపులను రమణీయంగా చెప్పారు. ఆమె నిరీక్షణ విఫలంకాగా 'రిక్తపాత్రిక గుండె ఆమెకిక మిగిలింది' అని వర్ణించి ఆ సన్నివేశాన్ని రసవంతంగా ముగించారు. కథను నడిపించటానికీ కవిత్వాన్ని పలచ బారచేసికొని శుష్కవచనగా సాగిన పాదాలుకూడ యీ కావ్యంలోమనకు కన్పిస్తాయి. కాని ఎక్కడో ఒకతలపు

'ఆకుపచ్చ చీకటితో
అడవి అవులిస్తున్నది—'

వంటివి మెదిలి ఆ నీరస వచనాన్ని రసమయం చేసివేస్తాయి.

'వడగాలి సురిగింది, సుడిగాలి తిరిగింది
పండుటాకులవెంట పరుగెత్తి పోయింది
మిన్నేటి ఒడ్డుపై గున్నఏనుగు మబ్బు
మెల్లగా కరమెత్తి ఆనీరు చిమ్మింది.'

ఇటువంటి పాదాలలోని రచన కవి ప్రతిభా వంతుడని నిరూపిస్తుంది. శబ్దశక్తిగల యీ కవి తన ప్రతిభకు తగిన వ్యుత్పత్తి కలవారే. ఇక అభ్యాసం విషయానికి వస్తే వివిధ పత్రికలలో ప్రకటింప బడిన రచనలవలన లబ్ధప్రతిష్ఠుడు. ఈ కవి కుమారుడు సుప్రసిద్ధకవి ఇంద్రగంటి హనుమ చ్ఛాస్త్రిగారి కుమారులు. వారికే యీ 'శిలామురళి'ని అంకితం చేశారు.

వర్తమానసామాజికేతివృత్తాన్ని స్వీకరించి శ్రీ శ్రీకాంత్ శర్మ మాత్రాఛందస్సులలో మరికొన్ని వెలుగు కంబాలను నిలుపగలిగితే బాగుంటుంది. ఈ కావ్య సౌందర్యానికి వీరు స్వీకరించిన కథ భంజకంగా నిలిచిందని మాత్రం చెప్పక తప్పదు. ప్రకృతి వర్ణనలను ఆస్వాదించటానికీ, మాత్రాఛందస్సులో శ్రావ్యమైన లయవిన్యాసాన్ని అందించే రచనకోసమైనా యీ కావ్యాన్ని చదివి ఆనందించవచ్చు.

## త్రివేణి

(కవితాసంకలనం; కవులు; ప్రభంజన్; శాంతమూర్తి; భావశ్రీ; నిర్వహణ: స్పందనసాహితి; హైదరాబాదు; ప్రతులకు: అంచల లక్ష్మీనారాయణ 8—2—22/బి పంజగుట్ట, హైదరాబాదు—4; 60 పేజీలు; వెల. ఒక రూపాయి.)

విరివిగా వెలువడుతున్న వచనకవితా సంకలనాలలో ఇదొకటి. ప్రభంజన్, శాంతమూర్తి, భావశ్రీ అను ముగ్గురు కవుల రచన లిందులో ఉన్నాయి. సాంకేతికవిద్యలో ఉత్తీర్ణులయి యంత్రకర్మాగారంలో పనిచేస్తూ సాహిత్య రచనాభిలాషతో రచించిన గీతాలిందులో ఉన్నాయి. వీరి వచనగీతాలలో కవిత్వం ఒలికిన పద్యపాదాలు చాల తక్కువ. ఉపన్యాస ధోరణిలో 'ప్రభంజన్'

'కార్మికులారా కదలండీ
కలిసి కట్టుగా కదలండీ
మనలో భేదం వలదండీ
మంకుపట్టును వదలండీ'

అని ఉద్బోధించే రచనలేతప్ప ధ్వని ప్రధానమైన రసవంతమైన గీతాలు తక్కువ.

'నలుగురు నాలుగును మూడంటే
నలుగురితో నువ్వు మూడేఅను
మూడనకపోయావా నీకు మూడినట్లే—

ఇటువంటి రచన చదవగానే 'నేడు జరుగుతున్న న్యాయం' ఏదైనప్పటికీ పై రచనపట్ల మాత్రం సదభిప్రాయం కలుగదు. 'అభ్యుదయం మునుగులో' అనే గీతం అక్కసుతో ఎవరినో తిడుతున్నట్లుగా ఉన్నదే గాని కవిత వ్రాసినట్లులేదు.

'అడ్డంగా పెరిగిపోయిన
అవినీతి కీకారణ్యం
కలం కత్తితో ఖండిస్తాను
అభినవపరశువు నౌతాను'

అని ప్రభంజన్ ప్రతిజ్ఞ చేశారేగాని వీరి గీతాలలో 'మంచికవిత్వమిది'అని చెప్పటానికి వీలైనవి, ఉదాహరించటానికైనా దొరకటంలేదు.

'శాంతమూర్తి' 'ఫలానా కవిత్వం రాయాలి అనుకోకపోయినా ముందుగా మంచికవిత్వాన్ని సాధించటానికి ప్రయత్నిస్తున్నాను'అని చెప్పకొన్నారు. ఆ సాధనమాత్రం స్ఫుటంగానే కన్పిస్తున్నది. జీవితాన్ని నీటిబుడగతో పోల్చి

'ఈ నీటిబుడగలో
ఎన్నెన్నో బంధాలు
వచ్చిపడినవి కొన్ని
తెచ్చుకొన్నవి కొన్ని!'

అని చక్కగా పలికారు. అంతేగాక

'వెలుగుదారుల వెదకి
దీపకళికను చేరి
వెలుగులో బ్రతకాలి!!'

అని సంకల్పంగూడ చెప్పకొన్నారు.

'పరుగుతీస్తున్న బస్సు' పాఠకులను ఒక్కఉదటున చదివించే రచన. పఠనయోగ్యత తప్ప చిరస్మరణీయమైన భావమేమీ యిందులో లేదు. వీరు సంప్రదాయాన్ని అమృతంగా ఎంచి, దానిని ఒలకబోయవద్దని హితవు చెప్పారు. 'వాన చినుకులు' అనే వీరిగీతం శ్రీ కుందుర్తి వ్రాసిన 'నగరంలో వాన'కు పూర్తిగా అనుకరణ.

భావశ్రీ 'పాతలోని తేట తెల్సుకొని, కొత్తలోని చెత్త వదలుకోవాల'ని తలంచారు. నవకవితకు ఆకలి మంటలనే భావాలుగా గ్రహించి 'నవకవిత' అనే గీతంలో దాని స్వరూపాన్ని వివరించటానికి పూనుకొన్నారు. కాని వీరి పద చిత్రాలు ఒకదానికొకటి పొంతన లేకుండా, నవకవిత అంటే కలగాపులగపు భావాలేనని వీరు సమర్పించిన ఊహలవలన ఒక తేలిక అభిప్రాయం కలుగుతున్నది. 'నాయకుడు కావాలి' అని వీరెంతగానో సాగదీసి వ్రాసిన గీతం 'శ్రీశ్రీ పలికిన నేతృత్వ దరిద్రమైన దేశం' అన్నభావాన్ని పాడిగిస్తే వచ్చినట్టిది. ఈ గీతంలో వచనమేగాని

గీతమనదగన దేమిలేదు. 'మేఘసందేశం' అన్న వీరి గీతం చమత్కారంగా వర్తమాన కాలాన్ని ప్రతి బింబించేదిగా ఉన్నది. వీరు వ్రాసిన 'జీవితం రైలు బండి' ఆరుద్రగారి కవితకు అనుకరణేననీ, అదీ పేలవంగా ఉన్న అనుకరణయేననీ చదువగానే అవి పిస్తుంది. 'ఒకటీ రెండూ.. ఇరవై రెండూ' అనేది స్వాతంత్ర్యం వచ్చిన ఇరవై రెండేళ్ల తరువాత దేశ స్థితిగతులను సింహావలోకనం చేసింది.

ప్రభంజన్, శాంతమూర్తి, భావశ్రీ ముగ్గురు కవులలోను ఉత్సాహం ఉన్నంతగా కవిత చెప్పగలిగిన ప్రతిభ కానరావటంలేదు. యంత్రకర్మాగారంలో పని చేస్తూ రచనాభిలాష కలిగి ఉండటం మాత్రం మెచ్చదగినదే. సాధనతో ముమ్ముందు వీరు రసవత్కవిత వెలయిస్తారేమో వేచి చూడాలి. ఇప్పటి 'త్రివేణి' మాత్రం వచన కవిత్వపురాశిని పెంచేదేగాని గుణాన్ని పెంచేదికాదు.

## రామచంద్ర విజయము

[నవల; రచన: చిలకమర్తి లక్ష్మీనరసిం హము; ప్రచురణ ; ఎమెస్కో పాకెట్‌బుక్స్, మచిలీ పట్నం : మద్రాసు : సికింద్రాబాదు : 138 పేజీలు; వెల : రూ. 2.]

19 వ శతాబ్దం ఉత్తరార్థంలో, ఆంధ్ర జాతి గర్వింపదగిన మహా రచయితలూ, దేశభక్తులూ ఎందరో జన్మించారు. వారిలో సుప్రసిద్ధులైన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు బహుముఖ ప్రతిభావంతులు. గయోపాఖ్యానము మొదలైన నాటక ములు వ్రాసిన కవిగా, గణపతి, రామచంద్ర విజయము, కర్పూర మంజరి, సౌందర్యతిలక మొదలైన ఉత్తమ నవలల రచయితగా, హాస్యపూరితమూ, కనపడకుండ గాయపరచి మూఢనమ్మకాలను, అవినీతిని మనస్సులో నుండి క్షాళనంచేసి, హితవుచెప్పే వ్యాసరచనతోను 'అన్నీ ఒకయెత్తు వారి స్వీయచరిత్ర మరొకయెత్తు' అని చెప్పదగిన స్వీయచరిత్ర రచనా వారి బహుముఖ ప్రతిభకు కొన్నికోణాలు మాత్రమే. దేశభక్తి ఆయన ఊపిరికాగా రచనలో ఆచితూచి చెప్పిన ప్రతిమాటా జాతిక్షేమాన్ని ఆశించి చెప్పినదే. కవిగా గయో పాఖ్యానము, హాస్యరచయితగా గణపతి, ఇంకా వారి ప్రహసనాలు ఆయన కీర్తిని అన్ని దిక్కులకూ కొని పోయినా, చక్కని ధారాశుద్ధి గలిగిన వచన రచనతో, సమకాలిక సంఘజీవితాన్ని ప్రతిబింబించే ఇతి వృత్తాలలో కూడిన నవలలను కూడ విశిష్ట మైనవిగా యెంచవచ్చును.

శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు సాహిత్య ప్రక్రియలలో మేలిరకం విత్తనాలను అందిస్తే, ఆయాప్రక్రియలలో మేలిరకపు ధాన్యాన్ని పండించిన కృషీవలుడు శ్రీ చిలకమర్తి. నవలా రచనను ప్రోత్స హించే ఉద్దేశ్యంతో వీరేశలింగంగారు ఏర్పఱచిన పోటీలో పాల్గొని చిలకమర్తివారి రామచంద్ర విజయం బహుమతి పొందినది. సమాసబంధురమై, క్లిష్టవర్ణనలతో కూడిన ఏచారిత్రకేతివృత్తమో తీసుకొని నవలా రచనను సామాన్యులు చదువుకొన టానికి వీలులేకుండ తయారు చేస్తున్నరోజుల్లో, వ్యాకరణ నియమాలను ఉల్లంఘించకుండానే సులభ మైన, ధారాళమైన వచనరచనతో సంఘజీవితాన్ని కన్నులకు కట్టించటం 'రామచంద్ర విజయం'— నవల ప్రత్యేకత. మాచిరాజా రామచంద్రుడనే యువ కుడు ఆశ్రయం వెదుక్కుంటూ అమలాపురం చేరు కుంటాడు. అతడి దగ్గఱ ఏభై రూపాయలు ఖరీదు చేసే మురుగులూ, పాతికరూపాయలు విలువచేసే తమ్మంట్లూ ఉంటే వాటిని అమ్ముకొని పూటకూటి యింట ఉండి చదువుకొనవలయు ననుకుంటాడు. ఒకఏడాది గడచిన తరువాత ఉద్యోగస్థుల పిల్లలకు పాఠాలుచెప్పి తన సంపాదనచేతనే చదువుకొన సాగించగలననుకుంటాడు. కాని అతడు వస్తూనే శోభనాచలమనే నియోగి బ్రాహ్మణుని వంచనకు గుఱియౌతాడు. తానే ఆశ్రయమిచ్చినట్లు నటించి మోసమే వృత్తిగా పెట్టుకొన్న శోభనాచలం రామ చంద్రుడి ధనంఅంతా హరించి రామచంద్రుణ్ణి అవ మానాలకు గురిచేస్తాడు. పూటకూటియింటి రాజమ్మ

చెంబు, పట్టువంచ స్వాధీనంచేసుకొని మరీ వెళ్ల గొడుతుంది.

రామచంద్రుని సహాధ్యాయి రాజగోపాలము తన ఇంటికి తీసుకొనివెళ్లి తండ్రి శరభరాజుగారితోచెప్పి తమ యింట ఆశ్రయమిస్తాడు. శరభరాజు దంపతులు రామచంద్రుని పుత్రవాత్సల్యంతో చూస్తారు. శరభరాజుగారి దూరపుబంధువు వేంకటరత్నం వ్యసనపరుడై తాను చేసిన దొంగతనాలు, ఆకతాయిపనులూ అన్నీ రామచంద్రంపైనే రుద్దుతాడు. ' చివరకు వేంకటరత్నం గుట్టు బయటపడి ధర్మం జయిస్తుంది. రామచంద్రుని అనుమానించి, అవమానించినవారంతా పశ్చాత్తప్తులై అతడిని గౌరవించి, తమవాడినిగా స్వీకరిస్తారు. శరభరాజుగారి బంధువు శంకరరావుగారు తమ కుమార్తెను రామచంద్రునకిచ్చి వివాహం చేస్తారు. ఈ కథలో చల్లా రాధాకృష్ణశర్మగారు చెప్పినట్లుగా 'సత్ప్రవర్తన, సత్యనిరతి, కార్యదీక్ష, కష్టసహిష్ణుత మొదలైన సద్గుణాలు సాధించిన విజయమే రామచంద్ర విజయమనవచ్చు.'

నేటి నవలల దృష్టితోచూస్తే 'రామచంద్ర విజయం'లో నవలాశిల్పం విశిష్టమైనదేమీకాదు. భాషకూడ వాడుకభాషకు సన్నిహితంగా ఉన్నప్పటికీ, చిలకమర్తివారి నవలలను అనుకరించే ప్రయత్నం యువరచయితలు చెయ్యటంలేదు. నవలాశిల్పంలో ఎంతోమార్పు కనిపించినట్లే సమకాలికసంఘటనలను నవలా రచనలో జొప్పించటమేగాక నేటి నవలలో మనస్తత్వ పరిశీలన; పాత్రచిత్రణలో కేవలమూ మంచివాళ్లను, చెడ్డవాళ్లను వేర్వేరుగా చిత్రించేపద్ధతి మారి మంచిచెడ్డలు కలిసినవారే మనుష్యులనియెంచి మనస్తత్వ చిత్రణకే అధికప్రాధాన్యమియ్యటం ఇప్పటి రచనలలో కన్పిస్తున్నది.

మహారచయితల ఉత్తమ గ్రంథాలలో ఏ ఒకటి రెండింటినోగాక చిలకమర్తివారివి ఇప్పటికే గణపతి, ప్రహసనములు, రామచంద్ర విజయం ప్రచురించిన ఎమెస్కోవారిని ఎంతైనా అభినందించాలి. చిలకమర్తివారి మిగిలిన నవలలనుగూడ సారస్వతాభిమానంతో సరసమైన వెలలకు ఎమెస్కోవారు ప్రచురిస్తే బాగుంటుంది.

## దానకంకణము

[కావ్యము; రచయిత : గోటేటి షట్చక్ర సీతారామస్వామి; ప్రతులకు : శ్రీ .జి. జి. యస్. భూషణరావు; ఏనుగువానిలంక (వయా) నర్సాపురం: పశ్చిమగోదావరిజిల్లా; 60 పేజీలు; వెల : రూ. 1—50 పై.]

సాంప్రదాయిక పద్ధతిలో పురాణేతివృత్తాలను గైకొని కావ్యాలు వ్రాస్తున్నవారు తగ్గిపోతున్నప్పటికీ, సంప్రదాయం ఎప్పటికీ నిలిచి ఉంటుందనే నమ్మకంతో ప్రాచీన పద్ధతులను ప్రేమించే వారికోసం కావ్యాలను వ్రాసేవారు వ్రాస్తూనే ఉన్నారు. శ్రీ గోటేటి షట్చక్ర సీతారామస్వామి వ్రాసిన 'దానకంకణము' కర్ణుని దానవీరాన్ని వర్ణించే కావ్యం. మహాభారతంలో లేకపోయినా కర్ణుని వితరణబుద్ధిని చాటిచెప్పే కథను ఆధారంగా వీరీ కావ్యాన్ని వ్రాశారు. దానకర్ణుని దాతృత్వాన్ని ప్రజలంతా ప్రశంసించటం విని, అతడి ప్రాణసఖుడైన దుర్యోధనుడు చాల అసందిస్తాడు. కాని శకుని చెప్పిన చెడ్డమాటలు విని, దుశ్శాసనుని ప్రోద్బలంతో 'కంకణధారణ' చేసి దానము లియ్యటానికి పూనుకొంటాడు. కాని శ్రీకృష్ణుడు దుర్యోధనుని వితరణబుద్ధి కర్ణుని వంటిది కాదని నిరూపించటానికి బ్రాహ్మణవేషంలో వచ్చి; యజ్ఞంకోసం కట్టెలు కావాలని దుర్యోధనుని యాచించి వాగ్దానం చేయించుకొంటాడు. యజ్ఞం చేసేముందుగా వచ్చి తీసుకొని వెళ్తానని చెప్పి, బాగా వర్షం కురుస్తున్నప్పుడువచ్చి తనకిచ్చిన వాగ్దానం సంగతి జ్ఞాపకం చేస్తాడు సుయోధనుడు కట్టెలియ్యటం సాధ్యంకాదని చెప్పి, అందుకు బదులుగా ఎన్నిగోవులైనా ఎంతధనమైనా తీసుకొని వెళ్లమని చెప్తాడు. కాని ఆ బ్రాహ్మణు డలిగి, అక్కడనుండి

కర్ణుని చెంతకు వెళ్లి యజ్ఞంకోసం కట్టెలు కావాలని యాచిస్తాడు. కర్ణుడు మరో ఆలోచన చెయ్యకుండా ఆతడికోరిక చెల్లించటానికి ఆయుధాగారంనుండి విల్లు, అమ్ములు తెప్పించి, తన ధనుర్విద్యాకౌశలంతో తన సౌధంలోని దారువులను కుప్పగాకూల్చి, ఆ దారువుల స్థానంలో తన బాణముల నిల్పి, ఆ దారువులను మైనపుగుడ్డలో కప్పించి, బ్రాహ్మణునికి అందజేస్తాడు. ఆ బ్రాహ్మణుడు దుర్యోధనుని నిందించుటను వారించి, కర్ణుడు తానిచ్చిన దారుసంపద అంతా దుర్యోధన మహారాజా ఇచ్చినదేనని, తాను సంధానకర్తను మాత్రమేనని చెప్పి, సుయోధన మహారాజునే 'దానిఫలితనేత'గా వెలయింపగోరుతాడు. ఈ సంగతితెలిసి సుయోధనుడు కంకణమును విడిచి కర్ణునితో ఎప్పటివలెనే సఖ్యతను పొందుతాడు. కర్ణదుర్యోధనులలో ఎవరెంతటిదాతలో వెల్లడి అవుతుంది.

లోకంలో బాగా ప్రసిద్ధిపొందిన యీ కథను తీసుకొని కావ్యంగా వ్రాయటంలో షట్చక్ర సీతారామస్వామిగారు సులువుగా అర్థమయ్యే రీతిలో పద్యాలను వ్రాసి, కుంటువడని శయ్యతో కథనాన్ని నడిపించారు.

'సరస కర్ణరసాయనము'గా యీ కావ్యాన్ని వ్రాయతలపెట్టారు. కాని వీరి కావ్యంలోని పద్యాలు అంతగా కర్ణరసాయనంగాలేవు. వచనంలో చెప్పదగిన సాధారణభావాలను ఛందస్సులో చెప్పినంతమాత్రాన కవితాభావంకానిది కవిత్వమనిపించుకోదు. పద్యం చెప్పటం వీరికి సులువు. కాని భావుకశక్తి అంతగా కన్పించదు. కావ్యం ఒకసారి చదివినతరువాత మళ్లీ మళ్లీ చదవాలనిపించే పద్యాలుగాని, కావ్యఘట్టాలుగాని లేవు. దుర్యోధనపాత్ర నీ కావ్యంలో చక్కగా పోషించారు. ఆయన గుణములకు మఱింత వన్నెపెట్టారు. పశ్చాత్తప్తుడైన దుర్యోధనుడు

'తిమిరహరుఁడైన మిత్రుని దీటువచ్చు
మిత్రు ప్రభ నేడు వౌని పవిత్రయజ్ఞ
మాపుటను గెల్గనట్టి సంతాప తిమిర
నాశమొనరించి మోదంబు నా కొసంగె'

నని తలంచి 'దానప్రజ్ఞకు నర్హుడైన మన రాధాపుత్రుఁ డొక్కండె సంధానింపదగు దానకంకణము, అని మనస్ఫూర్తిగా విశ్వసిస్తాడు.

కర్ణుడు దుర్యోధనుని ప్రాభవాన్ని కీర్తిస్తూ

దానపదార్థ నేతలకు దానఫలంబది చెందుగాన నీ
దానము రాజరాజకృతదానముగా ప్రకటించు టొప్పు, సం
ధాన మొనర్చినంతటనె దాతనె? చంద్రుని శోభ కంతకున్
భానుని కాంతిమూలమను ప్రస్ఫుట సత్యము నెంచి చూడుడీ!'

అని పలికిన పద్యం యీ కావ్యంలో శ్రేష్ఠమైనది.

మూలభారతంలో లేకున్నా లోకప్రసిద్ధమైన కథను ఛందస్సులో చదువగోరేవారు యీ కావ్యాన్ని చదువవచ్చు. కావ్యంలోకథ చక్కనిగమనంతో నడిచింది. కథ చెప్పటానికి కావలసిన శైలి వీరికి ఉన్నది. కావ్యమునకు చివర కర్ణుని చరిత్రను 'మంజరిలో' రచించి అనుబంధంగా చేర్చారు. ఇదికూడ చదువతగినది.

అరవై పేజీల కావ్యానికి మూడు పేజీల తప్పొప్పుల పట్టిక వుంది.

—రామ మోహనరాయ్.

# ప్రభావతీ ప్రద్యుమ్నము

ఇది పింగళి సూరనార్యుని రచన. ఇతడు కళాపూర్ణోదయము—రాఘవపాండవీయము మున్నగు కావ్యాలను రచించినాడు. 'కళాపూర్ణోదయము'నకు వచ్చిన ఖ్యాతి తెలుగు సాహిత్యానికొక గర్వకారణం. కథ చెప్పటంలో కవి చూపించినమార్గం నూతనమైనది. కళలకు పరిపూర్ణత్వం కల్పించి 'కళాపూర్ణోదయం'గా తయారుచేసాడు సూరన. అష్టదిగ్గజ కవులలో ఒక

డుగా నున్నట్లు జనశ్రుతి వుంది. ఈ విషయం ఇప్పటికీ విమర్శకులమధ్య సందేహంగానే మిగిలి పోయింది. ఈ ప్రభావతీప్రద్యుమ్నమే సూరన తుది రచన. దీనిని తన తండ్రియగు అమరనామాత్యున కంకితము చేసియుండెను.

కావ్యమునందు 'శుచిముఖి'—ప్రభావతి ప్రధాన స్థానాన్ని ఆక్రమించారు. సామాన్యముగా సూరన పురుషపాత్రలకంటె స్త్రీ పాత్రల కధికమగు ప్రాధాన్యాన్ని యిచ్చాడు. కథనుబట్టి 'శుచిముఖి ప్రజ్ఞామూర్తిగా దర్శనమిస్తుంది. ప్రభావతి ప్రణయమూర్తి. ఈమెముందు శుచిముఖి ప్రదర్శించిన ప్రజ్ఞ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

శ్రీ కృష్ణుడు 'శుచిముఖి' తెలివితేటల కబ్బురపడినాడు. ఈమెయందు వాక్నైపుణ్య మధికము. తన తెలివితేటలచే ఎంతటికార్యమునైనను అవలీలగా సాధించేది. ఇతరుల కష్టాలను తొలగించాలని ప్రయత్నించి ఫలితం పొందింది.

పాత్ర చిత్రణలో పింగళి సూరనార్యుడు తన రచనా సామర్థ్యమును నిరూపించెను. పాత్రల చిత్తవృత్తులను ప్రదర్శించుటలో మేటి యనిపించుకొన్నాడు. తన కావ్యములు ప్రజ్ఞాప్రతీకలు.

## మొల్లరామాయణము

ఆంధ్ర వాఙ్మయంలో కవయిత్రులు చాల తక్కువ. వారిలో మొల్ల మొదటి కవయిత్రి. తరువాత నాయకరాజయుగంలో మధురవాణి, రామభద్రాంబ—తిమ్మక్క మున్నగువా రవతరించి రచనకు పూనుకొన్నారు. ఉభయభాషల్లో పాండిత్యము గడించి కవిత్వము చెప్పగల సామర్థ్యాన్ని సంపాదించుకొన్నారు. ఆ యుగంలో వారు పొందిన గౌరవం అపూర్వమైంది. కనకాభిషేకం కవయిత్రికి కలగటం ఆ యుగవిశేషంగా అనిపిస్తుంది. తంజావూరు నాయకరాజుల యుగానికి ముందు రచయిత్రి ఉన్నారంటె మొల్ల ఒక్కతే కాన్పిస్తుంది. ఈమె 'కేసనసెట్టి' కుమార్తె యని ఆశ్వాసాంతమందున్న గద్యంవల్ల తెలియుచున్నది.

సంస్కృతంలో వాల్మీకి 'రామాయణము' వ్రాసినతరువాత చాల రామాయణములు ప్రపంచ భాషల్లో వచ్చాయి. రామాయణమునకువచ్చిన ప్రశస్తి భారతమునకుకూడ రాలేదు. ఈ రెండు కావ్యాలు జనుల మానసములను కరిగించి కన్నీరు చిందించి ముక్తిమోక్షాలకు దారి చూపాయి. రామాయణము కరుణరసమునకు ప్రాధాన్యము కల్పిస్తే భారతము వీరరసమునకు ప్రాధాన్యం కల్పించింది. కరుణరస ప్రతిపాలితమైన రామాయణం మొల్ల చేతుల్లో తీగలు సాగి కన్నీరు పెట్టిస్తుంది. స్త్రీ సహజమగు శక్తి నంతయు మొల్ల వ్యక్తంచేయగలిగింది. తను వ్రాసిన రామాయణమునకు ఆధారమును వివరింపక వర్ణప్రభావం చేత ఈ కావ్యరచన అలవడినట్లుగా పేర్కొన్నది.

మొల్ల కొన్నికల్పనలు గావించింది. ఆయాకల్పనలవల్ల కవయిత్రియొక్క కల్పనానైపుణ్యం వ్యక్తమవుతుంది. గుహుని అమాయకత్వమును సుకుమారంగా వివరించింది. అంతేగాక రామునియందుగల మూఢ భక్తి వ్యక్తమైంది. ప్రతిపాత్రలో మొల్ల తన సహజ కవితాశక్తిని ప్రదర్శించింది.

ఈమె కావ్యంలో దేశీయపదములకు ప్రాముఖ్యం యిచ్చింది. వర్ణనలు చేసినను సామాన్యపాఠకునకు కూడ అవగతమగురీతిలో ఆయావర్ణనలు వున్నాయి. హృదయమార్దవము—తన్మయీభావము_ఈ కావ్యపఠనం వల్ల కలుగుతాయి.

## వైజయంతీ విలాసము

ఈ కావ్యము విప్రనారాయణుని గురించి వివరించునది. దీనిని సారంగు తమ్మయ్య వ్రాసినాడు. ఇతనికంటె ముందుగా కొందరు కవులు విప్రనారాయణ చరిత్రమును వ్రాసియుండిరి. తమ్మయ్య తన కావ్యమునకు 'వైజయంతీ విలాసము'ని పేరుపెట్టెను.

విప్రనారాయణుడు రంగనాథుని భక్తుడు. భక్తి తత్పరత కల్గినవాడు. జితేంద్రియుడు. నిష్ఠాగరి

ష్టుడు. ఇట్టివానిని దేవదేవిపందెమువేసి వ్రతభంగము గావించి విటునిగా చేసినది. విప్రనారాయణుడు భ్రష్టుడైనాడు. విప్రనారాయణునిపై ఆరోపణలు చేయబడ్డాయి. అవి న్యాయస్థానమున నిరూపితం కాలేదు. అతడు నిర్దోషియని తెలిసినపిమ్మట ఘన సత్కారము జరిగింది. చివరకు రంగనాథుడు ప్రత్యక్షమయ్యాడు. విప్రనారాయణుడు గొప్పభక్తుడుగా కీర్తింపబడ్డాడు. దేవదేవికి వైరాగ్యముపై మోజు కలిగింది.

సారంగుతమ్మయ్య కావ్యరచనలో ముందువారి కంటె ముందడుగు వేసినట్లు కాన్పిస్తుంది.

ఈ మూడు కావ్యాలకు ముప్పురు ప్రభావతి ప్రద్యుమ్నమునకు శ్రీ విశ్వనాథ, మొల్లరామాయణమునకు శ్రీ బొమ్మకంటి, వైజయంతీ విలాసమునకు శ్రీ స్వామి శివశంకరస్వామి పీఠికలు వ్రాశారు. ఇందులో మొల్లరామాయణమునకు శ్రీ బొమ్మకంటి వ్రాసిన పీఠిక తక్కినవాటికంటె మేల్తరముగా నున్నది.

(వీనిని ప్రచురించినది యమ్. శేషాచలం అండ్ కో మద్రాసు—మచిలీపట్నం — సికింద్రాబాదు. వెల. రూ. 2—00; 2—50; 2—50.)

—రామమోహన్.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S Sambhu Prasad.

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/– | రు. 150/– |
| 2 లేక 3 వ కవరు పేజి ... | | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 150/– | రు. 125/– |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 125/– | రు. 100/– |
| అర పేజి | ... | రు. 65/– | రు. 55/– |
| పావు పేజి | ... | రు. 40/– | రు. 35/– |

ప్రత్యేక స్థానములకు 25% అదనం,
సం॥నకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12–00 |
| 6 మాసముల చందా | ... | రు. 6–00 |
| విడి ప్రతి | ... | రు. 1–00 |

మేనేజరు, భారతి
మద్రాసు–1.